# కథాసాగరము





రచన

M. ప్రేమలత






పబ్లికేషన్స్
జెండావీధి - ఏలూరురోడ్
విజయవాడ - 2.

ప్రథమ ముద్రణ :
సెప్టెంబర్ 1980

వెల : 14-00

సంపాదకులు :
వి. వెంకట్రావ్

ముద్రణ :
వెంకటరత్నా ప్రింటర్స్,
ఏలూరురోడ్, విజయవాడ-2.

# నక్క చేసిన మేలు

అది ఒకచక్కని తోట. దానియజమానుడు ఒకరాజు ఆ అందాల తోటలో బంగారు ఆపిలు పండ్లు కాసే చెట్టు ఒకటి ఉంది. ఆ చెట్టు కాయలను ప్రతిరోజూ లెక్కించే వాడు. అవి పళ్ళుగా తయారయ్యేసరికి ప్రతి రాత్రీ ఒక పండు పోతుండేవి. రాజుకు అపరిమితమైన కోపం వచ్చేది. అతడు తోటమాలిని పిలిపించి, "రాత్రి అంతా చెట్టుకిందే వుండు. జాగ్రత్తగా పళ్ళను రక్షించు." అని చెప్పాడు. తోటమాలి తన పెద్దకుమారుని ఆ పనికి నియోగించాడు. అతడు రాత్రి పన్నెండు గంటలవరకు మాత్రమే మెలుకువతో ఉన్నాడు. తరువాత నిదురించాడు. తెల్లవారిం తరువాత పళ్ళను లెక్కిస్తే ఒక పండు తగ్గివుంది. అంచేత రెండో కుమారుడు చెట్టు కాపలాకు నియమింపబడ్డాడు. అర్థ రాత్రి అయిన తరువాత అతడుకూడా నిదురించాడు. తెల్లవారిన తడువాత మరో పండు తగ్గినట్టు కనుక్కున్నారు. ఇక తాను కాపలా ఉంటానని మూడో కుమారుడు అన్నాడు. అతనికేమయినా హాని జరుగుతుందని మొట్టమొదట తోటమాలి అంగీకరించలేదు. ఎట్టకేలకతడు అంగీకరించాడు. మూడో కుమారుడు చెట్టుక్రింద కూర్చుని వున్నాడు, రాత్రి పన్నెండు గంటలయ్యేసరికి అతనికి గాలిలో రెప రెప ధ్వని వినబడింది.

ఒక బంగారు పక్షి ఎగురుతూ వచ్చి చెట్టు మీద వ్రాలింది. అది ఒక పండును తిని ముక్కుతో పొడుస్తుండగా. తోట మాలి కొడుకు లేచి, దానిపై ఒక అమ్మును విసిరాడు. కాని ఆ అమ్ము పక్షికి ఎటువంటి హాని కలుగ జేయలేదు. పక్షి తన తోకనుండి ఒక బంగారపు ఈకను క్రిందకు రాల్చి ఎగిరి పోయింది. తెల్లవారిందరువాత ఆ ఈకను రాజు వద్దకు తీసు కొని వెళ్ళారు. రాజు తన సలహాదారులందరిని సమా వేశ పరచాడు. ఆ ఈక చాలా విలువయినదని అందరూ అంగీకరించారు. రాజు వారితో ఇలా అన్నాడు: "ఈ ఒక్క ఈకతో నాకు సంతృప్తి లేదు. నాకు ఆ బంగారు పక్షి కావాలి."

తోటమాలి పెద్ద కొడుకు బంగారు పక్షిని పట్టుకో టానికి బయలుదేరాడు. దానిని సులభంగా పట్టుకోవచ్చని అతడు అనుకున్నాడు. అతడు కొంతదూరం వెళ్ళిందరువాత ఒక అడవి వచ్చింది, అక్కడ అతనికి ఒక నక్క కనిపించింది పెద్దవాడు ఆ నక్కమీద అమ్ము విసరటానికి సిద్ధ పడ్డాడు. కాని నక్క ఇలా అంది: "నా మీద అమ్ము విసరకు. నీకు మంచి సలహా యిస్తాను. నీవు ఏ పనిమీద పోతున్నావో నాకు తెలుసు. బంగారు పక్షి కోసం పోతున్నావు. సాయం కాలమయ్యే సరికి నీవో గ్రామం చేరుకుంటావు. అక్కడ నీకు ఒకదానికొకటి ఎదురుగా వున్న రెండు పూటకూళ్ళ ఇళ్ళు కనబడతాయి. ఒకటి చూడటానికి చాలాఅందంగావుంటుంది రెండోది సామాన్యంగా కనపడుతుంది. నీవు మొదటి దాని లోకి పోవద్దు. రెండోదానిలోకే పో" ఆ మాటలు విన్న

పెద్దవాడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "ఈ జంతువుకు ఈ విషయం గూర్చి ఏమి తెలుస్తుంది?" అతడలా అనుకొని నక్కపైకి అమ్ము విసిరాడు. అది నక్కకు తగులలేదు. నక్క అడవిలోకి పారిపోయింది. పెద్దవాడు తన దారిని పోయాడు. సాయంకాలం అయ్యేసరికి అతడో గ్రామం చేరుకున్నాడు. అతనికి రెండు పూటకూళ్ళ ఇల్లు కనిపించాయ్. ఒకదాంట్లో జనులు ఆడుతూ, పాడుతూ భోజనం చేస్తున్నారు. రెండోపూటకూళ్ళ ఇల్లు చూడటానికి చాలా అసహ్యంగా ఉంది. "అందమయిన ఇల్లు వదిలిపెట్టి అసహ్యకరమయిన ఇంట్లోకి వెళ్ళటం కంటె తెలివితక్కువపనిఇంకొకటి ఉండదు" అని పెద్దవాడనుకుని అందమయిన ఇంటిలో ప్రవేశించాడు. అతడచ్చట తన ఇష్టంవచ్చినట్లు తిని, త్రాగి బంగారు పక్షిని, తన రాజ్యాన్ని మరచిపోయాడు.

కాలం గడిచిపోతుంది. పెద్దవాడింటికి తిరిగిరాలేదు. కనీసం అతనికి సంబంధించిన వార్తలయినా తెలియలేదు. అంతట రెండోకొడుకు బంగారు పక్షిని తీసుకురావటానికి బయలుదేరాడు. అతనికి కూడా నక్క కనిపించి పూర్వం చెప్పినట్లు చెప్పింది. సాయంకాలం అయ్యేసరికి అతడు పెద్దవాడున్న గ్రామం చేరుకున్నాడు. పెద్దవాడు తమ్ముని లోనికి రమ్మని పిలిచాడు. రెండోవాడు లోనికి వెళ్ళాడు. అతడు సుఖాలలో మునిగిపోయి అన్నివిషయాలూ మరచిపోయాడు.

మరికొంతకాలం గడిచింది. బంగారు పక్షిని తీసుకు రావటానికి తాను వెళతానని మూడో కొడుకు తండ్రితో అన్నాడు. అప్పుడు తండ్రి కొడుకుతో యిలా అన్నాడు— “నువ్వంటే నాకు యెంతో ప్రేమ-నేను నిన్ను వదిలిపెట్టి ఉండలేను అదీగాక నీకు కూడా ఏమయినా అపాయం సంభవించ వచ్చును. అప్పుడు నీవిక్కడకు తిరిగి రాలేవు” మూడో కొడుకు ఇంటివద్ద ఉండటానికిమాత్రం యిష్టపడలేదు. అంచేత తండ్రి కొడుకు ప్రయాణానికి అంగీకరింపవలసి వచ్చింది. మూడోకొడుకు ప్రయాణమై పోయి అడవి చేరుకున్నాడు. అక్కడ అతనికి నక్క కనిపించి ఇదివరకు వలెనే సలహా ఇచ్చింది. అతడందుకు కృతజ్ఞత తెలిపాడు. తన సోదరులవలె నక్కకు హానిచేయటానికి ప్రయత్నించలేదు. అంచేత నక్క ఇలా అంది: “నీవు నా తోకమీద కూర్చో నీవు వేగంగా పోగలవు. మూడోవాడు నక్క తోక మీద కూర్చున్నాడు. నక్క పరుగెత్త సాగింది. సులభంగా మొదటివారిద్దరు ఉన్న గ్రామం చేరుకుంది.

మూడోవాడు నక్క ఇచ్చిన సలహా ననుసరించి చూడటానికి అందంగాలేని పూటకూళ్ళ ఇంటిలో ప్రవేశించాడు. ఆ రాత్రి కచ్చట నిద్రించాడు. తెల్లవారింతర్వాత అతడు మళ్ళీ ప్రయాణం ప్రారంభించాడు. అప్పుడు నక్క అతనిని కలుసుకుని ఇలా చెప్పింది. “దుర్గం ఒకటి కనిపించే వరకు తిన్నగా ముందుకు పో! ఆ దుర్గంలో ఒక సైనికదళం

వారు గుర్రకలు పెడుతూ నిదురిస్తుంటారు. నీవు వారిని లెక్క చేయక లోనికి ప్రవేశించు. కఱ్ఱ పంజరంలో బంగారుపక్షి ఉండే గది వచ్చేవరకు తిన్నగా పో.

బంగారు పక్షిని కఱ్ఱపంజరంలోంచి బయటకు తీసి బంగారు పంజరంలో పెట్టటానికి ప్రయత్నించకు. అలా చేస్తే నీవు తరువాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది" అలా అని అది తోక చూపింది. మూడోవాడు దానిమీద కూర్చు న్నాడు. నక్క వేగంగా పరుగెత్త సాగింది. ఎట్టకేలకు దుర్గం చేరుకుంది. దుర్గంలో నక్క చెప్పినట్లె సైనికులు నిద్రిస్తు న్నారు. మూడోవాడు లోనికివెళ్ళి కఱ్ఱ పంజరమున్న గదిని చేరుకున్నాడు. ఆ పంజరం వద్దనే బంగారు పంజరంకూడా ఉంది: కర్ర పంజరంలో ఉన్న బంగారు పక్షిని చూచి మూడోవాడు ఇలా అనుకున్నాడు: "ఇంత అందమైన పక్షిని కర్ర పంజరంలో తేవటంకంటే ఘోరమైన పని ఇంకొకటి యుండదు" అతడలా అనుకుని కర్రపంజరంలోని పక్షిని బయటకు తీసి బంగారు పంజరంలో పెట్టాడు. కాని బంగారు పక్షి గట్టిగా ధ్వనిచేయ సాగింది. ఆ ధ్వనికి దుర్గం ముందున్న సైనికులు మేల్కొని లోనికివచ్చి మూడోవానిని పట్టు కొని బంధించారు. తమ రాజు వద్దకు తీసుకుపోయారు. మూడోవాని నేరాన్ని విచారణ చేసి అతనికి మరణశిక్షను విధించారు. కాని ఆ శిక్షకు ఒక మినహాయింపు చెప్పారు-

"నీవు బంగారు గుర్రాన్ని తెచ్చి ఇస్తే నీకు మరణశిక్ష ఉండదు. అంతేగాక నీకు బంగారు పక్షిని ఇస్తాం" అని అధికారులు అతనికి తెలిపారు.

మూడోవాడు విచారిస్తూ తిరిగి ప్రయాణం సాగించాడు. తోవలో నక్క అతనిని కలుసుకుని ఇలా అంది: "నీవు నేను చెప్పినట్లు చేయకపోవటం వలన ఏమి జరిగిందో చూశావుగదా? అయినా నేను చెప్పినట్లు చేయడానికిసిద్ధంగా ఉంటే బంగారు గుర్రం సంగతి నేను చెబుతాను. నీవు తిన్నగా ఒక దుర్గం చేరుకునేవరకూ ప్రయాణం చేయాలి. ఆ దుర్గంలో బంగారు గుర్రం నిలబడియున్న అశ్వశాలలోకి వెళ్ళాలి. ఆ గుర్రం పక్కనే దాని నౌకరు గాఢంగా నిద్రిస్తుంటాడు. గుర్రాన్ని మెల్లగా బయటకు తీసుకురా. కాని ఒక ముఖ్యవిషయం జ్ఞాపకముంచుకో. గుర్రంపై తోలు జీను వెయ్యి. బంగారుజీను వేయకు" అంతట మూడోవాడు నక్కతోకమీద కూర్చున్నాడు. నక్క గాలికంటే వేగంగా పరుగెత్త సాగింది.

అంతా సవ్యంగా జరిగింది. నౌకరు బంగారు గుర్రం వద్ద నిదురిస్తున్నాడు. మూడోవాడు బంగారు గుర్రాన్ని చూడగానే దానిమీద తోలు జీను వేయటం బాగుండదని తలచాడు. అతడు బంగారు జీనును ముట్టుకోగానే నౌకరు

నిదురనుండి లేచి గట్టిగా అరిచాడు. రక్షకభటులు వచ్చి మూడోవానికి మరణశిక్ష విధించబడింది. కాని అందమయిన రాజకుమారిని తెచ్చి ఇస్తే ఆ శిక్ష రద్దుచేయబడుతుందని బంగారు పక్షి, బంగారు గుర్రం ఈయబడతాయనీ అధికారు లతనికి చెప్పారు.

మూడోవాడు విచారంతో మరల ప్రయాణం సాగించాడు. కాని నక్క అతనిని కలుసుకుని ఇలా అంది. "నీవు నామాట ఎందుకు వినలేదు? వినిఉంటే బంగారు పక్షిని, బంగారు గుర్రాన్ని తీసుకుపోయి ఉండేవాడవు. అయినా నీకింకోసారి మంచి సలహా ఇస్తాను. తిన్నగా పోయి సాయంకాలం అయ్యేసరికి ఒక దుర్గం చేరుకో రాత్రి పండ్రెడు గంటలకు రాకుమారి స్నానాల గదికి పోతుంది: నీవప్పుడామెను సమీపించి ఒక్క ముద్దు పెట్టుకో. అప్పుడామె నిన్ను ముందుదారి తీయనిస్తుంది. నీతో పారిపోటాని కంగీకరిస్తుంది. కాని ఆమె తన తల్లి దండ్రులవద్ద సెలవు తీసుకురావటానికి అంగీకరించకు:" మూడోవాడు నక్కతో క మీద కూర్చున్నాడు: నక్క లేడివలె పరుగెత్తి సాగింది.

మూడవవాడు దుర్గం చేరుకున్నాడు. అంతా నక్క చెప్పినట్లే ఉంది: రాత్రి పండ్రెండు గంటలైన తరువాత మూడవవాడు స్నానం చేయటానికి వెళ్తున్న రాకుమారిని

కలుసుకుని ఒక్కసారి ముద్దు పెట్టుకున్నాడు. అతనితో పారి పోటానికి రాకుమారి అంగీకరించింది. "నా తల్లి దండ్రులవద్ద సెలవు తీసుకు వస్తాను" అని రాకుమారి కన్నీరు కారుస్తూ ప్రార్థించింది. అతడందుకు అంగీకరించలేదు. రాకుమారి ఇంకా ఎక్కువగా ఏడువసాగింది. అతని పాదాల మీద పడింది. ఎట్టకేలకతడామె కోరికను అంగీకరించాడు. ఇరువురూ కలసి ఆమె తండ్రి గది వద్దకు వచ్చారు. వెంటనే రక్షక భటులతనిని బంధించారు.

మూడవ వానిని రాజు వద్దకు తీసుకు వచ్చారు. రాజు అతనితో ఇలా అన్నాడు. "నీవు ఎనిమిది రోజులలో నా కిటికీలో నుండి నా ఇష్టం వచ్చినంత దూరం చూడటానికి వీలు లేకుండా అడ్డగానున్న కొండను త్రవ్వి వేయాలి. అలా చేయలేకపోతే నీవు నా కూతురును ఎప్పటికీ పొందలేవు." కొండ చాలా పెద్దది. దానిని త్రవ్వటం మానవసాధ్యమైన పని ఏ మాత్రం కాదు. అయినా మూడవవాడు కొండను త్రవ్వనారంభించాడు. ఏడు రోజులయ్యే సరికి జరిగిన పని అది స్వల్పంగా ఉంది. అప్పుడు నక్క అతని వద్దకు వచ్చి ఇలా అంది: "నీవు పోయి నిదురపో. నీ బదులు నేను పని చేస్తాను." మూడోవాడు ఆనందంతో నిదురించాడు. తెల్లవారిం తరువాత చూచే సరికి అతనికి కొండ కనిపించలేదు. అందువలన అతడు సంతోషంతో రాజు వద్దకుపోయి, "అయ్యా! కొండను పూర్తిగా త్రవ్వాను. కనుక రాకుమారిని నాకు ఇయ్యండి" అని అన్నాడు.

రాజు తానన్న మాటను నిలబెట్టుకోవడం కోటం

రాకుమారిని మూడోవానికి ఇచ్చాడు. మూడోవాడు రాకుమారితో తిరుగు ముఖం పట్టాడు. నక్క అతనితో ఇలా ఇలా అంది. "మనం రాకుమారిని, బంగారు గుర్రాన్ని బంగారు పక్షిని ఇంటికి తీసుకుపోవచ్చు." అప్పుడు అతను ఇలా అన్నాడు: "అది గొప్ప సంగతి కాని అలా చేయటం ఎలా సంభవిస్తుంది?"

"నేను చెప్పినట్టు నీవు వింటే అన్నీ సక్రమంగా జరుగుతాయి. నీవు రాజు వద్దకు వెళ్ళినపుడు రాజకుమారి ఏది అనిఅడుగుతాడు. ఇదుగో ఆమె, అని అను. అతడిచ్చేబంగారు గుర్రముపై ఎక్కు. అందఱితో కరచాలనం చెయ్యి. రాకుమారితో తుదిని చెయ్యి. అప్పుడామెను నీ వెనుకనే ఉండే గుర్రము పయికెక్కించు. ఇరువురూ కలిసి పారిపోండి." అని నక్క సలహా చెప్పింది.

అంతా సక్రమంగా జరిగింది. అప్పుడు నక్క ఇలా అంది. "నీవు బంగారు పక్షి ఉన్న దుర్గానికి వచ్చినప్పుడు నేను రాకుమారితో కలసి ద్వారం వద్ద వేచి యుంటాను. నీవు గుర్రంతో లోనికి వెళ్ళి రాజుతో మాట్లాడు. నీవుసరియైన గుర్రాన్నే తెచ్చావని అతడునమ్మిన తరువాతబంగారు పక్షిఅవునో కాదో పరీక్షిస్తానని చెప్పి చేతులోనికి తీసుకుని గుర్రంపై దుర్గద్వారం వద్దకి పరుగెత్తుకొని రా."

అంతా సవ్యంగా జరిగింది. మూడోవాడురాకుమారితోనూ, బంగారు పక్షితోను, బంగారు గుర్రంతోనుపోయి ఒక అడవిని చేరుకున్నాడు. అంతవరకూ అతనితోనే వున్న

నక్క అప్పుడిలా అంది, "దయ యుంచి నన్ను చంపి నా తలను ,కాళ్ళను ఖండించు." అలా చేయటానికి అతడు నిరాకరించాడు. అప్పుడు నక్క ఇలా అంది: "సరే నీకు మంచి సలహా ఇస్తాను. ఉరితీయబడటానికి సిద్ధంగా ఉన్నవారిని రక్షించకు. నదిఒడ్డున కూర్చుండకు." మూడోవాడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "ఈ సలహాను పాటించటం అంత కష్టమైన పని కాదు." అతడు తిరిగి పయనమయ్యాడు.

అతడు తన ఇద్దరు సోదరులు ఉన్న గ్రామం చేరుకున్నాడు. ఆ ఊళ్ళో గొప్ప కలకలం వినబడింది. "అది ఏమిటి?" అని అతడు కొందరిని అడిగాడు. "ఇద్దరు మనుజులు ఉరితీయ బడటానికి సిద్ధంగా వున్నారు" అని వారన్నారు. దగ్గరకుపోయి చూడగా ఆ ఇద్దరు అతని సోదరులే. వారు దొంగతనానికి పాల్పడటం వలన ఉరితీయ బడుతున్నారు. మూడవవాడు ఉరితీయుచున్న వానితో ఇలా అన్నాడు: వాళ్ళిద్దరినీ రక్షించటానికి మార్గం లేదా?" "ఒక్క మార్గం వుంది. చాలా ధనంఇచ్చి నీవీదుర్మార్గులను తీసుకుపోవచ్చు" అని అక్కడి వారు ఆలోచించి అన్నారు. మూడవవాడు నక్క ఇచ్చిన సలహాలను మరచిపోయి తనవద్దనున్న ధనమంతా వారికిచ్చి సోదరులను విడిపించాడు. ముగ్గురు సోదరులు కలసి తమ ఇంటికి ప్రయాణం సాగించారు.

ఎట్టకేలకు వారు మొట్టమొదట నక్కను కలుసుకున్న అడవి వద్దకు వచ్చారు. అక్కడి వాతావరణం చాలా మనోహరంగా వుంది. అంచేత పెద్దవాళ్ళిద్దరూ ఇలా అన్నారు:

"మనం నది ఒడ్డున విశ్రమిద్దాం. భుజిద్దాం." మూడవవాడు మళ్ళా నక్క ఇచ్చిన సలహాలను మరచిపోయి అంగీకరించాడు. అతను ఎట్టి అనుమానం లేక నది ఒడ్డున కూర్చున్నాడు. అప్పుడు ఇద్దరు సోదరులు వెనుకనుండి వచ్చి తమ్ముని క్రిందకు త్రోసివేశారు. పిమ్మట రాకుమారిని, బంగారు పక్షిని, బంగారు గుర్రమును తీసుకుని తమ ఊరికి వెళ్ళి రాజ దర్శనం చేసుకున్నారు. "మేము మా సాహస పరాక్రమాల వల్ల సంపాదించాం" అని ఆ సోదరులిద్దరూ రాజుకు చెప్పారు అప్పుడా ఊళ్ళో గొప్ప విజయోత్సవం చేయబడింది. కాని బంగారు గుర్రం ఏమీ తినటం లేదు. బంగారుపక్షి పాడటం మాని వేసింది. రాజకుమారి ఏడవ సాగింది.

మూడవవాడు నదిలో పడ్డాడు. కాని అదృష్టవశాన అతడు పడినచోట నీరు లేదు. అతని శరీరం మాత్రం బాగా దెబ్బతింది. గట్టు చాలా ఎత్తుగా వుండటంచేత అతను పైకెక్కి రావడానికి వీయిలేక పోయింది. అంతలో నక్క మరి ఒక సారి అక్కడకు వచ్చింది. "నీవు తెలివి తక్కువ వాడవు. మొదటి నుండీ నా సలహాలను తిరస్కరిస్తున్నావు. అంచేతనే నీకు ఆపదలు సంభవిస్తున్నాయి. అయినా నిన్నిప్పుడీ దుస్థితిలో విడువలేను. నా తోకను గట్టిగా పట్టుకుని

పైకిరా" అని నక్క చెప్పింది. మూడవవాడు నక్కతోకను గట్టిగా పట్టుకున్నాడు. అప్పుడు నక్క అతనిని పైకితీసి ఇలా అంది: "నీవు మీ ఊరికి పోతే పట్టుకు చంపటానికి నీ సోద రులు కుట్ర పన్నుతున్నారు."

అందువలన అతడొక బీదవాని వేషం వేసుకుని ఊరికి వెళ్ళి రాజస్థానంలో ప్రవేశించాడు. వెంటనే బంగారు గుర్రం ఆహారం తీసుకో సాగింది. బంగారు పక్షి మనోహ రంగా పాడ సాగింది. రాకుమారి ఏడ్పు మానింది, అతడు తిన్నగా రాజు దగ్గరకు వెళ్ళి తన సోదరులు చేసిన దుర్మా ర్గమంతా వివరించి చెప్పాడు. రాజు సోదరులనిద్దరినీ పట్టుకొని శిక్షించాడు. మూడవవాడు రాకుమారిని వివాహమాడి రాజు మరణించిన తరువాత తానే రాజయ్యాడు.

చాలా కాలమైన తరువాత అతడు మొదట నక్కను కలుసుకున్న అడవి వద్దకు వెళ్ళాడు. అచ్చట ముసలినక్క అతనిని కలుసుకొని కన్నీటితో ఇలా అంది: "నన్ను చంపి తలను, పాదాలను ఖండించు." విధిలేక అతడలా చేశాడు. వెంటనే ఆ నక్క మనుజుడుగా మారింది. అతడు ఎవరు? మూడవవాడు ముద్దుపెట్టుకొని జయించిన రాకుమారి సోద రుడు!

# గ్రెటెల్ కథ

ఒక ఊరిలో ఒక యువతినివసిస్తుండేది. ఆమె పేరు గ్రెటిల్ ఆమె సాధారణంగా ఎర్రని మడమలు గల చెప్పులు ధరిస్తుండేది. ఆమె ఎక్కడికైనా పోవలసివచ్చినప్పుడు ఆ చెప్పులతో విలాసంగా నడుస్తే, "నేను ఎంత అందమైన దానను!" అని అనుకుంటుండేది. ఆమె ఇంటికి తిరిగి వచ్చిన తరువాత ఉత్సాహం పెరగటానికి కొద్దిగా ద్రాక్షసారాయం సేవించేది. ద్రాక్షసారాయం సేవించినవారికి భోజన పదార్థముల యందు ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. కనుక ఆమె వంట చేస్తున్నపుడు ప్రతి పదార్థాలన్నీ రుచి చూస్తుండేది. "వస్తువులరుచిని ముందుగా తెలుసుకోటం వండేవారి ముఖ్య కర్తవ్యం" అని ఆమె అనుకునేది.

ఒకనాడు ఆమె యజమానుడు ఇలా అన్నాడు: గ్రెటిల్! ఈ సాయంకాలం నాతో కలసి భోజనం చేయటానికి ఒక స్నేహిడు వస్తాడు. కనుక రెండు కోళ్ళను సిద్ధంచేసి ఉంచు." "మీరు చెప్పిన ప్రకారం చేస్తాను" అని ఆమె అంది. పిమ్మట ఆమె రెండు కోళ్ళను చంపి వాటిని పరిశుభ్ర

పరచింది. సాయంకాలం అయిన తరువాత ఆమె కోళ్ళను వండ సాగింది. తయారైన పదార్థం చూడటానికెంతో అందంగా ఉంది. చక్కని సువాసన వేస్తోంది. అతిథి మాత్రం ఎంతసేపటికీ రాలేదు. అప్పుడామె యజమానునితో ఇలా అంది: "యజమానుడా! అతిథి రాకపోతే వండిన కోళ్ళను పొయ్యిమీదనుంచి కిందకు దింపవలసి ఉంటుంది. కాని వేడి చల్లారింతరువాత కోళ్ళను తింటం అవమానకరం; విచారకరం."

"నువ్వు చెప్పినమాట నిజమే. నేను పరుగెత్తుకు పోయి అతిథిని తీసుకువస్తాను" అని యజమానుడు అన్నాడు. పిమ్మట అతడు ఇల్లు వదిలి వెళ్ళాక, అప్పుడామె ఇలా అనుకుంది: "వారు ఎంతసేపటికి తిరిగి వస్తారో ఎవరికి తెలుసు? ఈలోపల నేను కొంచెం ద్రాక్షసారాయం సేవిస్తాను." పిమ్మట ఆమె ద్రాక్షసారాయం ఉన్న గదిలోకి వెళ్ళి త్రాగదలచినంత సారాయం సేవించింది. తన్ను తానెంతో అభినందించుకుంది. తరువాత ఆమె వంట ఇంటిలోకి వచ్చింది.

కోళ్ళు చక్కని సువాసన వేస్తున్నాయి. అప్పుడామె తనలో తాను ఇలా అనుకుంది. "కోళ్ళు బాగానే ఉన్నాయి. కాని ఇంకేమైనా లోటుందేమో తెలియదు. అందుచేత నేను కొంచెం రుచి చూస్తాను." ఆమె కోళ్ళమీద వ్రేళ్ళు పెట్టి ఆ వ్రేళ్ళను నోట్లో పెట్టుకుంది. అది ఆమెకెంతో రుచికరంగా ఉంది. అప్పుడామె ఇలా అనుకుంది: "ఎంత బాగుంది! వీటిని తినక పోవటం ఎంతో విచారకరం; అవమానకరం." పిమ్మట నామె అతిథి, యజమానుడు వస్తున్నారేమో అని

గుచ్చాను." "ఎంతపని చేశాను! నీవు దానిని చొక్కా చేతికి గుచ్చి ఉండవలసింది." "ఈసారి నేను అలాగే చేస్తాను."

"హాన్స్! ఇప్పుడు ఎక్కడకు వెళుతున్నావు?" "గ్రెటెల్‌ను చూడటానికి వెళుతున్నాను." "అక్కడసరిగా ప్రవర్తించు." "అలాగేనమ్మా." హాన్సు గ్రెటెల్ వద్దకు వెళ్ళి, "సుదినము, గ్రెటెల్!" అని అన్నాడు. "సుదినము, హాన్స్! నువ్వు నాకేమి తీసుకు వచ్చావు?" "ఏమీ తీసుకు రాలేదు. నువ్వు నాకు ఏమిటి ఇవ్వబోతున్నావు?" గ్రెటెల్ హాన్సుకు ఒక చాకు ఇచ్చింది. "ఇంక పోయి వస్తా." "మంచిది. పోయిరా." అతడు చాకును చొక్కా చేతికి గుచ్చుకుని ఇంటికి వెళ్ళాడు. "వచ్చానమ్మా." "వచ్చావా? ఎక్కడకు వెళ్ళావు?" "గ్రెటెల్ వద్దకు వెళ్ళాను." "ఆమెకు ఏమి తీసుకు వెళ్ళావు?" "ఏమీ తీసుకు పోలేదు." "ఆమె నీకు ఏమి ఇచ్చింది?" "ఒక చాకు ఇచ్చింది." "దానిని ఎక్కడ ఉంచావు?" "చొక్కా చేతికి గుచ్చాను." "మూర్ఖుడా! దానిని నీవు జేబులో పెట్టుకొని ఉంటే బాగుండేది."

"ఎక్కడకు పోతున్నావు, కొడుకా!" "గ్రెటెల్ వద్దకు వెళుతున్నాను." "మర్యాదగా ప్రవర్తించు." నీమాట ప్రకారం నడుచుకుంటూ నమ్మా! "అతడామెవద్దకు వెళ్ళి, "సుదినము, గ్రెటెల్!" అని అన్నాడు. "సుదినము, హాన్స్ నువ్వు నా కేమైనా బహుమానం తీసుకు వచ్చావా?" "లేదు. నువ్వు నాకేదలునా బహుమానం ఇస్తావా?" ఆమె ఇతనికొక మేకపిల్లను ఇచ్చింది.

అతడు దానినిగట్టిగా కట్టివేసి జేబులో కుక్కున్నాడు. పిమ్మట అతడు ఇంటికి వెళ్ళాడు. "అమ్మా, వచ్చాను." "ఎక్కడకు వెళ్ళావు?" "గ్రెటెల్ వద్దకు వెళ్ళాను." "ఆమె నీకు ఏమి ఇచ్చింది?" "మేకపిల్లను ఇచ్చింది." "దానిని ఎక్కడ పెట్టావు?" "జేబులో పెట్టాను." అని హాన్సు ప్రాణం లేని మేకపిల్లను బయటకు తీశాడు. "తెలివి తక్కువ వాడా! నీవు దానిని త్రాటితో కట్టి తీసుకు వచ్చి యుండవలసింది." "ఇకముందు జాగ్రత్తగా ఉంటాను."

"హాన్స్! నేడు ప్రయాణం ఎక్కడికి?" "గ్రెటెల్ ఇంటికి వెళుతున్నానమ్మా!" "ఆమెకు నచ్చే విధంగా నడుచుకో." "అలాగేనమ్మా!" అతడు ఆమె ఇంటికి వెళ్ళాడు. "సుదినం, గ్రెటెల్!" "సుదినం, హాన్స్! నీవునాకేమి తీసుకు వచ్చావు?" "ఏమీ తీసుకు రాలేదు. నీవు నాకేమైనా ఇస్తావా?" ఆమె అతనికొక రొట్టె ఇచ్చింది. అతడు రొట్టెకొక త్రాడు కట్టి దానిని యీడ్చుకుంటూ ఇంటికి పోసాగాడు. త్రోవలో ఒక కుక్క ఆ రొట్టెను పూర్తిగా ఆరగించింది. "నేను వచ్చానమ్మా!" "ఎక్కడకు వెళ్ళావు, నాయనా!" "గ్రెటెల్ ఇంటికి వెళ్ళాను." "ఆమెకు ఏమి ఇచ్చావు?" "ఏమీ ఇవ్వలేదు." "ఆమెనీకు ఏమీ ఇచ్చింది." "దానిని ఎక్కడ దాచావు?"

రొట్టెకు త్రాడుకట్టి యీడ్చుకుంటూ వచ్చాను. రొట్టె మాత్రం మాయమైంది." "మూర్ఖుడా! నీవు దానిని నెత్తి మీద పెట్టుకొని రావలసింది." "ఇకముందు అలాగే చేస్తానమ్మా!"

"ఇప్పుడెక్కడికి ప్రయాణం, కుమారా!" "గ్రెటెల్‌తో మాట్లాడటానికి వెళుతున్నానమ్మా!" "జాగ్రత్తగా మాట్లాడు." "నీమాట ప్రకారమే నడుచుకుంటాను." అతడామె వద్దకు వెళ్ళి, "సుదినం, గ్రెటెల్!" అని అన్నాడు. "సుదినం నువ్వు నాకేమి ఇస్తావు?" "నీకివ్వటానికి నా వద్ద ఏమీ లేదు. నువ్వు నాకేమి ఇస్తావు?" ఆమె అతనికొక ఆవు దూడను ఇచ్చింది. అతడు దానిని నెత్తిమీద పెట్టుకొని ఇంటికి బయలు దేరాడు: ఆ దూడ అతని ముఖాన్ని ఇచ్చ వచ్చినట్లు తన్న సాగింది. "తిరిగి వచ్చానమ్మా!" "నీవెక్కడకు వెళ్ళావు?" "గ్రెటెల్ ఇంటికి వెళ్ళాను." "నీవుఆమెకు ఏమి ఇచ్చావు?" "నేను ఆమెకు ఏమీఇవ్వలేదు." "ఆమె నీకు ఏమి ఇచ్చింది?" "ఒక ఆవు దూడను ఇచ్చింది." "అది ఎక్కడ ఉంది?" "నేను దానిని నెత్తిమీద పెట్టుకొని వస్తుండగా ముకం కాళ్ళతో తన్నింది. నా మొగమంతా గీరుకుపోయింది." "మూర్ఖుడా! నీవు దాని మెడకు తాడుకట్టి నడిపించుకొని తీసుకువచ్చి పశువుల శాలలో కట్టివేసి యుండవలసింది." "ఇకముందు నేను అలాగుననే చేస్తానమ్మా."

"ఎక్కడకు పోతున్నావు, కొడుకా!" "గ్రెటెల్‌ను చూడటానికి వెళుతున్నాను." "జాగ్రత్తగా ప్రవర్తించు." "నీ మాట జవదాటను. ఇక సెలవు, తల్లీ!" అతడు ఆమె ఇంటికి వెళ్ళాడు. "సుదినము, గ్రెటెల్!" "సుదినము, హాన్స్! నీవు నాకేమిటి తీసుకు వచ్చావు?" "ఏమీ తీసుకు రాలేదు, నువ్వు నాకేమి ఇస్తావు?" "నేను నీతో మీఇంటికి వస్తాను." అతడు ఆమె మెడకొక త్రాడుకట్టి దానిని పట్టు

కొని ఇంటికి వెళ్ళాడు. అచ్చట ఆమెను పశువుల పాకలో కట్టివేశాడు. "వచ్చావమ్మా!" "ఎక్కడకు వెళ్ళావు?" "గ్రెటెల్ వద్దకు వెళ్ళాను." "నీవుఆమెకు ఏమిఇచ్చావు?" "నేనేమీ ఇవ్వలేదు." "ఆమెనీకు ఏమి ఇచ్చింది?" "ఆమే నాతోవచ్చింది." "ఆమెను ఎక్కడ ఉంచావు?" "పశువుల పాకలో కట్టివేశావు." "ఆమెను ఎంతో మర్యాదగా యింట్లోకి తీసుకు రావాలి గాని అలా చేస్తారా?" అపుడతడు పశువుల పాకలోకి వెళ్ళాడు. గ్రెటెల్ అపరిమితమైన కోపంతో అప్పటికే ఆ ప్రదేశంనుండి పారి పోయింది. పారిపోతే మాత్రం నష్టం ఏమి వచ్చింది? గ్రెటెల్ ఇక హాన్సు భార్యయే గదా!

# 3

హాన్సు, గ్రెటెల్ కలసి ఒక ఇంటిలో నివసింపసాగారు. కాని ఆమె తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించేది. ఆమె సోమరి; ఏ పనీ చేసేది కాదు. అతడు నూలు వడకమని ఆమెకు ప్రత్తి ఇచ్చేవాడు. ఆమె సాధారణంగా ఆ పని చేసేది కాదు. ఒకవేళ చేసినా దారం కండెకు చుట్టేది కాదు. అతడామెను మందలించే వాడు. కాని ఆమె అంతకు

కిటికీలోనుంచి బయటకు తొంగి చూసింది. కాని కను చూపు దూరంలో ఆమె కెవ్వరూ కనిపించలేదు. అందుచేత ఆమె కోడిలో కొంత భాగం తినాలని నిశ్చయించుకుంది. ఆమె ఒక చాకుతో కొలది భాగం కోసి తింది. అది ఆమెకెంతో రుచి కరంగా ఉంది. అప్పుడామెకు మరి కొంచెం తినాలనే అభి ప్రాయం పుట్టింది. వెంటనే ఆమె మరి కొంత భాగంకోసి తింది. పిమ్మట ఆమె యజమానుడు ఇంటికి తిరిగి వస్తున్నా డేమో అని కిటికీలోనుంచి బయటకు చూచింది. యజమా నుడామెకు ఏ మాత్రం కనిపించలేదు. అప్పుడామె ఇలా అనుకుంది; "వారసులు వస్తారో రారో ఎవరికి తెలుసు? వారే పూటకూళ్ళ ఇంటికైనా వెళ్ళారేమో! ఓ గ్రెటెల్! నీవు సుఖపడు మరి కొంచెం ద్రాక్షసారాయం త్రాగు కోడిలో మిగిలిన భాగం కూడా తిను. కోడినంతనూ తిని వేయటం మంచిది. అంతా తిన్న తరువాత సుఖంగా ఉంటుంది." వెంటనే ఆమె మళ్ళీ ద్రాక్షసారాయం ఉన్న గదిలోకి వెళ్ళి కావలసినంత ద్రాక్షసారాయం సేవించింది. పిమ్మట ఆమె అపరిమితమైన సంతోషంతో కోడిలో మిగిలి యున్న భాగం కూడా తిని వేసింది.

కొంత కాలం గడిచింది. యజమానుడు ఇంకా ఇంటికి తిరిగిరాలేదు, అప్పుడామెకన్ను రెండో కోడిమీద కూడా పడింది. అప్పుడామె ఇలా అనుంది. "మొదటికోడి ఎక్కడకు పోయిందో, రెండో కోడికూడా అక్కడకు పోవ లసిందే రెండూ ఒకదానికొకటి సంబంధించినవే. ఒకదానిని

తింటానికి హక్కు ఉన్నవారికి రెండో దానిని తింటానికి గూడా హక్కు ఉంది. రెండో కోడిని తింటానికి ముందు నేను కొద్దిగా ద్రాక్షసారాయం సేవిస్తాను.”

ఆమె మరల ద్రాక్షసారాయం ఉన్న గదిలోకిపోయి ఇష్టం వచ్చినంత సారాయం త్రాగింది. తరువాత మొదటి కోడితో సహవాసం చేయటానికి రెండో కోడిని కూడా లోపలకు పంపసాగింది. ఆమె ఆలాగున రెండో కోడికి న్యాయం చేకూరుస్తుండగా యజమానుడు ఇంటికి వచ్చి ఇలా అరిచాడు. “గ్రెటెల్! గ్రెటెల్! త్వరపడు త్వరపడు అతిథి వస్తున్నాడు.” “యజమానుడా! నేను అన్నీ సిద్ధం చేస్తాను” అని ఆమె జవాబిచ్చింది. అంతట యజమానుడు చాకుకు పదును పెట్టసాగాడు. అల్పకాలంలో అతిథివచ్చి వీధి తలుపును మెల్లన తట్టసాగాడు. ఆమె ఎవ్వరు వచ్చారో చూడటానికి వెళ్ళింది. ఆమె అతిథిని చూచి పెదవులపై వ్రేలు పెట్టుకొని ఇలా అంది, “హుష్! హుష్! నీవు శక్తి అంతా ఉపయోగించి వెనుకకు తిరిగిపో. నా యజమానుడు నిన్ను పట్టుకుంటే నీకు ఎంతో హాని కలుగుతుంది. నా యజమానునికి నీ వంటే ఎందుకో తీవ్రమైన ద్వేషం ఏర్పడింది. నీ చెవులు కోసివేయటానికి నిన్ను భోజనానికి పిలిచాడు. అదుగో చాకును నూరుతున్న సవ్వడి విను.” అతిథి వినసాగాడు. అతనికి యజమానుడు చాకును నూరుతున్న సవ్వడి వినిపించింది. వెంటనే అతిథి రెండు కాళ్ళకు బుద్ధి చెప్పి [illegible] మాత్రం [illegible]ంచసాగాడు.

ఈలోపల గ్రెటెల్ ఊరుకోలేదు. ఆమె ఇలా

గట్టిగా అరవసాగింది; "ఓ యజమానుడా! యజమానుడా! నీవు ఎటువంటి అతిథిని సంపాదించావు! ఎటువంటి అతిథిని సంపాదించావు!" "గ్రెటెల్! ఏమిజరిగింది? ఏమిజరిగింది?" అని యజమానుడు ఆతృతతో ప్రశ్నింప సాగాడు. "ఏముంది? నేను రెండు కోళ్ళను చేత్తో పట్టుకున్నాను. మీ అతిథి రెండిటినీ నావద్దనుండి లాగుకొని పారిపోయినాడు!" అని గ్రెటెల్ సమాధానం ఇచ్చింది. అతిథి రెండు కోళ్ళను దొంగిలించుకు పోయాడన్న విచారంతో యజమానుడు ఇలా అన్నాడు! "అతడు ఎంత దుర్మార్గపు పనిచేశాడు! అతడు వట్టి హీనునివలె ఉన్నాడు! అతడు నాకు ఒక్క కోడిని వదిలిపెట్టి ఉంటే ఎంతో బాగుండేది. అతనిని పిలు! అతనిని పిలు!"

గ్రెటెల్ గట్టిగా పిలువసాగింది. కాని అతిథి మాత్రం ఆమె మాటలను ఏ మాత్రం లెక్కించటంలేదు. అంతట యజమానుడు చేతిలో ఉన్న చాకుతోనే అతిథి వెంట పరుగెత్త సాగాడు. "ఒక్కటి! ఒక్కటి! నాకొక్కటి చాలును!" అని అతడు అనసాగాడు. అతిథి రెండు కోళ్ళను తీసుకుపోతున్నాడనే ఉద్దేశంతో తనకో కోడినిమ్మని యజమానుడు కోరుతున్నాడు. కాని అతిథి ఇలా అర్థం చేసుకున్నాడు, "ఇతడు నా రెండు చెవులనూ కోసివేయాలనుకున్నాడు. ఇప్పుడు కనీసం ఒక్క చెవినైనా కోసుకోనిమ్మంటున్నాడు. ఇతని చేతిలో చాకు కూడా ఉంది." అతడు యజమానుని మాటలను లక్ష్య పెట్టక ముందుకు పరుగెత్తుకుపో సాగాడు. అతడు తన రెండు చెవులను రక్షించుకొనదలచి కాళ్ళక్రింద

వేడి నిప్పులు ఉన్న వాని లాగున పరుగెత్తుకొని పోసాగాడు యజమానుడు ఇంక చేసేది ఏమీ లేక విచారిస్తూ ఇంటికి తిరిగి పోయాడు. తాను పన్నిన ఉపాయం జయప్రదమైనందుకు గ్రెటెల్ ఎంతో సంతోషించింది.

# 2

ఒకనాడు హాన్సు తల్లి కొడుకుతో ఇలా అంది. "నీవంత తొందరగా ఎక్కడకు పోతున్నావు?" "గ్రెటెల్‌ను చూడటానికి వెళ్తున్నాను" అని హాన్సు జవాబు ఇచ్చాడు. "జాగ్రత్తగా ప్రవర్తించు." "అలాగే చేస్తాను. ఇక సెలవు, తల్లీ!" హాన్స గ్రెటెల్ వద్దకు వెళ్ళి, "సుదినము, గ్రెటెల్! అని అన్నాడు." "సుదినము, హాన్సు! నీవు నాకు ఏదైనా మంచి వస్తువు తీసుకు వచ్చావా?" "లేదు. నీవు నాకు ఏమైనా ఇస్తావా?" ఆమె హాన్సుకొక సూదిని ఇచ్చింది. "ఇక సెలవు గ్రెటెల్!" "మంచిది, హాన్సు!" హాన్సు సూదిని తీసుకుని దానినొక గడ్డిమోపుకు గుచ్చి రెంటిని తీసుకుని ఇంటికి వెళ్ళాడు. "మంచిది, హాన్సు! నీవు ఎక్కడకు వెళ్ళావు?" "ఏమీ తీసుకుపోలేదు." "ఆమె నీకు ఏమి ఇచ్చింది?" ఒక సూదిని ఇచ్చింది." "అది ఎక్కడ ఉంది?" "గడ్డిమోపుకు

"గ్రెటేల్ నేనీ ఉదయాన కొంత దూరం పోయి రావాలి. అందుచేత నీవీనాటికి పొలంలోకి వెళ్ళి ధాన్యం తీసుకు వస్తావా" నేను తప్పక నీవు చెప్పినట్లు చేస్తాను!" అని భార్య భర్తకు వాగ్దానం చేసింది. అతడు అన్నప్రకారం ఎక్కడికో వెళ్ళాడు. ఆమె ఎంతో సంతోషించి చక్కని భోజనం తయారుచేసుకుంది. ఆమె ఆ భోజనం తీసుకుని పొలం వెళ్ళింది. ఆమె పొలంలో ఒకచోట కొంచెంసేపు కూర్చుంది. అప్పుడామె ఇలా అనుకుంది ! "నేనిప్పుడు ఏమిచేయాలి ? ముందు నిదురించనా? భోజనం చేయనా ?" భోజనం చేయటమే మంచిదని చూస్తున్నది." అంతట నామె అపరిమితమైన సంతోషంతో భోజనం చేసింది. భోజనం అయిన తరువాత కొంతకాలం గడిచింది. అపుడామె ఇలా అనుకుంది: "నేను భోజనం చేయటం పూర్తిఅయింది. ఇక నేను ముందు నిద్రిందు? పంటకోయనా? నిద్రించటమే మంచిదని తోస్తున్నది." అలా అనుకొని ఆమె పొలంలో ఒకచోటికి పరుండి గాఢంగా నిదురింపసాగింది.

ఇంటివద్ద భార్య రాకకోసం భర్తలేచి యున్నాడు. భార్య ఎంతసేపు గడచినా ఇంటికి రాలేదు. అపుడు భర్త ఇలా అనుకున్నాడు. "నా భార్య గొప్పపని మంతురాలు ? ఎంతో తెలివైనది? ఎంతో కష్టపడి పనిచేస్తున్నది. ఆమెకు భోజనంకంటె పని అంటే ఎక్కువప్రీతి ?" సాయంకాలం

అయింది. అప్పటికీ ఆమె ఇంటికి తిరిగిరాలేదు. భార్యకు ఏమైనా అపాయం సంభవించిందేమో అని: ఆమె ఎంత పంటనుకోసిందో చూడాలనీ అతడు పొలంవద్దకు బయలు దేఱిపోయాడు. అచ్చట అతనికి కనబడిన దృశ్యంఏమిటి? పంట అంతా ఎప్పటిలాగు ననే ఉంది! భార్యమాత్రం ఒక చోట గుఱ్ఱుపెట్టి నిదురపోతుంది? అపుడతనికి అపరిమితమైన కోపంవచ్చింది. వెంటనే అతడు పరుగెత్తుకుంటూ ఇంటికి వెళ్ళి ఒక మువ్వలపట్టెడను తీసుకొని తిరిగిపొలం వద్దకు వచ్చాడు. అప్పటికీ కూడా ఆతనిభార్య గాఢంగా గుఱ్ఱు పెట్టి నిదురిస్తోంది. అతడు తాను తెచ్చిన మువ్వల పట్టెడను భార్య ఛాతీకి గట్టిగా కట్టివేశాడు. పిమ్మట అతడు ఇంటికి వెళ్ళి లోపల తలుపులు తాళంవేసి కూర్చున్నాడు.

బాగా చీకటిపడింది. ఎట్టకేలకు గ్రెటెల్ నిదుర నుండి లేచింది. ఆమె ఇంటికి పోవాలని ముందుకు అడుగు వేసింది. అపుడామెకు కట్టబడియున్న మువ్వలు మోగ సాగాయి. అందుచేత, ఆమె ఎంతో భయపడసాగింది. ఆమెకు తాను గ్రెటిల్ అవునో, కాదో అనేసందేహం వచ్చింది. నేను "నేను గ్రెటెల్‌నా ? కానా ?" అని ఆమె గట్టిగా అనుకోసాగింది. కొంతసేపుఆలోచించిన తరువాత ఆమె ఇలా అనుకుంది !" నేను నేనో కానో ఇంటికి పోతే తెలుస్తుంది. హాన్సుకు అంతా తెలుసును గదా !"

ఆమె ఇంటికి వేగంగా వెళ్ళింది. తలుపులు వేసి ఉన్నాయి. అందుచేత ఆమె కిటికీ వద్దకు వెళ్ళి, "హాన్స్! హాన్స్! గ్రెటెల్ ఇంటిలో ఉందా?" అని గట్టిగా అరిచింది "ఆమె ఎక్కడ వుండాలో అక్కడే"వుందని హాన్సు జవాబిచ్చాడు. అప్పుడామె ఎంతో భయపడి, "అయితే నేను, నేను కానన్నమాట!"అని అనుకుంది. తరువాత ప్రక్కనున్న వారి యింటికి పోయి తలుపు తట్టింది. మువ్వల శబ్దం విని ఆ యింటివారు తలుపులు తీయలేదు. ఆవిధంగా ఆవూరిలో ఎవ్వరూ ఆమెకు తలుపు తీయలేదు. అంతట ఆమె చేసేది ఏమీలేక తిరిగి పొలంలోకి వెళ్ళింది. తరువాత ఆమెగతి ఏమైందో! ఇది గ్రెటెల్ కథ!

# జీవామృతము

చాలాకాలం క్రిందట ఒక దేశాన్ని ఒక రాజు ఏలు తుండేవాడు. అతనికి ముగురు కొడుకులున్నారు. ఒకసారి అతనికి అపాయకరమైన జబ్బు చేసింది. అతడింక జీవించడని అందరూ భావించారు–ముగురు కొడుకులూ ఆ సంగతి తెలుసుకుని ఎంతో విచారించ సాగారు. వారొకనాడు రాజ భవనపు తోటలో ఏడ్పు మొగాలతో తిరుగసాగారు. అప్పుడు వారికొక ముసలివాడు కనిపించి, "మీా రెందుకు బాధపడుతున్నారు?" అని అడిగాడు. కొడుకులు తమతండ్రి పరిస్థితిని అతనికి చెప్పారు.

అపుడు ముసలివాడు ఇలా అన్నాడు: "మీా తండ్రి బతకటానికి ఓ మందు వుంది, దాని పేరు జీవామృతం దానిని మీా తండ్రికిస్తే అతడు తప్పక బతుకుతాడు. కాని దానిని సంపాదించటం దుర్లభం?" అప్పుడు పెద్ద కొడుకు యిలా అన్నాడు: "నేను పోయి దానిని తీసుకువస్తాను" పిమ్మట అతడు తండ్రివద్దకు వెళ్ళి విషయం చెప్పాడు కాని రాజు ఇలా అన్నాడు: "నీవు ప్రయాణంలో చాలా అపాయాలకు

మనస్సే సమాధానంతో సిద్ధంగా ఉండేది. "కండె లేనిదే నేనెలా చుట్టను? అడవిలోకి వెళ్ళి ఒక కండెను చేసి తీసుకురా" అని ఆమె అనేది. "కండె లేదా? అయితే నేను అడవిలోకి వెళ్ళి కండెను చేసి తీసుకు వస్తాను" అని అతడు అంటుండే వాడు. అతడు అడవిలోకి వెళ్ళి కండెను తయారు చేసి తీసుకు వస్తే దారం చుట్టవలసిన అవసరం ఏర్పడుతుందని ఆమె ఎంతో భయపడింది. అందువలన ఆమెఆవిషయం గూర్చి దీర్ఘంగాఆలోచించింది. ఆలోచించగా, ఆలోచించగా ఆమెకొక మంచి ఉపాయం తట్టింది. ఆమె వెంటనే భర్తకు కనబడకుండా అతనిననుసరించి అడవిలోకి వెళ్ళింది. భర్తఒక చెట్టు కొమ్మవద్ద నిలబడి యున్నాడు.అతడొక కొమ్మను నరకటానికి సిద్ధంగా ఉన్నాడు, అంతట నామె చెట్టు వెనుకనున్న ఒక పొదలో దూరి ఇలా అంది: "ఓ మానవుడా! కొమ్మను వంచికు. వంచితేచస్తావు. కండెను తయారు చేయకు. తయారు చేస్తే చస్తావు."

అతడు ఆ మాటలు విని గొడ్డలిని జారి విడిచాడు. [illegible] అతడు ఇలా అనుకున్నాడు, "ఇవేం మాటలు?" ఈ మాటలను ఎవ్వరంటున్నారు? వీని అర్థం ఏమిటి? నిజంగాఈ మాటలను ఎవ్వరూ అనటం లేదు. ఓ హాన్స్ ధైర్యం వహించి పని చెయ్యి." తరువాత అతడు ధైర్యం వహించి గొడ్డలినీ తీసుకుని మరలా కొమ్మను వంచ సాగాడు. అప్పుడు మళ్ళీ అతనికిలా వినిపించింది: "ఓ మానవువా! కొమ్మను వంచకు. వంచితే చస్తావు. కండెను తయారు చేయకు. చేస్తే చస్తావు."

అతడు మరల ఆగి పోయాడు. అతడు చాలా భయపడ సాగాడు. తనకు వినబడిన మాటల అర్థం ఏమై ఉంటుందా అని ఆలోచింప సాగాడు. కొంతసేపటి కతడు ధయిర్యం తెచ్చుకొని మళ్ళీ కొమ్మను వంచ సాగాడు. అప్పుడు మరల అతని కిలా వినపడింది. "ఓ మానవుడా! నీవు కొమ్మను వంచకు వంచితే చస్తావని మూడవసారి చెబుతున్నాను. కండెను తయారు చేయకు తయారు చేస్తే చస్తావని మూడ వసారి చెబుతున్నాను."

అపుడు అతని ధయిర్యం పూర్తిగా సడలి పోయింది. అతడింక పనిని మానివేసి ఇంటికి వేగంగా పరుగెత్తుకొని పోసాగాడు. అపుడామె ఎంతో సంతోషించి, ఒక దగ్గర దారిని పరుగెత్తుకొని పోయి, భర్త కంటె ముందుగా ఇల్లు చేరుకుంది. ఆమె భర్త ఇల్లు చేరుకోగానే, ఏమీ ఎరుగని అమాయకు రాలివలె తలుపు తీసి ఇలా అడిగింది. "కండె తయారు చేయటానికి తగిన మంచి కట్టను తీసుకు వచ్చావా?" "లేదు. కండెను తయారు చేయటం వలన మనకు దురదృష్టమే సంప్రాప్తిస్తుందిగాని, అదృష్టం రాదనే విషయం స్పష్టంగా తెలుస్తున్నది" అని అతడు భారంతో అన్నాడు. పిమ్మట అతడింకా అడవిలో జరిగిన విషయం అంతా పూస గ్రుచ్చినట్లు చెప్పాడు. అతంటితో ఆమెకు శాంతికలిగింది. అతడు ఆమెను ఏ విషయంలో నయినా దూషించటం మాని వేశాడు.

కొంతకాలం ఆమెకు ఏ బాధా లేకుండా ప్రశాంతంగా గడచిపోయింది. తరువాత అతడు మరల ఆమెకు ఇంటి వరి శుభ్రతను మార్చి మందలింపసాగాడు. "గ్రెకెల్! వడికిన దారమంతా ఇలా ఇంటినిండా పడిఉండటం సిగ్గుచేటు కాదా? ఆడది ఉన్న ఇల్లు ఇంత అపరిశుభ్రంగా ఉండడం ఏ మాత్రం తగదు" అని భర్తభార్యతో అన్నాడు. అప్పుడు భార్య ఇలా అంది!" నీవు చెప్పిన మాటనిజమే. కాని దారంచుట్టటానికి మనవద్ద కండిలేదనే విషయం నీకు తెలుసునుగదా. కాని దారంచుట్టటం తప్పనిసరి అయితే నీ కొక్కచోట కాళ్ళు, చేతులు పైకెత్తి పడుకో... నేనప్పుడు దారం చుడతాను," అలా పడుకోటం హాన్సుకు ఏమాత్రం ఇష్టంలేదు. కాని భార్యచేత పనిచేయించటానికి అంతకంటె గత్యంతరం ఏమీ కనిపించలేదు అందుచేత అతడు విధిలేక, "నీవు చెప్పినట్లు చేస్తాను" అని అన్నాడు. పిమ్మట అతడు భార్యచెప్పినట్లు పడుకున్నాడు. అంతట భార్య దారం చుట్టులుగాచుట్టింది. అప్పుడు భర్తభార్యతో ఇలా అన్నాడు:" ఇప్పుడు దారం చుట్టలుచుట్టటం పూర్తి అయింది. రేపు తెల్లవారకముందే లేచి వేడినీటిని కాగబెట్టు, చుట్టలు అందులో పడవెయ్యి. అప్పుడు దారం అమ్మకానికి సిద్ధంగా ఉంటుంది." ఆ పనిచెయ్యటం భార్యకు ఏ మాత్రం ఇష్టంలేదు. ఆ పనిచేయకుండా తప్పించుకోటం ఎలాగా అని ఆమె ఆలోచింపసాగింది, అయినా ఆమెభర్తతో ఇలా

అంది : "మంచిది నేను అంతా మీరు చెప్పినట్లే చేస్తాను."

ఆమె తెల్లవారకముందే లేచింది. నిప్పు తయారు చేసింది. నీళ్ళు కాగబెట్టింది. కాని వేడినీటిలో నూలు వేయక ఒక పెద్ద త్రాడును పడవేసింది. అప్పటికి భర్త ఇంకా నిదుర నుండి మేల్కొనలేదు. అప్పుడామె భర్తవద్దకు వెళ్ళి అతనిని నిదురనుండి లేపి ఇలాఅంది ! "నేను బయటకు వెళ్ళవలసిన పనిఉంది. కనుక నీవు లోపల వేడి నీటిలో ఉన్న నూలును చూస్తూఉండు. నీవు జాగ్రత్తగా ఉండాలిసుమా! ఏమంటే సోమరులు కూర్చుంటే నూలు పెద్ద త్రాడుగా మారిపోతుందని పెద్దలు చెబుతారు. నీవు నీ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాలి." అలాచెప్పి ఆమెఎక్కడికో వెళ్ళిపోయింది. భార్యచేసిన హెచ్చరికను జ్ఞప్తియందుంచుకొని అతను కొంచెం సేపైన తరువాత మంచంమీదనుండి లేచాడు. తరువాత అతడు భయపడుతూ వంటయింటిలోకి వెళ్ళి వేడినీటి కాగు మీదనున్న మూతను పయికి ఎత్తాడు. ఇంకేముంది? నీటి లోపల నూలుకు బదులు ఒక పెద్ద త్రాడుఉంది? అప్పుడతడు తన సోమరితనాన్ని నిందించుకున్నాడు. ఆ నాటినుండి అతడు భార్యపనిలో జోక్యం కలుగజేసికోటం మానివేశాడు. అందు వలన ఆమె తనచిత్తవృత్తి ప్రకారం నడచుకోసాగింది.

అయినా అతడు ఒకనాడు భార్యతో యిలాఅన్నాడు

లోనవుతావు - నాకది ఏ మాత్రం ఇష్టంకాదు-అంతకంటే నేను మరణించటమే శ్రేయస్కరం” కాని జ్యేష్ఠుడుమాత్రం తండ్రిని బతిమాల సాగాడు. ఎట్టకేలకు రాజు కొడుకు కోరికకు అంగీకరించాడు. అంతట జ్యేష్ఠుడు ఇలా అన్నాడు: “నేను జీవామృతం తీసుకు రాగలిగితే మా తండ్రి నన్నే ప్రేమించి నాకే రాజ్యం ఇస్తాడు.”

పెద్దవాడు ప్రయాణమై పోయి కొండలమధ్య ఉన్న ఒక లోయను చేరుకున్నాడు. ఒక కొండమీద మరుగుజ్జు ఒకడు కూర్చుని ఉన్నాడు. “నీవు ఎక్కడకు పోతున్నావు?” అని అతడు రాజకుమారుని ప్రశ్నించాడు. “ఆ విషయం నీకెందుకు?” అని అసహ్యించుకుంటూ పెద్దవాడుఎదురుప్రశ్న వేశాడు.

అంతట మరుగుజ్జు కోపించి “నీవు దురదృష్టం సంప్రాప్తించుగాక!” అని శపించాడు. జ్యేష్ఠుడు మాత్రం ముందుకు పోసాగాడు. అతడు పోతున్న కొలది దారి సన్నంకాసాగింది కొంతసేపటికి అతడింక ముందుకు పోలేని పరిస్థితి ఏర్పడింది. అతడు గుర్రమును వెనుకకు మరల్పదలచాడు. కాని వెనుకకు పోవటానికికూడా దారి కనబడలేదు. అతడు గుర్రముపైనుండి క్రిందకుదిగి నడచిపోవటానికి ప్రయత్నించాడు. కాని అలా చేయటానికి కూడా సాధ్యం కాలేదు. అతడు శాపగ్రస్తుడయ్యాడు.

రాజు మొదటి కొడుకు రాక కోసం ఎదురు చూస్తున్నాడు. కాని అతడు ఎంతకీ తిరిగిరాలేదు. అప్పుడు రెండో కొడుకు రాజుతో ఇలా అన్నాడు: “నాన్నా! నేను పోయి

నీకు జీవామృతం తీసుకువచ్చి ఇస్తాను" ఏ మంటే అతడుమన స్సులో ఇలా అనుకున్నాడు "నా అన్నగారు చనిపోయే ఉంటాడు, అదృష్టవశంచేత నేను జీవామృతం తీసుకురాగలిగితే రాజ్యం నాకే వస్తుంది" రాజు మొట్టమొదట అతనికి అనుమతి ఇవ్వలేదు. కాని తుదకు అనుమతించాడు. అతడు అన్న పోయిన దారినేపోయాడు. కొండలమధ్యనున్న లోయలో ప్రవేశించాడు. అచ్చట ఒక కొండపై మరుగుజ్జు ఒకడు కూర్చుండి యున్నాడు. ఆ మరుగుజ్జు రెండో వానితో ఇలా అన్నాడు: "రాకుమారా! నీవు అంత వేగంగా ఎక్కడకు పోతున్నావు?" అప్పుడు అతడు మరుగుజ్జును ఇలా అవమానించాడు "ఓరి మూర్ఖుడా! నీ పని నువ్వు చేసుకో యితరుల వ్యవహారాలలో అనవసరంగా జోక్యం కలుగుజేసికోకు" అంతట మరుగుజ్జు ఆగ్రహించి అతనికిగూడా శాపంఇచ్చాడు రెండవవాడు ముందుకుపోతున్న కొలదీ దారి సన్నం కాసాగింది. అతడు ముందుకు సాగిపోవటానికి గాని వెనుకకు తిరిగి పోవటానికిగాని వీలులేకపోయింది. అతడు గూడా శాపగ్రస్తుడయ్యాడు.

రెండవవాడు గూడా ఇంటికి తిరిగి రానందున మూడవవాడు జీవామృతం తీసుకురావటానికి సిద్ధపడ్డాడు. అతడు కతడు తండ్రివద్దనుండి అనుమతి సంపాదించాడు. మూడవవాడు అన్నలు పోయిన దారినే వెళ్ళి కొండపై కూర్చుండి యున్న మరుగుజ్జును కలుసుకున్నాడు. అప్పుడు మరుగుజ్జు మూడవవానితో ఇలా అన్నాడు: "మిత్రమా! నీవు అంత

వేగంగా ఎక్కడకు పోతున్నావు" అతడు ఆగి తన ప్రయాణానికి కారణం శాంతంగా చెప్పాడు. "జీవామృతం ఎక్కడ ఉందో నీకు తెలుసా?" అని మరుగుజ్జు ప్రశ్నింపగా "తెలియదు" అని మూడోవాడు అన్నాడు అప్పుడు మరుగుజ్జు ఇలా అన్నాడు: "నీవు నాతో చక్కగా మాట్లాడావు కనుక నీకు సహాయం చేస్తాను. నీకు కావలసిన జీవామృతం ఒక మంత్ర బద్ధమయిన కోటలోని బావిలో ఉంది. అక్కడకు నువ్వు సురక్షితంగా పోటానికి నేను నీకో మంత్రదండం, రెండు రొట్టెలు ఇస్తాను. మూడుసార్లు మంత్రదండంతో కోట తలుపులు తట్టు అప్పుడు తలుపులు తెరుచుకుంటాయి. లోపల ఆకలితో నున్న రెండు సింహాలుంటాయి-వాటికి నీ వద్దనున్న రెండు రొట్టెలు ఇయ్యి అప్పుడవి నిన్ను ముందుకుపోనిస్తాయి నీవు పన్నెండు గంటలు కొట్టకముందే బావిలోని జీవామృతం తీసుకుని బయటకు రా. లేకపోతే నీవు కోటలో శాశ్వతంగా బందీకృతుడవుతావు."

మూడవవాడు అతనికి కృతజ్ఞతను తెలిపి అతనివద్ద నుండి మంత్రదండం, రెండు రొట్టెలు తీసుకొని ముందుకు ప్రయాణం సాగించాడు. అతడు సముద్రాలు, కోటలు దాటి మంత్రబద్ధమయిన కోటను చేరుకున్నాడు. మంత్రదండంతో తలుపులు మూడుసార్లు తట్టాడు. అపుడు కోట తలుపులు తెరుచుకున్నాయి. అతడు లోనికిపోయి రెండు రొట్టెలను రెండు సింహాలకు ఇచ్చాడు. పిమ్మట అతడొక పెద్ద గదిలో ప్రవేశించాడు. అచ్చట పలువురు యోధులు మూర్ఛ

పోయిన వారివలె కూర్చుండి యున్నారు. రాకుమారుడు వారి చేతి వేళ్ళకున్న ఉంగరాలను తీసుకుని తనచేతి వేళ్ళకు పెట్టుకున్నాడు. పిమ్మట అతడు వేరొక గదిలోనికి వెళ్ళి అక్కడ ఉన్న కత్తిని, రొట్టెను తీసుకున్నాడు. అటు పిమ్మట మరి యొక గదిలోనికి వెళ్ళి ఒక భువనమోహినిని కలుసుకున్నాడు. "నేను మంత్రబద్ధనై ఉన్నాను. నన్ను విడిపిస్తే ఈ రాజ్యం నీకు చెందుతుంది. నీవు ఒక సంవత్సరంలో తిరిగి వచ్చి నన్ను వివాహం చేసుకోవాలి" అని భువనమోహిని రాజకుమారునితో చెప్పింది. అతడామెను విముక్తి కలిగించాడు. పిమ్మట రాకుమారుడు ముందుకు పోయాడు. అక్కడ ఒక చక్కని శయ్య ఉంది. అలసియున్న రాజకుమారుడు దానిపై పరుండి నిదురించాడు, పండ్రెండు గంటలకు కొంచెం ముందుగా అతనికి మెలకువ వచ్చింది. అప్పుడతడు ఎంతో భయపడి వేగంగా వెళ్ళి బావిని సమీపించి అందులోని జీవామృతం తీసుకుని కోట గుమ్మం చేరుకున్నాడు. అతడు కోట గుమ్మం దాటుతుండగా తలుపులు మూసుకున్నాయి. ఆ సందర్భంలో రాజకుమారుని మడమ మాత్రం తెగిపోయింది.

రాజకుమారుడు తిరిగి వచ్చే దారిలో మరుగుజ్జును కలుసుకున్నాడు, మరుగుజ్జు అతనితో ఇలా అన్నాడు. "నీవు అదృష్టవంతుడవు. నీ దగ్గర ఉన్న కత్తి ఎంతమందినైనా సంహారిస్తుంది. రొట్టె నీకు ఎంతగానో ఉపయోగపడుతుంది." అంతట రాకుమారుడు తన సోదరులస్థితిని మరుగుజ్జును అడిగి తెలుసుకుని వారిని రక్షించవలసిందని కోరాడు. "వాళ్ళు

చాలా చెడ్డవారు. నీవు చాలా జాగ్రత్తగా ఉండాలి" అని మరుగుజ్జు అన్నాడు; శాపగ్రస్తులైన ఇద్దరు సోదరులను విడిచి వచ్చాడు. ముగ్గురు సోదరులు కలసి ఇంటికి ప్రయాణమైపోయారు. మూడోవాడు త్రోవలో తన సాహస కృత్యాలు వివరించి చెప్పాడు. అతడు తన కత్తి సహాయంతో మూడు రాజ్యాలను కూడా రక్షించాడు.

'అంతలో సముద్రం వచ్చింది. ముగ్గురూ ఒక నావలో ప్రవేశించి ప్రయాణం చేయసాగారు. ఒకసారి మూడో వాడు గాఢంగా నిద్రిస్తుండగా మొదటి ఇద్దరు అతని వద్ద నున్న కలశంలోని జీవామృతం తీసుకున్నారు. ఆ కలశంలో సముద్రపు నీరు పోశారు. కొంతకాలానికి అందరూ ఇల్లు చేరుకున్నారు. మూడోవాడు తన కలశాన్ని తండ్రికి ఇచ్చాడు. రాజు ఉప్పునీటిని త్రాగి మరింత జబ్బు పడ్డాడు. అంతట మొదటి ఇద్దరు కొడుకులు మూడవవాని వద్దనుండి దొంగిలించిన జీవామృతం తండ్రికి ఇచ్చారు. వెంటనే రాజు గారి జబ్బు తగ్గిపోయింది. అంతేకాదు. అతడు యువకునిలా తయారయ్యాడు. అపుడు మొదటి ఇద్దరూ మూడవవాని వద్దకు వెళ్ళి అవహేళన చేశారు. "మేము చేసిన మోసం నీవు మన తండ్రికి చెపుతే నీ ప్రాణాలు నీవి కావు" అని భయపెట్టారు కూడ.

మూడో కొడుకు తన ప్రాణాలు తీయటానికి ప్రయత్నించాడని రాజు అభిప్రాయ పడసాగాడు, అందచేత అపకు మంత్రులతో ఆలోచించి అతన్ని చంపివేయాలని

నిశ్చయించుకున్నాడు. ఆ సంగతి అతనికి ఏ మాత్రం తెలి యదు. నిర్దోషియైన అతడు ఒకనాడు వేటగానితో కలసి అడవిలోకి వెళ్ళాడు. అక్కడ వేటగాడు రాజకుమారునికేసి చూస్తూ కన్నీరు కార్చసాగాడు. అప్పుడు రాజకుమారుడు అతనినిలా ప్రశ్నించాడు, "నీవు ఎందుకు కన్నీరు కారుస్తు న్నావు?" "నేను చెప్పలేను; చెప్పను" అని వేటగాడు అన్నాడు. రాజకుమారుడు అతనిని మాటి మాటికి బతిమాలు కోసాగాడు. "విషయం ఏమిటో చెప్పు. నాకు కోపం వస్తుం దని అనుకోకు. నిన్ను నేను క్షమిస్తాను" అని అతడు అన్నాడు అప్పుడు వేటగాడు ఇలా అన్నాడు: "అయ్యో! నిన్ను చంపి వేయవలసిందని రాజుగారు ఆజ్ఞ దయచేశారు." అప్పుడు రాజకుమారుడు ఇలా అన్నాడు: "నన్ను బ్రతుకనీ, మన మిద్దరము దుస్తులు మార్చుకుందాము. నా దుస్తులు తీసుకు పోయి రాజుగారికి చూపించు. నీ దుస్తులు నాకియ్యి." అలా చెయ్యటానికి వేటగాడు ఎంతో సంతోషంతో అంగీ కరించాడు, అతడు తన దుస్తులను రాజకుమారునకు ఇచ్చి, రాజకుమారుని దుస్తులు తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

మూడవ కొడుకు చేత రక్షింపబడిన మూడు రాజ్యాల వారు రాజు వద్దకు గొప్ప బహుమతులులతో రాయబారు లను పంపారు. ఆ రాయబారులు రాజును కలసికొని అతని శక్తి సామర్థ్యాలను గూర్చి వివరంగా చెప్పారు. అప్పుడు అతను నిర్దోషి అనే అభిప్రాయం రాజుకు కలిగింది. అందు చేత అతను తన మంత్రులతో ఇలా అన్నాడు: "నేను నా

కుమారుని అన్యాయంగా చంపించాను. అతడిప్పుడు బ్రతికి యుంటే ఎంత బాగుంటుంది!" ఆ విషయం తెలుసుకున్న వేటగాడు తాను చేసిన పని రాజుకు చెప్పి మూడవవాడింకా బ్రతికియే యున్నాడని అన్నాడు. ఆ విషయం తెలుసుకున్న రాజు ఎంతో సంతోషించి తన రాజ్యమంతటా ఇలా చాటింపు వేయించాడు: "నా మూడవ కుమారుడు తిరిగి నా ఆస్థానానికి రావచ్చును. నేను అతనిని క్షమించాను."

మంత్ర బద్ధమైన కోటలోని రాజకుమారి మూడవ రాజకుమారుని రాక కోసం వేచియుంది. ఆమె కోట గుమ్మం వరకు బంగారు బాట వేయించింది. ఆమె తన సేవకులతో ఇలా చెప్పింది. "బాట మధ్యగా వచ్చే వాడే నాకు కావలసిన రాకుమారుడు, అతనిని లోపలకు ప్రవేశ పెట్టండి. బాటకు పక్కగా వచ్చే వారిని లోపలకు రానీయకండి."

మొదటి రాజకుమారుడు తానే కోటలోని రాజకుమారిని పెండ్లి చేసుకో దలచి పయనమై పోయాడు. అప్పుడతనికి బంగారు బాట తగిలింది. అతనికి బంగారు బాటమీద పోటానికి మనస్కరించలేదు. అందువలన అతడు బంగారు బాటకు కుడి ప్రక్కగాపోయి కోట గుమ్మం చేరుకున్నాడు. అంతా చూస్తున్న సేవకులతడు రాకుమారికి కావలసిన వాడు కాదని గ్రహించారు. అందుచేత, వారతనిని లోపలకు ప్రవేశింపనివ్వలేదు. కొంతకాలానికి రెండోవాడు బంగారు బాటకు ఎడమ ప్రక్కగాపోయి కోట గుమ్మం చేరుకున్నాడు. అప్పటి సేవకులు అతనిని కూడా లోనికి పోనివ్వలేదు.

వేటగానిచే వదలివేయబడిన మూడో రాజకుమారుడూ తండ్రికి భయపడి కొంతకాలం అడవిలోనే దాక్కున్నాడు, తరువాత అతడు బయటకు వచ్చి కోటలోని రాకుమారి వద్దకు పయనమై పోయాడు. అతడు బంగారు బాట ఉన్న సంగతిని గమనించకుండానే దాని మధ్యగా ప్రయాణం చేసి కోట గుమ్మం చేరుకున్నాడు, అపుడు సేవకులు అతడు నిజమైన రాజకుమారుడని గ్రహించారు: అతనిని ఘనంగా ఆహ్వానించి లోపలకు తీసుకుపోయారు మూడవవాడు రాజకుమారిని వైభవంగా వివాహం చేసుకుని సుఖంగా కాలం గడప సాగాడు. అంతలో తండ్రి తన్ను క్షమించాడన్న వార్త అతనికి తెలిసింది. అపుడతడు భార్యతో కలిసి తండ్రి వద్దకు వెళ్ళాడు. తన సోదరులు చేసిన మోసమంతా తండ్రికి వివరించి చెప్పాడు. ఆంతట రాజు ఆగ్రహపడి దుష్టులైన ఇద్దరు కొడుకులనూ తీవ్రంగా శిక్షించాలనుకున్నాడు ఆ సంగతి తెలుసుకున్న కొడుకు లిద్దరూ తప్పించుకు పారిపోయారు. వారు ఎక్కడకు వెళ్ళారో ఎవరికీ తెలియదు, వారు మళ్ళీ తిరిగి రాలేదు.

❀❀

# మాతృప్రేమ!

ఒక గ్రామంలో ఒక స్త్రీ నివసిస్తుండేది. దురదృష్ట వశమున ఆమె భర్త ఒకనాడు మరణించాడు. ఆమె విధవ అయింది. ఆమెకు పుత్రసంతానం లేదు. ఇద్దరు కూతుళ్ళు మాత్రం ఉన్నారు. ఆ కూతుళ్ళలో ఒకతి చాలా అందమైనది. ఆమె చాలా కష్టపడి పనిచేస్తుండేది. రెండవ కూతురు చూడటానికి చాలా అందవికారంగా ఉండేది. ఆమె వట్టి సోమరి, ఆమెకు పనికి బద్ధవైరం.

సాధారణంగా తల్లులు అందమయిన కూతుళ్ళను ఎక్కువగా ప్రేమిస్తుంటారు. కాని ఈ తల్లిమాత్రం అంద వికారంగా ఉన్న కూతురునే ఎక్కువగా ప్రేమిస్తుండేది. ఆ కూతురుకు పనులేమీ చెప్పేదికాదు. అందమయిన కూతురే పనులన్నీ చేస్తుండేది. అంతటితో సంతృప్తి చెందక ఆమె ప్రతిదినం ఒక బావికి ప్రక్కగానున్న బల్లమీద కూర్చుండి కదురుపై నూలు తీస్తుండేది. ఆ పని చేస్తున్నపుడు ఒక్కొక్కప్పుడు ఆమె చేతి వ్రేళ్ళకు రక్తం వస్తుండేది.

ఒకనాడు ఆమె చేతి వ్రేళ్ళకు రక్తంరాగా కదురు నిండా రక్తం అయింది. దానిని కడగాలనే తలంపుతో ఆమె దానిని బావిలో ముంచింది. దురదృష్ట వశంచేత అదిబావిలో

పడింది. అంతట నామె పరుగెత్తుకుపోయి జరిగిన విషయం అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది. అప్పుడు తల్లి ఆమెను కష్టంవచ్చినట్లు దూషించి ఇలా అంది: "నీవు కదురును బావిలో పడవేశావు, కనుక దానిని బయటకు తీయవలసిన బాధ్యత నీమీదే ఉంది, నీవు వెంటనే ఆ పని చేసి నాకు చెప్పాలి."

అంతట ఆమె విచారంతో బావివద్దకు వెళ్ళిఅందులో పడింది. అప్పుడామె స్పృహతప్పి బావి అడుగు భాగం చేరుకొంది. కొంతసేపటికామెకు స్పృహ వచ్చింది. ఆమె చుట్టూ కలయజూచింది. ఆమె ఒక చక్కని మైదానంలో ఉంది. అక్కడ సూర్యభగవానుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు. పక్షులు మధురాతి మధురంగా పాడుతున్నాయి. పూలమొక్కలు నానారకాల పుష్పాలతో నిండి ఉన్నాయి.

తరువాత ఆమె లేచి మైదానంలో నడిచి [illegible] చిన్న అడవికి ప్రక్కగానున్న కుటీరం చేరుకుంది. ఆమె నిర్భయంగా లోపలకు ప్రవేశించింది. అప్పుడు రొట్టె పొయ్యిలో కాలుతోంది. ఆమెను చూడగానే రొట్టె ఇలా అంది: "నన్ను బయటకు తియ్యి, అందాల సుందరీ! నేను మాడిపోతున్నాను!" అంతట నామె రొట్టెను బయటకుతీసింది. పిమ్మట ఆమె కుటీరంలోనుంచి బయటకువచ్చి ఇంకను ముందుకుపోయి ఒక వృక్షమును సమీపించింది. ఆ సుందరిని చూడగానే చెట్టు ఇలా అంది: "నా పండ్లు బాగా పండాయి! నన్ను ఊపు!" అప్పుడామె చెట్టును ఊపింది. చెట్టుపైనున్న ఆపిల్ పండ్లన్నీ క్రిందపడ్డాయి. ఆమె ఇంకా

అందుకు పోయి వేరొక కుటీరం చేరుకుంది. ఆ కుటీరంలో ఒక వృద్ధ వనిత ఉంది. ఆ ముసలమ్మ బాలిలను పిలిచి ఇలా అంది: "నీవు నా వద్ద పనిమనిషిగా కుదురు-నీవు చక్కగా పని చేస్తే అదృష్టం సంప్రాప్తిస్తుంది, కాని నువ్వు నాపక్కను చక్కగా వేయాలి, అప్పుడు ఈకలు ఎగిరిపోవాలి. మంచు కురుస్తోందని జనులు అనుకుంటారు"

బాలిక ముసలమ్మవద్ద పనిచేయటానికి అంగీకరించింది. ఆమె ప్రతి దినము ముసలమ్మ ప్రశంసించునట్లుగా పనులు చేయసాగింది. ఆమె ఆ కుటీరంలో ప్రశాంతంగా గడుప సాగింది. ముసలమ్మ ఆమె పనికి ఎంతో సంతోషించి ప్రతి దినం చక్కని ఆహారం ఇస్తూ ఉండేది.

ఆ విధంగా కొంతకాలం గడిచింది. బాలికకు విచారం కలుగసాగింది. ఇంటివద్ద కంటే ముసలమ్మ వద్ద జీవితం సుఖంగా గడుస్తున్నా ఆమె తిరిగి ఇంటికి పోవాలనుకుంది. అంచేత ఆమె ఒకనాడు ముసలమ్మతో ఇలా అంది: "అమ్మా! నేను తిరిగి ఇంటికి పోవాలనుకుంటున్నాను." అపుడు ముసలమ్మ ఇలా అంది: "నీ కోరిక చాలా బాగుంది ఆ విషయంలో నేను నీకు తప్పక సహాయం చేస్తాను." ముసలమ్మ బాలికను కుటీరం వెనుకకు తీసుకుపోయి ఒక తలుపు తెరిచింది. అపుడు బంగారు వర్షం కురిసింది. బాలికకు కావలసినంత బంగారం మూటగట్టుకుంది. ముసలమ్మ ఆ బాలికకు బంగారు దుస్తులును, బావిలో పడిన కదురును యిచ్చింది.

పిమ్మట ఆమెను వేరొక ద్వారంగుండా బయటకు తీసుకు పోయింది. అంతట తలుపులు మూసుకున్నాయి. ఆశ్చర్యం! అత్యాశ్చర్యం! అందాల బాలిక తల్లి ఇంటికి సమీపముననే నిలబడియుంది. ఆమె ఆ ఇంటిలో ప్రవేశించింది. అప్పుడు గోడమీద కూర్చుండియున్న కోడిపుంజు లేచి బాలికను ఇలా ఆహ్వానించింది "బాలికా! రా రమ్మ, నీ కిదే మా స్వాగతం!"

బాలిక లోపలకు వెళ్ళింది. కావలసినంత బంగారం తీసుకువచ్చింది గనుక అందరూ ఆమెను ఆహ్వానించారు. తల్లికి అందాలకూతురు ధనం సంపాదించిన విధానం తెలుసు కుంది. తన అందవికారమైన కూతురుకుగూడా అటువంటి అదృష్టమే కలుగాలని తల్లి వాంఛించింది.

అందవికారమైన బాలిక గూడా బావి ప్రక్కనున్న బల్లమీద కదురు పట్టుకొని కూర్చుంది. ముళ్ళపొదలో చేయి పెట్టి చేతికి రక్తం వచ్చేటట్లు చేసుకుంది. రక్తం కదురుకు రాసింది. కదురును బావిలో పడవేసింది. పిమ్మట తానే బావి లోకి దుమికింది. కొంతసేపటికామె ఒక చక్కని మైదానం చేరుకుంది. ఆమె ఆ మైదానంలో ప్రయాణంచేసి ఒక కుటీరం చేరుకుంది. కుటీరంలో పొయ్యిలో కాలుతున్న రొట్టె తన్ను బవాటకు తీయవలసిందని కోరింది. కాని ఆమె అలా చేయటానికి నిరాకరించి ఇంకను ముందుకుపోయి ఆపిలు

వృక్షం చేరుకుంది. "నన్ను ఊపు" అని ఆ చెట్టు బాలికను కోరింది. కాని ఆమె ఆ చెట్టు కోరికనుకూడా నిరాకరించింది ఇంకా ముందుకు సాగిపోయి ముసలమ్మ కుటీరం చేరుకుని ఆమె వద్ద పనికత్తెగా ప్రవేశించింది. ఆమె మొదటి రోజున ముసలమ్మ ఇవ్వబోవు బంగారాన్ని తలచుకొని బాగానే పని చేసింది. కాని రెండోరోజున ఆమె కొద్దిగా బద్ధకించింది. మూడోరోజున బద్ధకం ఇంకా ఎక్కువయింది. కాలం గడచిన కొలఁదీ ఆమెకు ఇంకా బద్ధకం ఎక్కువకాసాగింది. ముసలమ్మకు ఆమె అంటే బాగా విసుగు పుట్టింది. అందుచేత ఆమె బాలికను బయటకు వెళ్ళగొట్టింది. బాలిక మాత్రం అందుకు ఎంతో సంతోషించి ఇలా అనుకుంది "ఇక బంగారు వర్షం కురుస్తుంది" కాని ఆమెపై బంగారు వర్షానికి బదులు తారు వర్షక కురిసింది.

"నీకీ బహుమానం తగును" అని యని ముసలమ్మ తలుపులు వేసింది. అంతట ఆ బాలిక తల్లి గృహం దగ్గర ప్రత్యక్షమైంది. ఆమె ఇంటి ఆవరణలో ప్రవేశించింది. ఆవరణ గోడమీదున్న కోడిపుంజు ఇలాఅంది: "ఓ బాలికా పో పొమ్మా, వచ్చిన దారినే పొమ్మా."

# ప్రపంచసుందరి

ఒక రాజుకు ముగ్గురు కొడుకులున్నారు. అతనిరాజ్యా దగ్గరిలోనే నివసిస్తున్న ముసలమ్మకు ఒక కూతురు ఉంది. ఆ అమ్మాయి పేరు చెర్రీ. ఒకనాడు రాజు తన ముగ్గురు కొడుకులతో ఇలా అన్నాడు: "మీరు ప్రపంచ మంతటా తిర గండి. వివిధ దేశాలలోని ఆచార వ్యవహారాలు తెలిసి కోండి. మీరు ఏప్పటికయినా ఈ రాజ్యం పరిపాలింప వల సిన వారు కదా. అందు కావలసిన తెలివితేటలు, ప్రావీ ణ్యం, నైపుణ్యం సంపాదించండి." అంతట రాకుమారులు ముగ్గురూ ప్రయాణమై పోయారు. ముసలమ్మ మాత్రం ఇంటివద్ద కూతురుతో కలసి ప్రశాంతంగా జీవిస్తోంది. ముస లమ్మ కూతురుకు అన్ని ఆహార పదార్థాలలోను చెర్రీపండ్లా అంటే చాలా ఎక్కువ ఇష్టం. ఆమె సాధారణంగా వాటిని తప్ప మిగిలిన వాటిని తినేది కాదు. అందుచేతనే ఆమెకు చెర్రీ అనే పేరు వచ్చింది. మరి ముసలమ్మకు తోచటంలేదు. ప్రతిరోజూ కూతురుకు కావలసిన చెర్రీ పండ్లు కొనటానికి కావలసినంత ధనం లేదు. అందుచేత ఆమె దగ్గరలోనున ఒక మఠానికి వెళ్ళి అచ్చటి వారిని అడిగి వారి తోటలోనుండి ఆ పండ్లను తీసుకువచ్చి కూతురుకు ఇస్తుండేది. ఆమె ఎప్పుడూ కూతురును మాత్రం పంపేది కాదు. ఏమంటే కూతురు చాలాఅందమైంది, ఆమె వెళ్ళే ఏమైనా దుదృష్టం సంప్రాప్తిస్తుందేమో అని తల్లి భయపడుతుండేది.

ఒకనాడు రాకుమారులు దేశసంచారం చేస్తూ ముస లమ్మ నివసిస్తున్న పట్టణానికి వెళ్ళారు. వారు ముసలమ్మ ఇల్లు వున్న వీధిలో నడచి పోసాగారు. అపుడు కూతురు కిటికీ వద్ద నిలబడి చూడటానికి ఎంతో అందంగావున్న పొడు గుపాటి కురులను దువ్వుకుంటోంది. ఆమెను ముగ్గురు రాకు మారులూ చూశారు. ముగ్గురూ ఆమెను ప్రేమించసాగారు. ముగ్గురూ తమ అభిప్రాయాన్ని పైకి చెప్పారు. వెంటనే ముగ్గురూ కత్తులు తీశారు. అపుడచ్చట ఒక భయంకరమైన పోరాటం ప్రారంభమైంది. ఆపోరాటం చాలాసేపు సాగింది. సోదరుల కోపం అంతకంతకు అతిశయింప సాగింది. వారు చేస్తున్న సవ్వడికి అచ్చటకు దగ్గరలోనే నివసిస్తున్న మఠాధి కారిణి బయటకు వచ్చింది. సోదరుల పోరాటానికి కారణం ఎవరో ఆమె తెలుసుకుంది. ముసలమ్మ కూతురంటే ఆమెకు ద్వేషం ఎక్కువ. ఏమంటే ఆమెకు కూడా చెర్రీ పండ్లంటే ఎంతో ఇష్టం. మఠంలోని ఇతరులు ముసలమ్మకు ఆ పండ్లను ఇస్తుండేవారు. ఆవిషయమ్గ్రహించిన మఠాధికారిణి కూతురు పట్ల ద్వేషంవహించింది. అందుచేత రాకుమారులు పోరాడు కొంటున్న సమయాన ఇలా అంది: "చెర్రీ ఒక అంద వికార మైన కప్పగా మారిపోయి ప్రపంచపు కడభాగానఉన్న వం తెన క్రిందగల నీటిలో పడియుండాలి." వెంటనే ఆమె కోరి నట్లు జరిగింది. పాపం, అందాల సుందరి కప్పగా మారిపో యింది. కిటికివద్ద నిలబడి శిరోజాలు దువ్వుకుంటున్న సుందరి రాకుమారుల దృష్టి పథం నుంచి మాయమైంది. ఇక రాజ

కుమారులు మరి ఎవరికోసం పోరాడతారు? అందుచేతవారు తమ కత్తులను మరల ఒరలలో పెట్టుకున్నారు. సోద రులవలె కరచాలనం చేసుకున్నారు. పిమ్మట తండ్రి వైపుకు వెళ్ళారు.

రాజు ముసలివాడు, బలహీనుడు అయ్యాడు. అతడు రాజ వ్యవహారాలు చూడటానికి అసమర్థు డయ్యాడు. అందుచేత అతడు రాజ్య త్యాగం చేయదలచాడు. కానీ రాజ్యం ముగ్గురిలో ఎవరికీయాలి? అతడు ముగ్గురు కొడుకు లను సమానంగా ప్రేమిస్తున్నాడు. అందుచేత అతడు ఏ కుమారునకు రాజ్యం ఇవ్వాలో నిశ్చయించుకోలేని పరిస్థితి ఏర్పడింది. తుదకతడు ఒకనాడు ముగ్గురు కొడుకులను పిలి పించి ఇలా అన్నాడు: "నాయనలారా! నేను ముసలివాడను, బలహీనుడను అయ్యాను. అందువలన పదవీ పరిత్యాగం చేయాలను కుంటున్నాను. నేను మీ ముగ్గురిని సమానంగా ప్రేమిస్తున్నాను. కనుక నేను మీలో ఎవరికి పట్టం కట్టాలో నిశ్చయించుకోలేక పోతున్నాను. నేను మీ ముగ్గిరిలో అత్యంతసమర్థుడైన వానిని, తెలివితేటలు కలవానిని రాజుగా చేయదలచుకున్నాను. మీకు మూడు అవకాశాలు ఇస్తాను. పరీక్షలో నెగ్గిన వారికి రాజ్యం బహుకరిస్తాను. మీరు మొట్ట మొదట చేయవలసిన పని చెబుతాను, వినండి. మీరు నాకు నూట పాతిక గజముల బట్ట తెచ్చియ్యాలి. అదినేను నాచేతి వేలి ఉంగరంలా దూర్చగలిగినంత సన్నంగా వుండాలి." తండ్రి కోరినట్లు చేయటానికి ముగ్గురు కొడుకులు వాగ్దానం చేసి ఆపనిమీద ప్రయాణమై పోయారు.

పెద్దవారిద్దరు తమతో పాటు పలువురు సేవకులను, బండ్లను, గుర్రములను తీసుకు పోయారు. వారు ప్రపంచంలో దొరకు అందమైన బట్టలన్నిటినీ తీసుకురావలచారు. మూడో సోదరుడు మాత్రం ఒంటరిగా బయలుదేరి పోయాడు. ముగ్గురు ఒక ప్రదేశం చేరుకున్నారు. అక్కడనుండు వేర్వేరు దిక్కులు వేర్వేరు బాటలున్నాయి. మొదటి ఇద్దరు మనోహరమైన మైదానములలోనుండి పోతున్న చక్కని బాటలపై పోసాగారు. మూడవవాడు మాత్రం ఎందుకుపనికి రానికి భూములలోనుండి పోతున్న కష్టమైన దారినిబడి పోసాగాడు. మంచి అందమైన బట్టలు కనిపడినప్పుడెల్ల మొదటి ఇద్దరు సోదరులు కొన సాగారు. ఆ బట్టల బరువుకు బండ్లు, గుర్రములు క్రుంగి పోసాగాయి. మూడవ వాడు బాగా అలసిపోతూ చాలా రోజులు ప్రయాణం చేశాడు. అతడు ఎంతదూరం ప్రయాణం చేసినా మంచి బట్టలున్న ప్రదేశం ఒక్కటీ కనబడటం లేదు. అందువలన అతడు ముందుకు పోయిన కొలది ఎక్కువగా నిరుత్సాహ పడసాగాడు. ఎట్టకేలకతడు ఒక ప్రవాహం పైనున్న వంతెనవద్దకు వచ్చాడు. అతడా వంతెనపై కూర్చుండి తన దుర దృష్టానికి విచారింపసాగాడు.

అప్పుడొక అందవికారమయిన కప్పతలబయటకు పెట్టి మధుర స్వరంతో ఇలా అంది: "ఓ రాకుమారుడా! నీవు ఎందుకు విచారిస్తున్నావు?" అప్పుడు మూడవ వాడు ఇలా

అన్నాడు:" ఓ అంద వికారమయిన కప్పా! నీవు నాకేమీ సహాయం చేయలేవు." అపుడు కప్ప ఇలా అంది: "నీకు అలా ఎవరు చెప్పారు? నీవు ఎందుకు బాధ పడుతున్నావో చెప్పు. నేను నీకు సహాయం చేస్తాను." రాజకుమారుడు కొంత సేపు ఆలోచించి తన కథ అంతా వివరించి చెప్పాడు. "నేను నీకు సహాయం చేస్తాను" అని కప్ప రాజకుమారునికి వాగ్దానం చేసింది. పిమ్మట అది నీటిలోనికి వెళ్ళి కొంత సేపటికి తిరిగి వచ్చింది. అది చూడటానికి అసహ్యంగా నున్న గుడ్డను తీసు కొచ్చి రాకుమారునకిచ్చి ఇలా అంది: "నీవు దీనిని తీసుకుపో నీకు సర్వ శుభాలు కలుగుతాయి. విజయం లభిస్తుంది." కప్ప తెచ్చి ఇచ్చిన బట్ట రాజకుమారునికేమీ రుచింపలేదు. అయి నను అతనికి కప్పవాక్కులలో ఏదో మహాత్యం కనబడసాగింది. అందుచేత అతడు ఇలా అనుకున్నాడు: "దీనిని తీసికొని పోతే లాభం ఏమీ లేక పోయినా నష్టం ఏమీ ఉండదు కదా! ఏమీ లేని దాని కంటే ఇదిఅయినా ఉండటం కొంత మేలు." పిమ్మట అతడు కప్పఇచ్చిన బట్టను తీసుకొని జేబులో పెట్టు కొని కప్పకు ఎంతో కృతజ్ఞత తెలిపాడు. కప్ప ఎంతో అల సిన దానివలె నీటిలోనికి పోయింది. అంతట రాజకుమారుడు ఇంటికి బయలుదేరి పోసాగాడు. అతడు పోతున్న కొలది జేబు పెద్దది కాసాగింది. తనకు అదృష్టం కలుగ నున్నదని సంతోషిస్తూ రాజకుమారుడు ప్రయాణం సాగించాడు.

మొదటి ఇద్దరు సోదరులు రకరకాల బట్టలతో నిండిన గుఱ్ఱపు బండ్లతో ఇంటికి తిరిగివచ్చారు. అదే సమయానికి మూడవ సోదరుడు కూడా ఆ ప్రదేశం చేరుకున్నాడు. తన

ముగ్గురు కొడుకులు సురక్షితంగా ఇంటికి తిరిగివచ్చినందుకు రాజు ఎంతో సంతోషించాడు. ఎవ్వరూ తాను చెప్పినట్లు సరిగా చేశారో చూడటానికి రాజు తన చేతి వ్రేలి ఉంగ రాన్ని బయటకు తీశాడు: మొదటి ఇద్దరు సోదరులు తెచ్చిన బట్టలలో ఒక్కటికూడా అతని ఉంగరములోనుంచి దూర లేదు. అప్పుడు వారు మొగములు ముడుచుకున్నారు. ఏ మంటే వారంతకు మునుపు మూడవ సోదరుడు ఏమీ తీసు కొని రాక వట్టి చేతులతో తిరిగి వచ్చాడని అవహేళన చేసి నవ్వారు! మూడవ సోదరుడు తన జేబులోనుండి ఒక బట్టను బయటకు తీశాడు. అది ఎంతో తెల్లగాను, మృదువుగాను, అందంగా మనోహరంగా ఉంది. అటువంటి బట్టను అంతకు ముందు ఎవరూ చూచియుండలేదు. అది రాజు ఇదివరకు చూసిన బట్టల కంటే వేయిరెట్లు మేలుగావుంది. దానిని చూడగానే పెద్దవారికోపం ఎక్కువయి పోయింది. అది సులభంగా రాజుగారి ఉంగరంలోనుంచి దూరి పోయింది. అటువంటి బట్టలు రెండుకూడా ఆ ఉంగరంలోనుంచి సుల భంగా దూరిపోయింది. రాజు అదృష్టవంతుడగు మూడవ కొడుకును గుచ్చి, గుచ్చి కౌగిలించుకున్నాడు. అతడు మొదటి ఇద్దరు కొడుకులు తెచ్చిన బట్టలను సముద్రంలో పారవేయవలసిందని సేవకులకు చెప్పాడు. పిమ్మట అతడు ముగ్గురు కొడుకులతో ఇలా అన్నాడు: "ఇక మీకు రెండవ అవకాశం ఇస్తాను మీరు నాకు ఒక చిన్న కుక్కను తీసుకు రావాలి అది ఒక చిన్న కాయలో పట్టాలి."

తండ్రి మాటలు వినగానే కుమారులు ముగ్గురూ

అపరిమితంగా భయపడ్డారు. కానివారందరూ కిరీటం ధరించాలని తీవ్రంగా వాంఛిస్తున్నారు. అందుచేత వారు వెళ్ళి తమ శక్తికొలది ప్రయత్నించాలని నిశ్చయించుకున్నారు. కొన్ని రోజులు గడిచిన తరువాత మరల ప్రపంచ యాత్రకు బయలుదేరారు. మొదటి ఇద్దరు సోదరులు పూర్వం వలెనే మంచి బాటల మీదుగా పోసాగారు. మూడవవాడు కూడా ఇదివరకు వలెనే శిలామయమైన మార్గంగుండా పోయి ప్రవాహం పైనున్న వంతెనమీద కూర్చున్నాడు. మొదటి సారివలెనే రెండవసారికూడా తనకు అదృష్టం సంప్రాప్తిస్తుందని అతడు భావింపసాగాడు. మరల అందవికారమైన కప్ప నీటిలోనుంచి బయటకు వచ్చి రాజకుమారునితో ఇలా అంది: "మళ్ళీ వచ్చావు! కారణం ఏమిటి?" ఈ సారి రాజకుమారుడు కప్ప శక్తిని ఏ మాత్రం సందేహించలేదు. అందువలన అతడు తన కోరికను కప్పకు సంపూర్ణంగా తెలిపాడు. "నీ కోరిక నేను తీరుస్తాను" అని కప్ప రాజకుమారునికి వాగ్దానం చేసింది. వెంటనే అది నీటిలోనికి పోయి ఒక చిన్న కాయను తెచ్చి రాజకుమారునకు ఇచ్చింది. పిమ్మట అది ఇలా అంది: "నీవీ చిన్న కాయను తీసుకుపోయి నీ తండ్రికియ్యి, అతడు దీనిని మెల్లగా పగులగొట్టాలి, అప్పుడు ఏమి జరుగుతుందో చూడండి" అంతట రాజకుమారుడు ఎంతో సంతోషించి కప్పకు కృతజ్ఞతాభివందనములు తెలిపి ఇంటికి తిరిగి పోయాడు. చేసిన పనికి బాగా అలసిపోయిన కప్ప నీటిలోకి వెళ్ళిపోయింది.

మొదటి సోదరులిద్దరూ మొట్టమొదట ఇంటికెళ్ళారు.

వారు తమతో బాటు అందమయిన చిన్న చిన్న కుక్కలను తీసుకువచ్చారు. తరువాత మూడవవాడు ఇల్లుచేరుకున్నాడు తన ముగ్గురు కుమారులను తిరిగి చూడగలిగినందుకు రాజు ఎంతో సంతోషించాడు. రాజు మొట్టమొదట పెద్దవారి కుక్కలను పరీక్షించటం ప్రారంభించాడు. అతడు వారికి సహాయం చేయదలచి పెద్ద పెద్ద కాయలు తెప్పించి గుల్ల చేయించాడు. కాని వారు తెచ్చిన కుక్కలలో ఒక్కటి కూడా ఆ గుల్లలలో సరిగా పట్టలేదు. అంతట మొదటి ఇద్దరు నిరాశతో తలలు వంచుకున్నారు. మూడవ కొడుకు తండ్రికి నమస్కరించి తనవద్దనున్న కాయను ఇచ్చి యిలా అన్నాడు: "మీరు దీనిని మెల్లగా పగులగొట్టండి మీకోరిక తీరుతుంది" రాజు ఆ కాయను తీసుకుని మెల్లగా పగుల గొట్టాడు. అప్పుడు ఆ కాయలోనుండి ఎంతో అందంగాఉన్న తెల్లని కుక్కపిల్ల ఒకటి బయటకు వచ్చింది: అది మెల్లగా అటు నిటు పరుగెత్తుతూ మూడవకొడుకువంక చూచి తోక ఆడింపసాగింది. తరువాత అచ్చటనున్న మిగిలిన కుక్కలను జూచి మొరుగసాగింది. అపుడాదృశ్యం చూచి అచ్చటివారు ఆశ్చర్యసముద్రంలో మునిగిపోవటమే గాక ఎంతో సంతో షించారు. రాజు అదృష్టవంతుడగు తృతీయ పుత్రుని మరొ సారి ప్రేమ, ఆదరాలతో కౌగలించుకున్నాడు. "పనికిమాలిన కుక్కలన్నిటినీ సముద్రంలో పారవేయండి" అని రాజు సేవ కులకు ఆజ్ఞాపించాడు. పిమ్మట అతడు ముగ్గురు కొడుకులతో ఇలా అన్నాడు: "మీకు ఇంతవరకు రెండు కష్టమయిన పనులు చెప్పాను, ఇప్పుడు నేను మీకు మూడో అవకాశం

ఇస్తున్నాడు ప్రపంచంలోని యువతులలోకెల్ల అందమయిన దానిని ఎవరు తెస్తారో వారు నా రాజ్యానికి వారసులవుతారు."

ఎంత గొప్ప అవకాశం! ముగ్గురకు ఏ విధమైన సందేహం కలుగలేదు. ముగ్గురు విజయం సాధింప నెంచుకున్నారు. కాని మూడవ వానికి మాత్రం పూర్వం ఉన్నంత ఉత్సాహం ఉన్నట్లు లేదు. అతడు తనలో తాను యిలా అనుకున్నాడు: "ఇంతవరకు రెండుసార్లు ఆ అందవికారమైన కప్ప నాకు మేలు చేకూర్చింది-ఇప్పుడు ఆ కప్ప ప్రపంచ సుందరిని నాకు ఎక్కడనుండి తెచ్చి ఈయగలదు? ఇది అసంభవం? ఇప్పటికి రెండుసార్లు నేను జయించాను, కాని మూడవసారి నేను విజయంసాధించలేనని భయపడుతున్నాను కప్ప నివసిస్తున్న నీటిలో అల్పజీవులుంటాయి గాని అందమైన కన్యలు ఎలా ఉంటారు?" అయినా అతడు ప్రయాణమయ్యాడు. మొదటివారిద్దరుకూడా ప్రయాణమై పోయారు. మూడవవాడు తిన్నగా పోయి నీటి ప్రవాహం పైనున్నవంతెనమీద కూర్చున్నాడు. అతడు బరువైనహృదయంతో నిట్టూర్పులు పుచ్చసాగాడు. అంతలో కప్ప నీటిలోనుండి బయటకు వచ్చింది. "నీవు మళ్ళీ విచారిస్తున్నా వెందుకు?" అని కప్ప రాజకుమారుని ప్రశ్నించింది. "ఓ కప్పా! యీసారి నీవు నాకు ఎట్టి ఉపకారము చేయలేవు!" అని రాజకుమారుడు నిరుత్సాహంతో అన్నాడు. "నీకు ఆసందేహాం ఎందుకు? నీ కోరిక ఏమో నాకు చెప్పు" అని కప్ప అంది. అప్పుడు రాజ కుమారుడు తన కోరికను కప్పకు వివరంగా

తెలియజేశాడు. అంతట కప్ప ఇలాఅంది: "నీవింక తిన్నగా ఇంటికిపో. అందాల రాణి నీ వెనకనే వస్తుంది. కాని ఒక్క విషయంలో మాత్రం జాగ్రత్త వహించు. త్రోవలో ఏమి జరిగినా నీవు మాత్రం నవ్వకు" పిమ్మట కప్ప నీటిలోకి దుమికి అదృశ్యమైంది.

మూడవ రాకుమారునకు ఈసారి కప్ప మాటల యందు అంతగా నమ్మకం లేకపోయింది. అతడు నిట్టూర్పు పుచ్చుతూ ముందుకు కొన్ని అడుగులు వేశాడు. అప్పుడతనికి వెనక భాగాన సవ్వడి వినబడ సాగింది. అంతట నతడు అదేమో తెలుసుకో దలచి వెనకకు తిరిగి చూశాడు. అప్పుడతనికొక వింత దృశ్యం కనిపించింది, ఆరు పెద్ద ఎలుకలుఒక పెద్ద గుమ్మడి కాయను బండిని ఈడ్చునట్లు ఈడ్చుకుని వస్తున్నాయి. ముందు భాగమున ఒక పెద్ద గోదురు కప్ప బండి వానివలె కూర్చుని ఉంది. వెనుక భాగమున రెండు కప్పలు సేవకుల వలె నిలబడి వున్నాయి. బండికి ముందు రెండు ఎలుకలు నడుస్తున్నాయి. బండి మధ్య అంద వికారంగా నున్న కప్ప కూర్చుని వుంది. కాని కప్పలో ఒకవిధమైన లావణ్యం [illegible]లిస్తున్నది. ఆ కప్ప రాజకుమారునకు నమస్కరించింది. ప్రపంచ సుందరిని సంపాదించటం ఎలా అనే ఆలోచనలో మునిగియున్న రాకుమారునకు ఆ దృశ్యం చూడటానికి ఏ మాత్రం తీరిక లేదు. ఆ వింత దృశ్యం చూసి నవ్వటానికి కూడా అతనికి మనస్కరించ లేదు.

బండి కొంచెం ముందుకు పోయింది. దారిలో వంపు ఉండటంవలన రాజకుమారునకు బండి కొంచెంసేపు కనిపించ

లేదు. రాజకుమారుడు కూడా వంపు తిరిగాడు. అప్పుడు తని ఒక ఆశ్చర్యకరమైన దృశ్యం కనిపించింది. ఒక మనోహరమైన బండికి ఆరు తెల్లని గుర్రాలు పూన్చబడివున్నాయి. ఆ బండిలో చక్కని దుస్తులు ధరించిన సేవకులున్నారు.బండి మధ్య ఒక భువన మోహిని కూర్చుని వుంది. ఆమె ప్రపంచంలోని అందమైన యువతులలోకెల్ల అందమైన దానివలె వుంది. రాజకుమారుడు ప్రపంచ సుందరిని బాగా పరీక్షగా చూశాడు. ఆమె ఎవ్వరు? అతడు ఏ యువతిని గాఢంగా ప్రేమించియున్నాడో, ఏ యువతిని పొందటం కోసం అతని హృదయం ఆరాటపడుతోందో, ఆ యువతీ లలామ చెర్రీ బండిలో కూర్చుని ఉంది. రాజకుమారుడు బండిని సమీపించాడు. సేవకులు బండి తలుపులు తెరచి అతనిని లోనికి ఆహ్వానించారు, రాజకుమారుడు వారి ఆహ్వానాన్ని అంగీకరించి లోపలకు పోయి చెర్రీ ప్రక్కన కూర్చున్నాడు.

రాజకుమారుడు ప్రపంచ సుందరితో పాటు రాజగృహం చేరుకున్నాడు. అప్పటికే అతని సోదరులిద్దరూ పలువురు యువతులను అచ్చటకు తీసుకు వచ్చారు. కాని రాజాస్థానంలోని వారంతా ముక్తకంఠంతో చెర్రీయే అక్కడనున్న యువతులందరిలో ఎక్కువ అందమైనదని నిర్ణయించారు. రాజు మూడోసారి మూడోకొడుకును కౌగలించుకుని, నాయనా! నీవే నా రాజ్యానికి అర్హుడవని రుజువైంది. ఇక నీవు నా సింహాసనం మీద కూర్చో” అనిఅన్నాడు. పిమ్మట అతడు సేవకులతో ఇలా అన్నాడు. “నా మొదటి ఇద్దరూ

కోడుకులు తీసుకువచ్చిన యువతులను సముద్రంలోకి విసిరి వేయండి. వారికి సముద్ర మరణమే శరణ్యం."

మూడవ రాజ కుమారునకు ప్రపంచ సుందరి చెలికి ఒక శుభ ముహూర్తాన అత్యంత వైభవంగా వివాహం జరిగింది. వారీనాటికి కూడా రాజ్య పరిపాలన చేస్తూ చక్కగా జీవిస్తున్నారు.

# ఏమి అదృష్టం!

ఒక ఊరిలో ఒక యజమానుడు ఉన్నాడు. అతనివద్ద హేన్సు అను పేరుగల పనివాడొకడున్నాడు. చాలా కాలం పని చేసిన తరువాత ఒకనాడతడు తన యజమానితో ఇలా అన్నాడు. "అయ్యా! నేను ఇల్లు వదిలిపెట్టి వచ్చి చాలా కాలమయింది. నేనిప్పుడు నా తల్లిని చూడాలని గాఢంగా వాంఛిస్తున్నాను. కనుక నాకు రావలసిన డబ్బు ఈయవలసిందిగా ప్రార్థిస్తున్నాను." అంతట యజమానుడు యిలా అన్నాడు: "నీవు చాలా మంచివాడవు. విశ్వాసపాత్రుడవు కనుక నీకు తగినట్లుగా ధనమిస్తాను."అతడు అలాఅనిహేన్సుకు అతని తలకాయంత వెండిముద్దను ఇచ్చాడు.

అతడు యజమానుడిచ్చిన వెండి ముద్దను తనచేతి రుమాలులో కట్టుకున్నాడు. ఆ మూటను భుజముపై పెట్టుకొని ఇంటికి బయలుదేరాడు. అతడు కాళ్ళీడ్చుకుంటూ పోతుండగా గుర్రంపైస్వారీ చేస్తున్న మనుజుడొకడు ఎదురుపడ్డాడు. అతనిని చూసి పనివాడు ఇలా అనుకున్నాడు: "గుర్రంపై స్వారీ చేయటుఎంతో గొప్పవిషయం. అతడు ఇంటివద్ద కుర్చీలో కూర్చున్నట్లు, గుర్రంమీద కూర్చున్నాడు. అతని కాళ్ళకు రాళ్ళు తగలవు. చెప్పులు అరిగి

పోవు. అతడు తనకు తెలియకుండగనే సుఖంగా ముందుకు సాగిపోతున్నాడు."

ఆ మాటలను గుర్రపు యజమానుడు విని ఇలా అన్నాడు: "నీవు నడచి పోతున్నావెందులకు?" పనివాడు ఇలా జవాబిచ్చాడు: "నేను ఈ మూటను మోయవలసి ఉంది. అందులో పెద్ద వెండిముద్ద ఉంది. దాని బరువుకు నేను తలఎత్తలేక పోతున్నాను. భుజం నొప్పిగా ఉంది." ఆమాటలను విని గుర్రపు యజమానుడు ఇలా అన్నాడు: "మన ఇరువురి వస్తువులను మార్చుకుందామా? నేను నీకు గుర్రం యిస్తాను. నీవు నాకు వెండి ముద్దను ఇయ్యి." నాకు ఇవ్వటానికి ఎటువంటి అభ్యంతరమూ లేదు. హృదయ పూర్వకంగా ఇస్తాను. కానీ నీకొకవిషయం స్పష్టం చేయగోరుతున్నాను. ఈ వెండి ముద్ద చాలా భారంగా ఉంది. దీనిని మోసుకొని పోవటం చాలాకష్టం "అనిహాన్సు అన్నాడు. గుర్రపుయజమానుడు గుర్రముపైనుండి క్రిందకు దిగాడు. పనివాని వద్దనుండి వెండి ముద్దను తీసుకున్నాడు. అతనిని గుర్రము పైకెక్కించి కళ్ళెపు త్రాడును చేతికిచ్చాడు. పిమ్మట ఇలా అన్నాడు: "గుర్రమును వేగముగా పోనీయాలనుకుంటే 'జిప్' అని గట్టిగా అరిస్తే చాలును."

గుర్రముపై కూర్చుండి యున్న పనివాడు ఎంతో సంతోషించి ఉత్సాహంతో ముంగుకు సాగిపోయాడు. కొంత సేపయిన పిమ్మట అతడు గుర్రమును వేగంగా పోనీయాలనుకున్నాడు. అతడు పెదవులను గట్టిగా బిగబట్టి 'జిప్' అని తన శక్తికొలది ఆరిచాడు.ఆమాటను వినగానే గుర్రం అతి

వేగంగా పరుగెత్తి సాగింది. అయను దానిని వశం చేసుకో లేక పోయాడు.

దాని వేగమునకతను గుర్రంపై నుండి జారి బాటకు ప్రక్కగానున్న గోతిలో పడ్డాడు. గుర్రమునకు ఎదురుగా వస్తున్న ఒక పశువుల కాపరి దానిని ఆపాడు. లేకపోతే అది తన ఇష్టంవచ్చినట్లు ఎక్కడికో పోయి యుండేది. కొన్నినిము షాల తరువాత అతడు గోతిలోనుండి బాటమీదకు వచ్చాడు అతడు విచారంతోను, కోపంతోను బాధపడుతూ పశువుల కాపరితో ఇలా అన్నాడు: "ఇటువంటి అల్లరి గుర్రం మీద స్వారీ చేయుటం సామాన్యమైన విషయంకాదు- నా కింక ఈ గుర్రం అక్కరలేదు నీ ఆవు అంటే నాకు చాలా ఇష్టంగా ఉంది, ఆమె వెనుక స్వేచ్ఛగా, ఇష్టంవచ్చినట్లు నడవవచ్చు పాలు, పెరుగు, వెన్న మీగడ మొదలయిన వన్నీ పుష్క లంగా లభిస్తాయి. ఇట్టి ఆవు కోసం నేను ఏ వస్తువు యివ్వ టానికయినా వెనుదీయను" ఆ మాటలు విని ఆవుల కాపరి ఇలా అన్నాడు: "నీకు నా ఆవంటే ఇష్టంగావుంటే దానిని నీకు ఇస్తాను. నీ గుర్రాన్ని నాకు ఇస్తే చాలును" అందుకు పనివాడు అంగీకరించాడు. ఆవుల కాపరి ఆనందంతో గుర్రముమీద ఎక్కి తన దారిని పోయాడు.

హాన్సు తన బేరం మంచిదని అనుకుంటూ మెల్లగా ఆవును తోలుకుంటూ ముందుకు పోతున్నాడు. అతడు ఇంకా ఇలా అనుకున్నాడు: "నా వద్ద ఒక రొట్టె ఉంటే నా ఇష్టం వచ్చినప్పుడెల్లా దానిని వెన్నమీగడలతో భుజింపవచ్చు, నాకు దాహమైనప్పుడెల్లా ఆవుపాలు పితికి త్రాగవచ్చు,

ఇంతకంటే నేను కోరదగినవి ఏమి ఉన్నాయి?" తరువాత అతడొక పూటకూళ్ళ కిల్లు చేరుకొని, కొట్టతిని బీరు పానీయం సేవించాడు. అతనివద్ద ఇంక నొక చిన్న రాగినాణె మైనా లేదు. పిమ్మట అతడింకను ముందుకు సాగిపోయాడు. ప్రొద్దెక్కిన కొలది వేడి క్రమ క్రమంగా హెచ్చుతుంది. మధ్యాహ్నం అయ్యేసరికి అతడొక విశాలమైన చవిటి పఱ్ఱను చేరుకున్నాడు. దానిని దాటటానికి కనీసం ఒక గంట కాలమైనా పడుతుంది. ఆ పఱ్ఱలో ప్రయాణం చేస్తుండగా అతనికి అమితమైన దాహబాధ వేసింది. నాలుక ఎండిపోసా గింది. అప్పుడతడు ఇలా అనుకున్నాడు: "ఈ బాధను నేను సులభంగా పోగొట్టుకుంటాను. ఆవుపాలు పితికి త్రాగుతాను నా దాహబాధ పోతుంది" అతడలా అనుకొని ఆవును ఒక చెట్టుకు కట్టివేశాడు. తన టోపీలోకి పాలు పితకటానికి ప్రయ త్నించాడు. కాని అందులోకి ఒక చుక్కైనా పడలేదు.

అయినా అతడు ఆవుపాలు పితికటానికి ప్రయత్ని స్తూనే యున్నాడు. అది దానికి చాలా బాధాకరంగా ఉంది. అందువలన నది అతనిని గట్టిగా తన్నింది. ఆ తన్ను అతని తలమీద తగిలింది. ఆ తాపుకతడు స్పృహతప్పి నేలమీద పడ్డాడు. కొంతసేపటికతనికి తెలివి వచ్చింది. కాని అతడు లేచి కూర్చో లేకపోతున్నాడు. అదృష్టవశమున ఒక కసాయి వాడు ఆ సమయాన ఒక పందిని తోలుకుంటూ ఆ దారిని పోతున్నాడు. అతడు హాన్సును లేవదీసి కూర్చుండ బెట్టి "ఇలా ఉన్నావేమిటి? ఏమి జరిగింది?" అని ప్రశ్నించాడు. జరిగిన విషయమంతా తెలుసుకున్నాడు. పిమ్మట ఆ కసాయి

వాడు అతనికొక పానీయం ఇచ్చి "దీనిని త్రాగి సేదతీర్చుకో నీ ఆవు పాలు ఇవ్వదు-ఇది ముసలి ఆవు. ఇక ఇది కసాయి దుకాణానికి పోవలసిందే" అని అన్నాడు. "అయ్యో! ఇలా జరుగుతుందని నేను ఏ మాత్రం ఊహించలేదు. నేను దీనిని చంపినందువల్ల నాకు లాభమేమిటి? నాకు ఆవు మాంసం అంటే అసహ్యం నాకది ఏ మాత్రం బాగుండదే. ఇది పంది అయినా కొంచెం బాగుండేది. పందిమాంసంతో కొన్ని మంచి పదార్థాలు తయారుచేసుకోవచ్చు" అని హాన్స్ అన్నాడు. అప్పుడు కసాయివాడు ఇలా అన్నాడు: "నీఆవును నాకిస్తే పందిని నీకిస్తాను." హాన్స్ అందుకు అంగీకరించి పందికాలుకు కట్టబడియున్న త్రాడు పట్టుకొని ముందుకు సాగి పోయాడు. కసాయివాడు ఆవును తోలుకు పోయాడు.

పనివాడు తనలో తాను అనుకోసాగాడు: "ఇప్పటికి అన్ని విషయాలుచక్కబడ్డాయి. మొదట నన్ను దురదృష్టం ఆవహించినమాట నిజమే. కాని ఇపుడు అందుకు తగిన ప్రతి ఫలం వడ్డీతోసహా ముట్టింది" తరువాత అతనికి ఒక చక్కని తెల్లని బాతును తీసుకుపోతున్న పల్లెటూరివాడు కనిపించాడు. పల్లెటూరివాడు ఆగి: "ఇప్పుడు సమయం ఎంత అ[illegible] తీసి ప్రశ్నించాడు. పనివాడు ఆ ప్రశ్నకు తగిన సమాధానం ఇచ్చాడు. అంతటితో అతడు సంతృప్తి చెందక తనకు కలిగిన అదృష్టమును ఆ పల్లెటూరి వానికి వివరించి చెప్పాడు. అపుడు పల్లెటూరివాడు ఇలా అన్నాడు: "ఈ బాతునుపట్టుకొని చూడు! ఇది ఎంతబరువుందో! దీని వయస్సు ఎనిమిది వారాలు మాత్రమే. కాని ఇది ఎంతో మాంసం ఇస్తుంది"

పనివాడు బాతును పట్టుకొని చేతితో తూచి, "నీవు సరియైన విషయమునే చెప్పినావు. నా పందిగూడా సామాన్య మైనది కాదు" అని అన్నాడు. పల్లెటూరివాడు విషాదచ్ఛాయలు ప్రదర్శిస్తూ ఇలా అన్నాడు: "ఈ పంది నిన్ను చిక్కులలో పెడుతుందని భయపడుతున్నావు, నేనిపుడే ఒక గ్రామం నుండి వస్తున్నాను. ఆ గ్రామంలో భూస్వామి పంది ఒకటి దొంగిలింప బడింది-నీ వద్దనున్న పంది ఆ భూస్వామికి సంబంచిన పంది అని నాకు కొంచెం అనుమానంగా ఉంది. నీవు ఆ భూస్వామికి పట్టుబడితే నిన్ను ఏమి చేస్తాడో అని నాకు అవరిమితమైన భయంగా ఉంది. అతడు నీకు విధించే కనీస శిక్ష ఏమిటంటే అతడు నిన్ను గుర్రములు నీరు త్రాగే చెరువులోకి విసిరి వేస్తాడు.

పనివానికి అపరిమితమగు భయం కలిగింది. అతడు పల్లెటూరి వానితో ఇలా అన్నాడు: "ఓ సహృదయుడా! దయ యుంచి నన్ను చిక్కులనుండి రక్షించు. ఈ ప్రాంతం అంతా నా కంటే నీకు బాగా తెలుసు, అందుచేత నీబాతును నాకిచ్చి, నా పందిని నువ్వు తీసుకో." అంతట పల్లెటూరివాడు ఇలా అన్నాడు: "మిత్రమా! బేరంలో లాభం ఉండాలికదా నీవు చెప్పిన మార్పుల వలన నాకు కలిగే లాభం ఏదీలేదు-అయినా నీవు చిక్కులలో మునిగి యున్నావు కనుక నీవు చెప్పిన దానికి అంగీకరిస్తాను" పల్లెటూరివాడు పందిని తీసు

కొని ప్రక్క దారిని పోయాడు. హాన్స్ నిశ్చింతగా ముందుకు పోసాగాడు. "ఈ మార్పు నా మంచికోసమే వచ్చింది, దీని మాంసం వండుకొని తృప్తిగా భుజింపవచ్చును. దీని క్రొవ్వు ఆరునెలల వరకు సరిపోతుంది. దీని తెల్లని ఈకలు ఎంతో మనోహరంగాను, మెత్తగాను ఉంటాయి. వీనితో నేనొక తలగడ తయారు చేసుకుంటాను, దానిమీద తలపెట్టుకొని సుఖంగా నిదురిస్తాను. నా తల్లి ఎంతగానో ఆనందిస్తుంది." అని అతడు అనుకోసాగాడు.

అతడు ఒక గ్రామంలో ప్రవేశించాడు. ఆ గ్రామంలో ఒకడు చక్రం తిప్పుతూ కత్తులు కత్తెరలు మున్నగు వాటిని సానపడుతున్నాడు' అతడు హాయిగా నిశ్చింతగా పాడుకుంటు న్నాడు, హాన్స్ ఆ పాటను వింటూ ఆ మనుజుని చూడ సాగాడు, కొంతసేపయిన పిమ్మట అతడు సానపట్టువానితో ఇలా అన్నాడు. అవును, "ఆవును నాది చాలా లాభసాటి వ్యాపారం. జేబులో ఎప్పుడు కావలసినా డబ్బులుంటాయి, పరేకాని నీవు ఆ అందమైన బాతును ఎక్కడ సంపాదించావు" నేను దీనిని కొనలేదు. ఒక పందిని ఇచ్చి దీనిని తీసు కున్నాను." అని హాన్స్ అన్నాడు.

"పందిని ఎక్కడ సంపాదించావు?"
"ఆవునిచ్చి పందిని తీసుకున్నాను."
"ఆవును ఎక్కడ సంపాదించావు?"
"మంచి గుర్రం యిచ్చి ఆవును తీసుకున్నాను"

"గుర్రం ఎలా సంపాదించావు"

"నా తలకాయంత వెండి ముద్దనుయిచ్చి వేసి,గుర్రాన్ని తీసుకున్నాను."

"వెండి ముద్దను ఎలా సంపాదించావు"

"ఏడు సంవత్సరాలు కష్టపడి పనిచేసి సంపాదించాను"

"నీవు యింతవరకు బాగా లాభం పొందుతూనే వచ్చావు. ఇక ముందు నీవు జేబులో చేయి పెట్టినప్పుడ్ల్లా డబ్బులుండేటట్లు చూచుకోవాలి."

"అలావుండటం మంచిదే కాని అది ఎలా సంభవిస్తుంది."

"నీవు కూడా నావలె సానపట్టువాడుగా తయారు కావాలి. నీవద్ద సానరాయి ఒకటి వుండాలి. నా వద్ద వున్న ఇంకోరాయిని నీకిస్తాను. నీ బాతును నాకిస్తావా"

"ఇంకా నన్ను ప్రశ్నిస్తున్నావా? జేబులో చేయి పెట్టినప్పుడెల్లా డబ్బులుంటే అంతకంటే కావలసిన ఏముంది? నీ బేరం నాకు తప్పక అంగీకారమే. ఇదిగో బాతును తీసుకో.

సానపట్టుబుడు బాతును తీసుకున్నాడు. ఎందుకూ పనికిరాని రాయి నొకదానిని తీసుకువచ్చి హాన్సుకుఇచ్చాడు. "ఈ రాయి చాలా విలువయినది. మేలు రకానికి చెందినది.

నీవు దానిని జాగ్రత్తగా తెలివి తేటలతో ఉపయోగించాలి. దీనితో నీవు ఏ పనియైనా చేయవచ్చును" అని కూడా సాన పట్టువాడు అన్నాడు.

హాన్సు సానపట్టు వానివద్దనుండి రాయిని తీసుకుని తేలికవడిన హృదయంతో ముందుకు పోసాగాడు. అపరిమిత మయిన సంతోషంతో అతనికన్నులు మిలమిల మెరుస్తున్నాయి అతడు ననలో తాను యిలా అనుకున్నాడు. "నేను పుట్టిన సమయం చాలా మంచిదనుకుంటాను. నేనుపట్టిందల్లాబంగారం అవుతున్నది. నేను కోరినదెల్లా లభ్యమవుతోంది."

తెల్లవారినప్పటి నుండి నడుస్తున్న హాన్సు బాగా అలిసిపోయాడు. అతనికి ఆకలి బాధకూడా మిక్కుటంగా వుంది. రాయి అతనికి కడు భారంగా కనబడసాగింది. అతడిక ముందుకు పోలేకపోయాడు. అయినా అతడెలాగో కాళ్ళీడ్చు కుంటూ ఒక తటాకం దగ్గరకు పోయాడు. అతిడచ్చటమంచి మంచినీరు త్రాగి కొంచం సేపు విశ్రమింపదలిచాడు. అతడు రాయిని తటాకపుడొడ్డున జాగ్రత్తగా ఉంచాడు. కాని మంచినీరు త్రాగటానికి వంగుతున్న సమయాన పొరపాటున రాయిని ముందుకు తోశాడు. రాయి తటాకంలోపడి అడుగు భాగం చేరుకుంది. రాయి నిర్మలమయిన నీటిలో మునుగు తుండగా హాన్సు చూస్తూనే యున్నాడు. మునుగుట పూర్తి అయిన తరువాత అతడు సంతోషంతో గంతులు వేశాడు. అతడు మోకరిల్లి కడు భారంగా వున్న రాయినిపోగొట్టి తన్ను రక్షించినందుకు కరుణామయుడయిన భగవానుని ఎంతో కొని

పోడాడు. అతడు ఇలా అన్నాడు: "నేనిప్పుడు ఎంత సుఖంగా ఉన్నాను! ఏమానవుడు గాని ఎన్నడూ ఇంత సౌఖ్యం అనుభవించి యుండ లేదని నేను నిశ్చయంగా చెప్ప గలను." పిమ్మట అతడు భారరహితమైన సంతోషహృద యంతో కష్టములనుండి విముక్తుడై ముందుకు పయనమై పోయాడు. ఎట్టకేలకతడు తనతల్లి గృహం చేరుకున్నాడు. అతని అదృష్టం ఏమి అదృష్టం!

# పిచ్చుక పగ

ఒక గ్రామంలో ఒక గొర్రెల కాపరి నివసిస్తున్నాడు. అతని వద్ద ఒక కుక్క ఉంది. యజమానుడు ఆకుక్కనుగూర్చి అంతగా పట్టించుకోవటంలేదు. అది చాలాసార్లు ఆకలి బాధతో మల మల మాడసాగింది. ఎట్టకేలకా కుక్క ఆ బాధను భరించ లేక పోయింది. అందువలన అది ఒక నాడు కాలికి బుద్ధిచెప్పి తన చిత్తం వచ్చినట్లు పరుగెత్తుకొని పోసాగింది. అప్పుడు దానికొకచోట ఒక పిచ్చుక కనిపించింది. కుక్క విచారం గమనించిన పిచ్చుక దానితో ఇలా అంది: "మిత్రుడా! నీవేల అంత విచారముగా ఉన్నావు?" అప్పుడు కుక్క ఇలా జవాబిచ్చింది: "నేను ఆకలితో బాధపడుతున్నాను. నాకు తింటానికి ఏమీ లేదు.." "అయితే నీవు నాతో సమీపముననున్న పట్టణానికిరా. నీకు కావలసినంత ఆహారం చూపిస్తాను." అని పిచ్చుక అంది. అంత ఆ రెండూ కలిసి సమీపముననున్న పట్టణానికి వెళ్ళాయి. అచ్చట ఆ రెండూ ఒక కసాయి వాని దుకాణానికి ప్రక్కగా పోతున్నాయి. అపుడు పిచ్చుక కుక్కతో ఇలా అంది: "నేను నీకొక మాంసపు ముక్కను ఇస్తాను. అంతవరకు ఆగియుండు." తన్నెవ్వరును చూచుచుండని సమయాన పిచ్చుక ఒక

మాంసపు ముక్కను క్రింద పడవేసింది. కుక్క ఆ మాంపు ముక్కను నోటకఱచుకొని ఒక మూలకు పోయితింది.

అంతట పిచ్చుక కుక్కతో ఇలా అంది: " నీకింకో మాంసంకావాలంటే చెప్పు. ఇంకోముక్క క్రిందపడేస్తాను." తనకింకో మాంసం కావాలని కుక్క అంది. పిచ్చుక మఱి యొక మాంసపు ముక్కను క్రింద పడవేసింది. కుక్క దానిని కూడా తినివేసింది. "ఓ మంచి మిత్రుడా! నీకిప్పుడు కడుపు నిండిందా?" అని పిచ్చుక కుక్కను ప్రశ్నించింది. " నాకు మాంసం సరిపోయింది. కాని మాంసం తిన్నతరువాత రొట్టె తినాలని ఉంది." అని కుక్క జవాబిచ్చింది. "అలాగయితే నీవు నాతోరా. నీకు రొట్టె ముక్కకూడా ఇస్తాను." అని పిచ్చుక అంది.

పిచ్చుక కుక్కను ఒక రొట్టెల దుకాణం దగ్గరకు తీసుకు పోయింది. అచ్చట ఆపిచ్చుక కిటికీలోనున్న రెండు రొట్టెలను క్రిందపడవేసింది. కుక్క ఆ రెండు రొట్టెలుతిని తనకింకాతినాలని ఉన్నదని అంది. అపుడు పిచ్చుకకుక్కను మఱియొక దుకాణం దగ్గరకు తీసుకుపోయి ఇంకను కొన్ని రొట్టెలను ఇచ్చింది. కుక్క వానినికూడా తిని వేసింది. "నీకు సంతృప్తికలిగిందా?" అని పిచ్చుక ప్రశ్నించింది. "సంతృప్తి కలిగింది. మనమిప్పుడింక వాహ్యాళికి పోదాం" అని కుక్క అంది. అందుచేత ఆ రెండూ రాజ బాటమీద ప్రయాణం చేయసాగాయి. గాలి వేడిగా ఉండుటవలన కొంత దూరం పోయిన తరువాత కుక్క ఇలా అంది. "మిత్రమా! నేను బాగా అలసిపోయాను. నాకింక నిద్ర పోవాలని ఉంది."

"సరే. నిదురపో. నేనీలోపల ఒక పొదపై కూర్చుంటాను." అని పిచ్చుకఅంది. కుక్క అవయవాలన్నీ చాపుకొనిబాటపై పరుండి గాఢనిదురలో మునిగిపోయింది.

కుక్క గాఢ నిద్రలో మునిగియుండగా ఒక బండివాడు తనబండిని తోలుకుంటూ ఆ దారిని వస్తున్నాడు. ఆబండిలో రెండు ద్రాక్షసారా సీసాలున్నాయి: ఆ బండిని మూడు గుర్రాలు లాగుతున్నాయి. బండి కుక్కమీదుగా పోతుం దనే అభిప్రాయంతో పిచ్చుక బండివానితో ఇలా అంది: "ఓబండి వాడా! ఆగుమాగుము. లేకపోతే నీవు దుష్ఫలితం పొందగలవు." అప్పుడు బండివాడు ఇలా అన్నాడు: "ఓ పిచ్చుకా! నీవు నన్నేమి చేయగలవు ? ఏమి చేయగలవో చెప్పు చూస్తాను." అతడు అలా అని బండిని ఆపక కొరడాతో గుఱ్ఱములను అదలించి బండిని కుక్క పైగా పోనిచ్చాడు. ఆ బండి బరువుకు కుక్క మరణించింది.

కుక్క దుస్థితిని చూచిన పిచ్చుక బండివానితో ఇలా అంది: "ఓరి దుర్మార్గుడా! కఠిన హృదయుడా! ఈ కుక్క నాకు మంచి మిత్రను. అటు వంటి దానిని నిష్కారణంగా చంపివేశావు. అది నీకు ఎటువంటి అపకారము చేసియుండ లేదు. ఇప్పుడు నేనుచెప్పబోవుదానిని జాగ్రత్తగాఆలకించు: నీవు చేసిన ఈ పాపమునకు ఇప్పుడే ఫలితం అనుభవిస్తావు." దుర్మార్గుడగు బండివాడు ఇలా అన్నాడు: "నీకు చేతనైతే

నేనక్కిక్కొలది నాకు అపకారం చేసుకో. నీవు ఏమి చేయగలవో చూద్దామని బుద్ధి పుడుతున్నది." అతడలా అని తన దారిని వెళ్ళి పోయాడు.

పిచ్చుక మెల్లన బండి క్రింద దూరి కష్టపడి ఒకపీపా మూతను తెరిచింది. పీపాలోని ద్రాక్షసారాయమంతా నేల పాలయింది. ఈ విషయమును బండివాడు ఏ మాత్రము గమనించలేదు. ఎట్టకేలకతడు వెనుకకు తిరిగిచూశాడు. బండీ అంతా తడిసి పోయిందని, ఒక పీపా ఖాళీగా ఉందని అతడు గ్రహించాడు. "అయ్యో! నేనెంతటి దురదృష్టవంతుడను!" అని బండివాడు అన్నాడు. "అప్పుడే ఏమైంది? నీపని ఇంకా పూర్తి కాలేదు" అని యని ఆ పిచ్చుక ఒక గుఱ్ఱం తలపై వాలి ముక్కుతో గట్టిగా పొడవ సాగింది. అగుఱ్ఱం బాధ భరించలేక మారాం చేయసాగింది. బండివాడు కుపితుడై బండిలో నున్న చిన్న గొడ్డలిని తీసి పిచ్చుకను చంపాలనే ఉద్దేశంతో దానిపైకి విసిరాడు. కాని ఆగొడ్డలి గురితప్పి గుఱ్ఱం తలపై పడింది. ఆ దెబ్బకది నేలకూలి మరణించింది. తెలివిగల పిచ్చుక ఏ అపాయం లేకుండా ఎగిరిపోయింది.

"అయ్యో! నేనెంతటి దురదృష్టవంతుడను!" అని బండివాడు వాపోయాడు. "అప్పుడే ఏమైంది: నీపని ఇంకా పూర్తికాలేదు" అనిపిచ్చుక అంది. బండివాడు రెండు గుఱ్ఱాలు మాత్రమే లాగుతున్నబండిని తోలుతూ ముందుకు సాగిపోయాడు. అప్పుడు పిచ్చుక మరల బండి క్రిందదూరి

కష్టపడి రెండవపీపా మూతనుకూడ తీసివేసింది. అందులో నున్న ద్రాక్షసారాయమంతా నేలపాలయింది. కొంత తడవైన తరువాత బండివాడా విషయం గ్రహించాడు "అయ్యో! నేనెంతటి దురదృష్టవంతుడను!" అనిబండివాడు విలపించాడు. "అప్పుడే ఏమైంది? నీపని ఇంకాపూర్తి కాలేదు!" అని పిచ్చుక అంది అల్లని రెండవగుఱ్ఱం తలపై వ్రాలి పొడవసాగింది. బండివాడు మరల చిన్నగొడ్డలిని పిచ్చుకపైకి విసిరాడు. పిచ్చుక ఎగిరిపోయింది. గొడ్డలి గుఱ్ఱం తలపై గట్టిగా తగిలింది. ఆదెబ్బకదితాళజాలక నేలగూలి ప్రాణంకోల్పోయింది. "నాదురదృష్టాన్ని ఏమని వర్ణిస్తాను!" అని బండివాడు అన్నాడు: "నీపని అప్పుడేకాలేదు" అని తరువాత అది మూడోగుఱ్ఱంపై వ్రాలి ముక్కుతో పొడువసాగింది. మతిచెడిన బండివాడు మరల చిన్న గొడ్డలిని దానిపై విసిరాడు, ఆదెబ్బకు మూడోగుఱ్ఱంకూడా మరణించింది. "అయ్యో! నావంటి దురదృష్టవంతుడు ఇంకొకడు ఈ ప్రపంచంలో ఉండడు!" అని బండివాడు అనుకున్నాడు. "అప్పుడే ఏమైంది? నేను నీ యింటికే వచ్చి నిన్ను శిక్షిస్తాను!" అని పిచ్చుకఅంది.

బండివాడు బండిని వదలిపెట్టి కోపంతోను, చిరాకుతోను ఇంటికిపోయి భార్యతో ఇలాఅన్నాడు: "నాకు ఎటువంటి దురదృష్టం సంప్రాప్తించింది! రెండు పీపాల ద్రాక్ష

సారాయమంతా నేలపాలయింది. మూడుగుఱ్ఱాలు మరణించాయి" "మనకు అన్నీ విపత్తులే ఎక్కడినుంచో ఒక పాడు పక్షి వచ్చింది. అదితనతోబాటు ప్రపంచంలోని పక్షులన్నిటినీ తీసుకువచ్చి నట్లుంది. అవిఅన్నీ కలిసి గాదెలో ధాన్యం అన్నీ తినేస్తున్నాయి." అని భార్య అంది వెంటనే అతను గాదెవద్దకుపోయి కొన్ని వేలపక్షులు ధాన్యంతినేస్తున్న దృశ్యాన్నితిలకించాడు. ఆ పక్షుల మధ్యనున్న పిచ్చుకనుకూడ అతడుచూచాడు. గాదెలోధాన్యంఅడుగంటింది. "అయ్యో! నేను ఎంతటి దురదృష్టవంతుడను!" అని బండివాడు అన్నాడు "నీపని ఇంకా పూర్తికాలేదు. క్రూరుడవగు నీవు కుక్కను నిష్కారణంగా చంపావు. అందువలన నీప్రాణం పోగొట్టుకోవాలి" అని పిచ్చుక అంది.

అంతా పోగొట్టుకున్న బండివాడు వంట ఇంటిలోకి వెళ్ళాడు. అతడు తాను చేసిన పనికి ఇంకను ఏమాత్రం విచారింపక ఒక మూల కూర్చున్నాడు. పిచ్చుక అచ్చట నున్న కిటికీపై కూర్చుని బండివానితో ఇలా అంది: "బండివాడా! నీవు నీప్రాణాలు పోగొట్టుకొనే సమయంవచ్చింది." ఆ మాట వినగానే బండివాడు మండిపడి చిన్న గొడ్డలిని పిచ్చుకపైకి విసిరాడు. కాని అది గురితప్పి కిటికీని మాత్రం బ్రద్దల కొట్టింది. పిచ్చుక మరల రాబోవు ప్రమాదమును గూర్చి బండివానిని హెచ్చరించింది. అపుడు బండివానికి, అతని భార్యకు చాలా కోపం వచ్చింది. బండివానికి పిచ్చి

ఎత్తినట్లయింది, పిచ్చుక ఒక వస్తువు పైనుంచి మరి యొక వస్తువుపైకి ఎగురుతోంది. దానిని చంపాలని భార్యాభర్త లిద్దరూ ప్రయత్నింపసాగారు. ఫలితంగా ఆ వస్తువులన్నీ విరగ సాగాయి. ఎట్టకేలకు వారు పిచ్చుకను ప్రాణాలతో పట్టుకున్నారు. "నేనీ పిచ్చుకను వెంటనే చంపనా?" అని భార్య భర్తను అడిగింది. "వలదు. వలదు. అది నన్నెన్నో తిప్పలు పెట్టింది, దాని ప్రాణం అంత సులభంగా తీసి వేయకూడదు. దానిని తీవ్రంగా హింసించి చంపి వేయాలి. నేను దానిని తింటాను" అని భర్త అన్నాడు.

పిచ్చుక బండివాని చేతిలోనే ఉంది. "బండివాడా! నీవు ప్రాణం పోగొట్టుకొనే సమయం వచ్చింది." అని అది అంది. అప్పుడతడు ఇంక కోపం ఆపుకోలేక పోయాడు. అందువలన అతడు చిన్న గొడ్డలిని భార్యచేతికిచ్చి, "సతీ మణీ! ఈ గొడ్డలిని నాచేతిలో నున్న పిచ్చుకపైకివిసిరి దానిని చంపు" అని అన్నాడు. భార్య భర్త చెప్పినట్లు గొడ్డలి విసిరింది. కాని గురి తప్పింది. గొడ్డలి దెబ్బ బండివాని తల మీద గట్టిగా తగిలింది. అంత నతడు నేలపై బడి మరణిం చాడు. అపుడు పిచ్చుక శాంతించి తన ఇంటికి ఎగిరి పోయి సుఖంగా కాలం గడుపుతోంది. పిచ్చుక పగ ఎంత పని చేసిందో చూడండి!

# ఎముక చెప్పిన రహస్యం

పూర్వం ఒక రాజు తన రాజ్యాన్ని చక్కగా పరిపాలించుకొంటున్నాడు. ఒకప్పుడొక అడవిపంది ఆ దేశంలో ప్రవేశించి పంటపొలాలు నాశనం చేయసాగింది. పశువులను చంపి వేయ సాగింది. తనకు అడ్డువచ్చిన మనుష్యులలందరినీ యమలోకానికి పంపసాగింది. అందువలన ప్రజలందరిలో అపరిమితంగా భయపడి రాజువద్దకు పోయి తమదీనావస్థను మొఱపెట్టుకున్నారు. అప్పుడు రాజు ఆ క్రూరజంతువును చంపినవారికి గొప్పగొప్ప బహుమానాలు ఇస్తానని దేశమంతటా చాటింపు వేయించాడు. కాని ఎంతో పెద్దది బలిష్టమైనది అయిన ఆ క్రూర జంతువును పట్టు కోటానికి ఎవ్వరూ సాహసించలేదు. బహుమానాలకుఆశపడి ఎవ్వరూ తమ ప్రాణాలు పోగొట్టుకోవటానికి ఇష్టపడలేదు.

కాని ఎల్లకాలం అందరూ పిరికి వారుగాఉండరుగదా! ఆ దేశంలోనే నివశిస్తున్న ఒక బీదవానికి ఇద్దరు కొడుకులున్నారు. వారు క్రూర జంతువుని చంపి రాజుగారి వద్దనుండి బహుమానాలు పొందాలని నిశ్చయించు కున్నారు. వారిలో పెద్దవాడు వట్టి జిత్తులమారి; మంచి జాగ్రత్త కలవాడు. అతడు డాంబికం కోసం క్రూర జంతువును చంపుతానని ప్రకటించాడు. రెండవవాడు వట్టి అమాయకుడు.

అతడు ప్రజల బాధలు చూడలేక క్రూర జంతువును చంప టానికి అంగీకరించాడు. వారిరువురు రాజువద్దకు పోయి తమ కృతనిశ్చయం తెలిపారు. అప్పుడు రాజు వారితో ఇలా అన్నాడు. "మీరిద్దరూ అడవిలో వేర్వేరు దిక్కుల నుండి ప్రవేశించండి. అప్పుడు మీరా క్రూర జంతువును తప్పక కలసికోగలరు." అంతట పెద్దవాడు అడవి పడమటివైపుకు వెళ్ళాడు.

రెండవవాడు కొంతదూరం ముందుకు పోయాడు. అప్పుడాతనికి ఒక పొట్టివాడు కనిపించాడు. అ పొట్టివాడు రెండవవానికి ఒకనల్లని బల్లెమును ఇచ్చి ఇలా అన్నాడు. "నీవు వట్టి అమాయకుడవు. దయాపరుడవు. కనుక దీనిని నీ కిస్తున్నాను. నీవు దీంతో అడవి పందిని సురక్షితంగా ఎదు ర్కొనవచ్చును. నీకు ఎటువంటి హాని జరుగదు." అంతట రెండవవాడు పొట్టివానికి కృతజ్ఞత తెలిపి నిర్భయంగా ముందుకు సాగిపోయాడు.

అనతి కాలంలో రెండవవాడు అడవి పందిని ఎదు ర్కొన్నాడు. అది అతి వేగంతో అతనిపైకి రాసాగింది. అంతట నతడు బల్లెంతో దానిని హృదయంలో పొడిచాడు. ఆ దెబ్బకు అడవిపంది నేలకూలింది. అంతట నతడు దానిని భుజములమీద పెట్టుకొని రాజువద్దకు బయలు దేరాడు.

అతడు అడవిలో రెండవవైపుకు వెళ్ళాడు. అచ్చట ఆతనికి ఒక ఇల్లుకనిపించింది. ఆఇంటిలో కొంతమంది ద్రాక్ష సారాయం సేవిస్తూ నాట్యం చేస్తున్నారు. అచ్చట మొదటి

వాడుకూడ ద్రాక్షసారాయం తాగుతున్నాడు. ద్రాక్ష సారాయం తాగి ధైర్యం తెచ్చుకొని అడవి పందిని చంప టానికి వెళ్ళాలని అతడు అను కుంటున్నాడు. అంతలో అతడు అడివి పందిని చంపి తీసుకువస్తున్న సోదరుని చూశాడు. వెంటనే అతడు దుష్టబుద్ధితో రెండోవానితో ఇలా అన్నాడు. "సోదరుడా! ఇలారమ్ము. ఇక్కడ కొంచెం సేపు విశ్రాంతి తీసుకో. కొద్దిగా ద్రాక్షసారాయం సేవించు.

రెండవవాడు ఎటువంటి అపాయాన్ని శంకించక మొదటివాని వద్దకు వెళ్ళి దాక్ష సారాయం తాగుతూ తన కథ అంతా చెప్పివేశాడు. అక్కడ సోదరులిద్దఱూ సాయం కాలం వఱకూ ఉన్నారు. కనుచీకటి పడిన తరువాత సోదరు లిద్దఱూ రాజుగారి దగ్గరకు బయలుదేఱారు. త్రోవలో వారొక వంతెనను దాటవలసి వచ్చింది. రెండవవాడు మొట్టమొదట వంతెనపైకి వెళ్ళాడు. అప్పుడు మొదటివాడు రెండవవానినొక దెబ్బకొట్టి చంపివేసి వంతెనక్రింద పాతి పెట్టాడు.

పిమ్మట మొదటివాడు చచ్చిన అడవిపందిని రాజు వద్దకు తీసుకొనిపోయి, "ప్రభూ! నేను దీనిని ఎంతో కష్టపడి చంపాను" అనిచెప్పాడు. రాజు ఎంతో సంతోషించి వెంటనే తనకూతురును అతనికిచ్చి అతివైభవంగా వివాహంచేశాడు. రెండవవాడు తిరిగి రానందున, "అడవిపంది అతనిని చంపి ఉంటుంది" అని రాజు అనుకొన్నాడు.

కాని భగవంతుడు అన్నివిషయాలు చూస్తూఉంటాడు గదా! కనుక మొదటివాడు చేసిన ద్రోహం ఎప్పటికైనా

బయటకు రాకమానదు. చాలా సంవత్సరాలు గడచిన తరువాత ఒక గొర్రెలకాపరి రెండవవాడు చంపబడిన వంతెన పైగా పోతున్నాడు. అపుడతని కచట ఇసుకలో ఒక తెల్లని ఎముక దొరికింది. గొర్రెలకాపరి ఆ ఎముకను నోటిలో పెట్టుకొని ఊదసాగాడు. అపుడా ఎముకనుండి ఒకపాట వెలువడింది. ఆ పాట అర్థము ఇలావుంది: "నా ఎముక ఊదుతున్న ఓ గొర్రెలకాపరీ! దుర్మార్గుడగు నాసోదరుడు నన్ను చంపి పాతిపెట్టాడు. అడవిపందిని నిజంగా చంపింది నేను. నేనే బహుమానాలకు అర్హుడను. నా సోదరుడు కాడు."

"ఈ ఎముక అద్భుతమైనది! తనంతటతానే పాడుతోంది. దీనిని రాజుకు చూపాలి" అని గొర్రెలకాపరి అనుకున్నాడు. వెంటనే అతడు రాజువద్దకు పోయాడు. ఎముక ఎప్పటివలె పాడసాగింది. అపుడు రాజుకు అంతా అర్థమైంది? అతడు వంతెన క్రింద త్రవ్వించాడు. అచ్చట రెండవవాని అస్థిపంజరం బయటపడింది. అపుడు దుర్మార్గుడగు సోదరుడు గత్యంతరంలేక తానుచేసిన ఘోరమైన నేరమును ఒప్పుకున్నాడు. అపుడు రాజు కుపితుడై అల్లుడనియైనా తలచక అతనినొక సంచిలో కట్టించి నదిలోకి విసరివేయించాడు. రెండవవాని అస్థిపంజరమును చర్చి ఆవరణలో పాతి పెట్టించాడు.

# అదృష్టవంతులు

ఒక ఊరిలో ముసలివాడొకడు నివశిస్తున్నాడు. అతనికి ముగ్గురు కొడుకులున్నారు. ఒక నాడతడు తనముగ్గురు కొడుకులను దగ్గరకు పిలిచాడు. మొదటి వానికి ఒక కోడిపుంజును, రెండవవానికొక కొడవలిని, మూడవవానికొక పిల్లిని ఇచ్చాడు. తరువాత అతడు వారితో ఇలా అన్నాడు. "నేను ముసలివాడనయ్యాను. చనిపోయే రోజు దగ్గర పడుతోంది. నేను చనిపోయేముందు సంతోషంతో మీకు చేయగల సహాయం చేస్తాను. నావద్ద ధనం మాత్రం లేదు. మీ ముగ్గురకు మూడిటి నిచ్చాను. మీరు మీ తెలివి తేటలతో వానిని ఉపయోగించుకొని అదృష్టవంతులుకండి. కాని ఒక్క విషయం జ్ఞప్తియందుంచుకోండి. మీవద్దనున్నవి లేని భూములకు వెళ్ళండి. మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి."

ముసలివాడు మరణించాడు. అప్పుడు మొదటి కుమారుడు కోడి పుంజును తీసుకొని ప్రపంచ యాత్రకు బయలుదేరి పోయాడు. అతడు ఎక్కడికి వెళ్ళినా కోడి పుంజులు కనబడుతూనే ఉన్నాయి. అందుచేత అతనికి చాలా కాలం వరకు తన వద్దనున్న కోడిపుంజు సహాయంతో అదృష్టం పొందే అవకాశం లభించలేదు. కొంత కాలం గడిచిన తరువాత అతడొక దీవిని చేరుకున్నాడు. అచ్చటి వారు ఇది

వరకెన్నడూ కోడి పుంజును చూచి యుండలేదు. కాలమును తెలిసికొను విధానము కూడ వారికి తెలియదు. ఒక్క ఉదయము, సాయంకాలము మాత్రం వారికి తెలుసు. రాత్రి మెలుకువ వచ్చినప్పుడు కాలమెంత అయినదీ వారికి తెలియదు.

పెద్దవాడు తనకోడి పుంజును ఆ ఊరి వారికి చూపి ఇలా అన్నాడు: "ఇదిగో ఈ జంతువును చూడండి. ఇది ఒక అద్భుతమైన గొప్ప జంతువు! దీనిఎఱ్ఱనిశిఖ ఎలాఉందో గమనించండి. ఇది ప్రతిరాత్రి నిర్ణీత కాలాలలో మూడు సార్లు అరుస్తుంది. మూడోసారి అరచినప్పుడు సూర్యుడు ఉదయించటానికి సిద్ధంగా ఉన్నాడన్నమాట. అంతేకాదు, ఇది ఒక్కొక్కప్పుడు పగలే అరుస్తుంది. వాతావరణంలో మార్పు రాబోతోందని ఆ అరుపు మనకో హెచ్చరిక." ఆ మాటలు విని ఆ ఊరిలోని వారందరూ ఎంతో సంతోషించారు. వారందరూ ఒక రాత్రి మెలకువగా ఉన్నారు. పెద్దవాడు చెప్పినట్లు కోడి ఆ రాత్రి రెండు గంటలకు, మూడు గంటలకు, ఆరుగంటలకు అరిచింది. జనులందరూ ఆ అద్భుతం చూచి ఆనందించారు.

"దీనిని మీరు అమ్ముతారా? అమ్మితే ఎంతకు అమ్ము తారు?" అని ఆ ఊళ్ళోని వారు పెద్దవానిని ప్రశ్నించారు." "గాడిద ఎంత బంగారం మోయగలదో అంత బంగారం ఇస్తే దీనిని ఇచ్చివేస్తాను." అని పెద్దవాడు అన్నాడు. అప్పుడు అందరూ ఏక కంఠంతో ఇలా అన్నారు. "అంత ఉపయోగ

కరమైన జంతువుకు మీారు కోరినది తగినధనమే." పెద్దవాడు కోడి పుంజును ఆ ఊరి వారికి ఇచ్చి వేసి తాను కోరినంత బంగారం తీసుకున్నాడు.

పెద్దవాడు బంగారంతో తనఇంటికి తిరిగి వచ్చాడు. అతని సంపదను చూచి మిగిలిన ఇద్దరూ ఆశ్చర్యపోయారు. అప్పుడు రెండవవాడు తన అన్నగారితో ఇలా అన్నారు. "నేను కూడా నీలాగనే ప్రపంచ యాత్రకు బయలుదేరి పోతాను. నా కొడవలి వలన కూడ కావలసినంత ధనం సంపాదిస్తాను." అతడలా అని ప్రపంచ యాత్రకు బయలుదేరాడు. అతడు ఎంతో దూరం ప్రయాణంచేశాడు. ఎచ్చటకు పోయినా కొడవలి పట్టిన రైతులే అతనికి కనబడసాగారు. అందుచేత అతనికేమీా లాభం లేకపోయింది. ఎట్టకేలకు అతని కష్టం ఫలించింది.

అదృష్టవశమున రెండవవాడు ఒకదీవి చేరుకున్నాడు. ఆ దీవిలోనివారికి కొడవలి అంటే ఏమిటో తెలియదు. పంటలు పండినప్పుడు వారు మొక్కలను సమూలంగా పీకి వేస్తున్నారు. అలా చేయటంలో వారికి చాలా నష్టంకూడా కలుగుతోంది. అంతేగాక అది చాలా కష్టమైన పనిగా ఉంది. రెండవవాడొకపంటపొలంలో ప్రవేశించి కొడవలితో కోయసాగాడు. అతడు అనతి కాలంలోనే పనిని పూర్తిచేశాడు. అచ్చటనున్నవారందరూ అది చూచి చాలాఆశ్చర్యపడ్డారు. అది అంతా వారికి గొప్పఅద్భుతంలా కనిపించింది. వారు రెండవవానితో ఇలా అన్నారు: "ఈ కొడవలిని

మీరు అమ్ముతారా? ఎంతకు అమ్ముతారు?" రెండవవాడు ఇలా జవాబిచ్చాడు. "ఒక గుర్రం మోయ గలిగినంత బంగారాన్ని గుర్రంతో బాటు ఇస్తే ఈ కొడవలిని ఇస్తాను." రైతులు అతనికోరిక తీర్చి కొడవలిని తీసుకున్నారు.

రెండవవాడు తన అదృష్టానికి ఎంతగానో సంతోషిస్తూ తిరిగి ఇంటికి పోయాడు. మూడవవానికి ఆ విషయం తెలిసింది. అతడు పిల్లిని తీసుకొని ప్రపంచయాత్రకు బయలు దేరాడు. మొదట అతనికేమీ లాభించలేదు. ఎక్కడకు పోయినా వేలకొలది పిల్లులు కనబడసాగాయి. అంత మాత్రాన నిరాశ చెందక మూడోవాడు ఇంకా ప్రయాణం సాగిస్తూనే యున్నాడు.

ఎట్టకేలకు మూడవవానిని అదృష్టదేవత వరించింది. అతడొక ద్వీపం చేరుకున్నాడు. ఆ దీవిలోని వారివెవరూ కెన్నడూ పిల్లినిచూచి ఎరుగరు. ఆ దీవిలో ఎలుకలు అపరిమితంగా ఉన్నాయి. అవి తమ ఇష్టంవచ్చినట్లు ఇండ్లలో సంచరిస్తున్నాయి. అచటివారు చేసేదేమీలేక నిస్సహాయులై విచారిస్తున్నారు. వారికి ఏమీ తోచటంలేదు. మూడవ వానిపిల్లి ఎలుకలను చూడగానే పైబడి కొద్ది నిమిషాల్లోకొన్ని వందల ఎలుకలను చంపివేసింది. కొందరు జనులా అద్భుత విశేషం చూశారు. వెంటనే వారు రాజువద్దకుపోయి తాము చూచిన విషయాన్ని వివరించి చెప్పారు. ఆ వింత మృగమును ఎంత ధరకైనాకొని తమ్ము రక్షింపవలసిందని ప్రార్థించారు. రాజభవనం కూడా ఎలుకలమయమై ఉంది. రాజు కూడా ఎలుకలబాధను సహించలేని స్థితిలోనున్నాడు. అందు

చేత అతడు వెంటనే మూడవవానిని పిలిపించి, "నీవద్దనున్న వింత మృగాన్ని అమ్ముతావా? ఎంతకు అమ్ముతావు?" అని ప్రశ్నించాడు. అపుడు మూడవవాడు ఇలా అన్నాడు. "ఇది ఒక అద్భుత మృగం. దీనిని నేను అమ్మదలచుకో లేదు. కాని మీవంటివారు తడిగారు కనుక అమ్ముతాను. ఒక కంచర గాడిద మోయగలిగినంత బంగారాన్ని కంచర గాడిదతో పాటు నాకిస్తే ఈ వింతమృగాన్ని మీకివ్వటానికి నాకు ఎటు వంటి అభ్యంతరమూ లేదు." అప్పుడు రాజు అతనికి కోరినంత ధనం ఇచ్చాడు. అతడు దానిని తీసుకొని ఇంటికి తిరిగి పోయాడు.

కొంతసేపు గడిచేటప్పటికి పిల్లి రాజభవనంలోని ఎలు కల నన్నిటిని చంపి తినివేసింది. ఎట్టకేలకది బాగుగా అలసి పోయి ఒకచోటకూర్చుండి, మ్యావ్! మ్యావ్!" అని అరవ సాగింది. రాజుకా అఱపు వింతగా తోచింది. అందుచేత అతడు వెంటనే తన ప్రజలనందఱను సమావేశ పఱచాడు. వారు ఆపిల్లి అఱుపునువిని భయపడి పాఱిపోయారు. అంతట రాజు తన సలహాదారులను వేఱొకచోట సమావేశపఱ చాడు. వారందఱూ ఆ వింత మృగమును ఏమి చేయాలిఅను విషయమునుగూర్చి దీర్ఘముగా ఆలోచింపసాగారు. ఎట్టకే లకు వారొక నిర్ణయానికి వచ్చారు. ఆ మృగము వద్దకు ఒక రాయబారి పోవాలి. అతడా మృగముతో యిలాచెప్పాలి! "ఓ మృగమా! నీవు వెంటనే మాయీ రాజభవనమును వీడిపో. లేకపోతే మేము బలప్రయోగంచేసి నిన్ను వెళ్ళగొట్ట వలసిన అవసరం ఏర్పడుతుంది." సలహాదారులు ఎలుకల

బాధను పడవచ్చునుగాని, కొత్త మృగముచే చంపబడుట మంచిది కాదని భావించారు. వారి తీర్మానం ప్రకారం ఒక రాయబారి పిల్లివద్దకుపోయి ఇలా అన్నాడు: "ఓ మృగమా! నీవు వెంటనే ఈ రాజభవనమును వీడిపొమ్ము. లేకపోతే మేము నిన్ను బలాత్కారంగా బయటకు వెళ్ళగొట్టవలసి వస్తుంది." రాయబారి మాటలు పిల్లికి అర్థంకాలేదు. అది ఎప్పటివలె "మ్యావ్! మ్యావ్!" అని అఱవసాగింది. "నేను పోను" అని ఆ మృగం అంటోందని ఆ రాయబారి భావించాడు. అతడా విషయమును రాజుకు తెలిపాడు. రాజా విషయమును తన సలహాదారులకు చెప్పాడు. అపుడా సలహాదారులు రాజుతో ఇలా అన్నారు: 'అయినచో మనం బల ప్రయోగం చేయవలసిందే." రాజు అందుకు తగినవర్పాట్లు చేశాడు. రాజభవనముపైకి నలుమూలలనుండి తుపాకులు పేల్చారు. పిల్లియున్న గదిలోకి ఈ సవ్వడి వినబడ సాగింది పిల్లి ఎవ్వరును చూడని సమయాన రాజభవనమును వీడిపోయింది. ఈవిషయమును గమనింపని రాజభటులింకను రాజభవనముపైకి తుపాకులు ప్రేల్చుచునేయుండిరి. కొంతకాలం అయ్యేసరికి ఆ రాజభవనం నేలగూలింది.

# పాటగాడు

ఒక ఊళ్ళో ఒక పాటగాడున్నాడు. అతనికి ఇతరులను ఎగతాళి చెయ్యటంఅంటే ఎంతో ఇష్టం. అతడొక రోజున అడవిలో ఆనందంగా తిరుగుతున్నాడు: అప్పుడతడు ఇలా అనుకున్నాడు: నాకు కాలం సరిగా గడవటం లేదు. నాతో మాట్లాడటానికి ఎవరైనా ఉంటే బాగుండును." అందువలన అతడు ఫిడేలు తీసుకుని అడవిఅంతా మార్మోగేటట్లు వాయింప సాగేడు.

అంతలో అతని వద్దకు ఒక తోడేలు రాసాగింది. "నన్ను చూడటానికి ఒక తోడేలు వస్తోంది" అని పాటగాడు అనుకున్నాడు. తోడేలు ఆతనిని సమీపించి "ఓహో! నువ్వెంత శ్రావ్యంగా వాయిస్తున్నావు? నాకు నీ వద్దసంగీత విద్య నేర్చుకోవాలని ఉంది" అని అంది. "అవును నువ్వు సులభంగా నా వద్ద ఆ విద్య నేర్చుకోవచ్చును. నీవుమాత్రం నేను చెప్పినట్లు చేస్తుండాలి" అని అతడు అన్నాడు. "అవును నేనుకూడా గొప్ప పాటగాడనవుతాను"! అని తోడేలుఅంది. పాటగాడు తోడేలుతో కలసి మరికొంతదూరం పోయాడు. అచ్చట బోలుగానున్న వృక్షం ఒకటిఉంది—ఆ చెట్టుబోదెలో ఒక పెద్ద పగులు ఉంది. అపుడు పాటగాడు తోడేలుతో యిలా అన్నాడు: "ఇటు చూడు నీకు సంగీతం నేర్చుకోవా

లని ఉంటే నీ ముందు కాళ్ళను ఈ పగులులో పెట్టు" తోడేలు అతడు చెప్పినట్లే చేసింది. అప్పుడతడు ఒక పెద్ద రాయిని తీసుకువచ్చి దాని కాళ్ళమీద పెట్టాడు. తోడేలు కాళ్ళు ఆ పగులులో బంధింపబడ్డాయి. "నేను తిరిగి వచ్చే వరకు నువ్వు ఇక్కడనే ఉండు" అని చెప్పి పాటగాడు తన దారిని తాను పోయాడు.

కొంతకాలం గడిచిన తర్వాత పాటగాడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "కాలం సరిగా గడవటంలేదు-నాకొక సహచరుడు దొరికితే బాగుంటుంది" అతడావిధంగా అనుకుని ఫిడేలు వాయించసాగాడు. అంతలో అతనివద్దకు ఒక నక్క వచ్చింది. ఆ నక్క అతనితో ఇలా అంది: "ఓ సంగీతవిద్వాంసుడా! నీవు మధురాతి మధురంగా పాడుతున్నావు, నాకు కూడా ఆ విద్యను నేర్చుకోవాలని చాలా కుతూహలంగా ఉంది." "అది ఏమంత కష్టమయిన పనికాదు-నే చెప్పినట్లు నువ్వు నడుచుకుంటే నీకా విద్య సులభంగా వస్తుంది" అని పాటగాడు అన్నాడు. నక్క అలా చేయటానికి అంగీకరించింది తర్వాత ఆ పాటగాడు నక్కతో కలసి ఒక సన్నని దారినిబడి ముందుకు సాగిపోయాడు. ఆ దారికి రెండువైపులా పొదలున్నాయి. ఒకచోట అతడొక ముళ్ళపొదను బాటపైకి వంచి దానిపై పాదం పెట్టి గట్టిగా అణచిపెట్టాడు. రెండవవైపున ఉన్న పొదనుగూడా బాటపైకి వంచి నక్కతో ఇలా అన్నాడు: "ఓ అందమైన నక్కా! నీవు ఫిడేలు వాయించటం నేర్చుకోవాలనుకుంటే నీ ఎడమపాదం నాకు అందియ్యి". నక్క తన ఎడమపాదం అతనికి అందిచ్చింది. అతడా పాదాన్ని

పొదకు గట్టిగా కట్టివేశాడు. "ఇక నీ కుడిపాదాన్ని యిలా అందియ్యి" అని అతడు అన్నాడు. "నక్క తన కుడిపాద మును అతనికి అందిచ్చింది.

అప్పుడతడా పాదమును రెండవవైపున నున్నపొదకు కట్టివేశాడు. తర్వాత అతడా పొదపైనుండి తన పాదం తీసి వేశాడు. అప్పుడా పాదాలు రెండు పైకి లేచాయి. నక్క ఆ పాదాల పైనుండి క్రిందకు వ్రేలాడసాగింది. ఇటు నటుఊగు తుందికూడా.

"నేను తిరిగి వచ్చేవరకు నీవు ఇక్కడనే ఉండు" అని పాటగాడు తన దారిని వెళ్ళిపోయాడు.

కొంతకాలం గడిచిన తరువాత పాటగాడు ఇలా అను కున్నాడు: కాలం సరిగా గడవటంలేదు-నాకెవరయినా సహ చరుడు లభిస్తే ఎంత బాగుంటుంది!" అప్పుడతడు ఫిడేలును అద్భుతంగా వాయింపసాగాడు. అంతలో అచ్చటి కొక కుందేలు వచ్చింది. "మీరు ఎంతో మనోహరంగా ఫిడేలు వాయిస్తున్నారు. మీ వద్ద సంగీతం నేర్చుకోవాలనే కోరిక నాకు గాఢంగాఉంది" అని ఆ కుందేలు పాటగానితో అంది. "నీకు తప్పకుండా సంగీతం నేర్పుతాను-నీవు మాత్రం నా ఆజ్ఞప్రకారం నడచుకోవాలి" అని పాటగాడనగా కుందేలు అందుకు అంగీకరించింది. పాటగాడు కుందేలుతో కలసి ముందుకు పోయి ఒక ఖాళీ ప్రదేశం చేరుకున్నాడు. అచ్చట పాటగాడు ఒక త్రాటిని కుందేలు మెడకు కట్టి, ఒక త్రాటి కొనను చెట్టుకు కట్టివేశాడు. "ఇపుడు నీవు గెంతుకుంటూ చెట్టుచుట్టూ ఇరవైసార్లు పరుగెత్తు" అని అతడు కుందేలుతో

అన్నాడు. తెలివితక్కువ కుందేలుఅతడు చెప్పినట్లు చేసింది. కుందేలు చెట్టుచుట్టూ ఇరవై సార్లు తిరగటంవలన త్రాడి చెట్టు చుట్టూ ఇరవైసార్లు చుట్టుకుంది. అలా కుందేలుచెట్టుకు బంధింపబడింది. అది త్రాడును గట్టిగా లాగిన కొలది మెడకు ఉరి ఎక్కువయింది. "నేను తిరిగి వచ్చేవరకు ఇక్కడనే ఉండు" అని చెప్పి పాటగాడు తన దారిన వెళ్ళిపోయాడు.

చెట్టు పగులులో బంధింపబడిన తోడేలు, చాలా కష్టపడి స్వేచ్ఛను సంపాదించుకుంది. అప్పుడది మిగుల కోపంతో ఇలా అంది: "నేనా దుర్మార్గుడగు పాటగాని వెంటపడి అతనిని ముక్కలు ముక్కలుగా చీల్చివేస్తాను" తోడేలు పాటగానిని వెతుక్కుంటూ పరుగెత్తసాగింది. అపుడు నక్క దానిని చూచి: "ఓ మిత్రమా! నన్ను రక్షించు. ఆ బుద్ధి మాలిన పాటగాడు నన్నీస్థితికి తీసుకువచ్చాడు" అని అంది. అంత తోడేలు నక్కవద్దకు వెళ్ళి కట్లను తెగగొరికి దానికి స్వేచ్ఛను ప్రసాదించింది: తరువాత ఆ రెండూ కలసి పాట గానికోసం పరుగెత్త సాగాయి. త్రోవలో వాటికి కుందేలు కనబడింది. అపుడవి దానికికూడా స్వేచ్ఛను ప్రసాదించాయి. మూడుజంతువులూ కలసి శత్రువును పట్టుకోటానికి పోసా గాయి.

ఈ లోపల పాటగాడు ఫిడేలు వాయిస్తున్నాడు. అతనికి మరియొక సహచరుడు లభించాడు. కట్టెలు కొట్టుకొనువాడొకడు పాటగాని సంగీతానికి ముగ్ధుడై అతనిని వెంబడించాడు తన కొక మానవుడు సహచరుడుగా, లభించినందుకు పాట గాడు ఎంతో సంతోషించాడు. అతడు తన సహచరునికి

ఎటువంటి ప్రయోగం చేయలేదు. కమ్మగా పిడేలు వాయించాడు. కట్టెలు కొట్టుకొనువాడు ఎంతో సంతోషించాడు. అతడు నిలబడి సంగీతం వింటూనే వున్నాడు. అంతలో నతడు పాటగానివద్దకు వస్తున్న తోడేలును, నక్కను, కుందేలును చూచాడు. వాటి ముఖములను బట్టి అవి చాలా కోపంతో ఉన్నాయనే విషయం గ్రహించాడు. అవి పాటగానికి హాని చేయటానికి వస్తున్నాయనే విషయంకూడా గ్రహించాడు. వెంటనే అతడు తన గొడ్డలిని భుజముమీద పెట్టుకొని పాటగాని ముందు నిలబడ్డాడు. "నేను ఈ గొడ్డలితో ఇచ్చట ఉన్నంతకాలం ఈ పాటగానికెవరూ హాని చేయకూడదు" అని హెచ్చరిక చేస్తున్నట్లు అతడు నిలబడి యున్నాడు. మూడు మృగాలూ పరిస్థితిని గ్రహించాయి. అవి అపరిమితంగా భయపడి వెనుకకు తిరిగి కాళ్ళకు బుద్ధిచెప్పాయి. అంతట పాటగాడు ఎంతో సంతోషించి ఫిడేలుపై ఒక చక్కని గీతం వాయించాడు. కట్టెలు కొట్టుకొనువాడు ఆనంద సాగరంలో మునిగిపోయాడు. తరువాత ఎవరి దారిని వారు వెళ్ళిపోయారు.

# భార్య తెలివితేటలు

ఒక గ్రామంలో ఒక యువకుడు నివసిస్తున్నాడు. అతని పేరు ఫ్రెడరిక్. అతడు ఒక యువతిని వివాహం చేసుకున్నాడు: ఆ యువతిపేరు కేథరెన్. వివాహమయిన తరువాత కొంతకాలం జరిగిపోయింది. ఒకనాడు భర్త భార్యతో యిలా అన్నాడు. "సతీమణీ, నేను పొలంలో పనిచేయటానికి వెడుతున్నాను. నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి నాకు బాగా ఆకలిగా వుంటుంది. కనుక నీవు అప్పటికి ఏదయినా చక్కని పదార్థం తయారుచేసి వుంచు. ఏపిల్ పానీయం కూడా సిద్ధంచేసి వుంచు." అప్పుడతని భార్య ఇలా అంది. "అలాగే చేస్తాను. "చక్కని పదార్థం తయారుచేసి వుంచుతాను."

తరువాత కేథరిన్ ఇంట్లో వున్న మాంసపు ముక్క తీసుకుని బూరెలమూకుడులో పెట్టి వేయింపసాగింది. ఆ మాంసపు ముక్కను ఒక విధమయిన రంగువచ్చిన తరువాత ఆమె యిలా అనుకుంది. "మాంసపు ముక్క తయారయింది. ఇక ఏపిల్ పానీయం తీసుకు వస్తాను." అంతట ఆ పానీయం వున్న పీపా వద్దకు వెళ్ళి దాని మర త్రిప్పి ఒక పాత్రను ఆ పానీయంతో నింపసాగింది.అంతలో ఆమె మనసు కొక ఆలోచన తట్టింది, "కుక్కను గొలుసుతో కట్టివేయలేదు, అందుచేత అది మాంసపు ముక్కను తీసుకుపోవచ్చు"

# భార్య తెలివితేటలు

ఒక గ్రామంలో ఒక యువకుడు నివసిస్తున్నాడు. అతని పేరు ఫ్రెడరిక్. అతడు ఒక యువతిని వివాహం చేసుకున్నాడు: ఆ యువతి పేరు కేథరిన్. వివాహమయిన తరువాత కొంతకాలం జరిగిపోయింది. ఒకనాడు భర్త భార్యతో యిలా అన్నాడు. "సతీమణీ, నేను పొలంలో పనిచేయటానికి వెడుతున్నాను. నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి నాకు బాగా ఆకలిగా వుంటుంది. కనుక నీవు అప్పటికి ఏదయినా చక్కని పదార్థం తయారుచేసి వుంచు. ఏపిల్ పానీయం కూడా సిద్ధంచేసి వుంచు." అప్పుడతని భార్య ఇలా అంది. "అలాగే చేస్తాను. "చక్కని పదార్థం తయారుచేసి వుంచుతాను."

తరువాత కేథరిన్ ఇంట్లో వున్న మాంసపు ముక్క తీసుకుని బూరెలమూకుడులో పెట్టి వేయింపసాగింది. ఆ మాంసపు ముక్కను ఒక విధమయిన రంగువచ్చిన తరువాత ఆమె యిలా అనుకుంది. "మాంసపు ముక్క తయారయింది. ఇక ఏపిల్ పానీయం తీసుకు వస్తాను." అంతట ఆ పానీయం వున్న పీపా వద్దకు వెళ్ళి దాని మర త్రిప్పి ఒక పాత్రను ఆ పానీయంతో నింపసాగింది. అంతలో ఆమె మనసు కొక ఆలోచన తట్టింది, "కుక్కను గొలుసుతో కట్టివేయలేదు, అందుచేత అది మాంసపు ముక్కను తీసుకుపోవచ్చు"

మీాద పెట్టింది. అంతట నా పాత్ర బోర్ల గిల పడింది. లోపల వున్న ఏపిల్ పానీయమంతా నేలపాలయింది, తరువాత ఆమె పిండిని తడిగా వున్న చోటల్లా చల్లింది. "ఇప్పుడంతా పరిశుభ్రంగా వుంది. నేను యెంత తెలివయినదానను." అని ఆమె అనుకుంది.

మధ్యాహ్నమైన తరువాత ఫ్రెడరిక్ ఇంటికివచ్చాడు "భోజనానికి ఏ యే పదార్థాలు సిద్ధం చేశావు?" అని అతను భార్యను అడిగాడు. అప్పుడు భార్య ఇలా సమాధానం ఇచ్చింది: "నేను మీాకోసం మాంసం వండాను, కాని నేను ఏపిల్ పానీయం తీసుకు రావటానికి వెళ్ళినప్పుడు కుక్క మాంసం దొంగిలించుకు పోయింది. మనం ఇదివరకు కొన్న పిండితో పానీయం కనబడకుండా చేయాలను కున్నాను. అప్పుడు పాత్రలో ఉన్న పానీయంకూడా నేలపాలైంది. కాని ఇప్పుడిచ్చట అంతా పరిశుభ్రంగా వుంది." అప్పుడు భర్త యిలా అన్నాడు: "ఇవన్నీ ఎందుకు చేశావు? ఎవరు చేయ మన్నారు? అన్నీ పాడు పనులే. తెలివితక్కువగా ప్రవర్తించి అన్ని వస్తువులూ నష్టపరచావు." అప్పుడు భార్యఇలా సమాధానమిచ్చింది: "తప్పు చేస్తున్నానని నాకు తెలియదాయెను; నీవైనా ఆ విషయం నాకు చెప్పియుండలేదు."

భార్య మాటలు విన్న భర్త తనలో తాను యిలా అనుకున్నాడు: "నా భార్య అన్నీ పాడు పనులే చేస్తోంది. నేనింక చాలా జాగ్రత్తగా వుండాలి." అతను దగ్గరచాలా

బంగారం ఉంది. అందుచేత అతడు భార్యతో ఇలా అన్నాడు: "ఈ పచ్చని గుండీలు ఎంత అందంగా ఉన్నాయి! నేను వీటినన్నిటిని ఒక పెట్టెలో పెట్టి తోటలో పాతిపెడ్తాను. కాని నీవచ్చటకు ఎన్నడూ వెళ్ళవద్దు. దానినిముట్టుకోవద్దు." "నేను అటువంటిపని ఎప్పుడూ చేయనని వాగ్దానం చేస్తున్నాను" అని కేథరిన్ భర్తకు చెప్పింది.

ఫ్రెడరిక్ ఇంటినుండి బయటకు వెళ్ళాడు. కొంతసేపైన తరువాత కుండలు, పళ్ళెములు మున్నగు సామానులు అమ్మే వర్తకులు వచ్చి, "మీకు ఏమైనా కావాలా?" అని కేథరిన్‌ను ప్రశ్నించారు. ఆమె వారితో ఇలా అంది: "నేను అటువంటి వస్తువులు చాలాకొనదలచుకున్నాను. కాని ప్రస్తుతం నావద్ద డబ్బేమీ లేదు: మా యింటిలో పచ్చ గుండీలు మాత్రం ఉన్నాయి. వానిని తీసుకోటానికి మీరు అంగీకరిస్తే మీ వస్తువులు కొంటానికి నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు." అపుడా వర్తకులు ఇలా అన్నారు:"పచ్చగుండీలా! వానిని మాకు చూపెట్టండి." అపుడామె ఇలా అంది: మీరుతోటలోకివెళ్ళి ఎత్తుగానున్న ప్రదేశంవద్ద త్రవ్వండి. అక్కడ మీకు పచ్చగుండీలు లభిస్తాయి. నేనుమీతో రావటానికి వీలులేదు." వర్తకులు తోటలోకి వెళ్ళి ఎత్తుగాఉన్న ప్రదేశం త్రవ్వారు. అక్కడ వారికిబంగారం లభించించింది. పచ్చగుండీలంటే ఏమిటో వారికి అర్థమయింది. వారు బంగారం తీసుకుని తమ దారిని వెళ్ళిపోయారు. తమ దగ్గరనున్న

వస్తువులను మాత్రం ఆ ఇంటిలో వదిలివేశారు. ఆమె వాటిని అంవరకూ చూపెట్టటానికి వరుసగా పెట్ట సాగింది. అంతలో భర్త ఇంటికి వచ్చి, "లోపల ఏంచేస్తున్నావు?" అని భార్యను ప్రశ్నించాడు.

భార్య వర్తకులు వదలిపోయిన వస్తువులను భర్తకు చూపి ఇలా అంది: "నేను ఈ వస్తువులన్నిటిని పచ్చగుండీలకు కొన్నాను. అయితే నేను ఆ పచ్చగుండీలను ముట్టుకో లేదు. వర్తకులే ఆ గుండీలను త్రవ్వుకొని పోయినారు." ఆ మాటలను వినగానే భర్త ఇలా అన్నాడు: "అయ్యో! అయ్యో! ఎంతపని చేశావు? పచ్చగుండీలు ఏమిటనుకున్నావు! అంతా బంగారం! అది అంతా నా సంపద! ఇపుడు సర్వ నాశనం జరిగింది!" "నేను చేస్తున్న పనిలో ఏమీ నష్టం లేదని భావించాను. నీవా విషయాన్ని ముందుగానే నాకు చెప్పియుండవలసింది!" అని భార్య సమర్థించుకుంది.

కొంతసేపు ఆలోచించిన తరువాత కేథరిన్ మళ్ళీ భర్తతో ఇలా అంది: "ఇప్పటికైనా మనకు వచ్చిన నష్టం ఏమీ లేదని తలుస్తున్నాను. మనము తిరిగి ఆ బంగారమును సంపాదింప వచ్చును. మనం ఇప్పుడే ఆ దొంగలను వెంబడిద్దాం." "నీ ఆలోచన బాగానే ఉంది. అలాగే ప్రయత్నించి చూద్దాం. కాని నీతో కొంచెం వెన్న. మీగడ తీసుకురా. త్రోవలో వాటిని భుజింపవచ్చు" అని అన్నాడు.

"అలాగే చేస్తాను" అని భార్య అంది. కొన్ని నిముష ములు గడచినతరువాత వారిద్దరూ ప్రయాణం సాగించారు. ఫ్రెడరిక్ వేగంగా వడవసాగాడు; అందుచేత భార్య వెనుక బడి పోయింది. "ఇందువలన వచ్చిన నష్టం ఏమీ లేదు. ఇంటికి తిరిగి బయలు దేరినపుడు నేను ఇంటికి దగ్గరగా ఉంటాను." అని భార్య తనలో తాను అనుకుంది.

కొంత తడవయిన పిదప భార్య ఒకఎత్తయిన ప్రదేశం పైకి వచ్చింది. ఆ ప్రదేశముపై ఒక సన్నని బాట ఉంది. ఆ బాటమీద బండ్లు ప్రయాణము చేయుట వలన మొక్కలు కొన్ని పాడైపోయి ఉన్నాయి. అయ్యో!"పాడు బండ్లు ఈ మొక్కలను నిష్కారణంగా గాయపరచాయి. నేను వీటిని బాగు చెయ్యాలి" అని ఆమె అనుకుంది. ఇక ముందు బండ్ల రాపిడి వలన మొక్కలకు అపాయం కలుగదను తలం పుతో ఆమె తనవద్ద నున్న వెన్నను వానికి పేసింది. ఆమె ఆపని చేస్తుండగా బుట్టలోని మీగడ కొంత క్రిందపడి దొర్లు కుంటూ పోయింది. ఎక్కడకు పోయిందా అని ఆమె చూచింది కాని కనిపించ లేదు. అపుడామె ఇలా అనుకుంది: "నేనింక మిగిలియున్న మీగడను కూడా క్రింద పడ వేస్తాను. అప్పుడది దొర్లుకుంటూ మొదట పడిన మీగడ వద్దకు చేరు తుంది. అప్పుడు నేను మీగడ నంతనూ తిరిగి తెచ్చుకో వచ్చును." ఆమె అలా అనుకుని బుట్టలో నున్న మీగడను కూడా వదిలి వేసింది. అది దొర్లు కుంటూ పోయింది. కాని

ఎక్కడకు పోయిందో ఆమెకు కనిపించలేదు. అప్పుడామె ఇలా అనుకుంది. "మీగడ కోసం నేనిక్కడ రోజంతా అగ వలసిన పనిలేదు. మీగడకు నేను పోయే దారి తెలుసను కుంటాను. అది తనయిష్టం వచ్చినప్పుడు నాదగ్గరకు వస్తుంది." తరువాత ఆమె ముందుకు సాగిపోయింది.

కొంతసేపు గడిచిచిన తరువాత కేథరిన్ పోయి భర్తను కలుసుకుంది. "తింటానికి ఏమైనా ఇయ్యి" అని భర్త భార్యను అడిగాడు. భార్య భర్తకు రొట్టెముక్క మాత్రమే ఇచ్చింది. "వెన్న, మీగడ ఏమయ్యాయి?" అని ఫ్రెడరిక్ ప్రశ్నింపగా కేథరిన్ ఇలా సమాధానం ఇచ్చింది: "పాపం, బండ్లు బాటకు రెండు వైపులా ఉన్న మొక్కలను గాయ పరచాయి. అందువల్ల నేను జాలిపడి వాటికి వెన్నపూసాను. కొంత మీగడ క్రిందపడి ఎక్కడికో పోయింది. దానిని కను క్కోటానికి నేను మిగిలిన మీగడను కూడా క్రింద పడ వేశాను. ఈ పాటికి మీగడ అంతా మనలను వెతుక్కుంటూ వస్తోందని తలుస్తాను." "నీవు వట్టి తెలివి తక్కువ దానవు! నీ వలన ఏమీ లాభంలేదు!" అని ఫ్రెడరిక్ అన్నాడు. "ఇటువంటి మాటలు మాట్లాడటానికి నీకు నోరెక్కడనుండి వస్తోంది? నేనిటువంటి పనులు చేయరాదని నీవెన్నడూ నాకు చెప్పియుండలేదు" అని భార్య అంది.

తరువాత ఇద్దరూ రొట్టె తిన్నారు. అప్పుడు ఫ్రెడరిక్ భార్యతో ఇలా అన్నాడు: "నీవు బయలుదేరినప్పుడు ఇంటి తలుపుకు సరిగా తాళం వేసి వచ్చావా?" "లేదు. నీవా సంగతి నాకు చెప్పలేదు" అని భార్య అంది. అంతట ఫ్రెడ

రిక్ ఇలా అన్నాడు: "నీవిప్పుడైనా ఇంటికిపోయి తలుపుకు సరిగ్గా తాళంవేసిరా, తిరిగి వచ్చేటప్పుడు తింటానికి ఏమైనా తీసుకురా."

కేథరిక్ భర్త చెప్పినట్లు చేయటానికి ఇంటికి పోతున్నప్పుడు త్రోవలో ఇలా అనుకుంది: "నా భర్త ఏమైనా తినాలని అనుకుంటున్నాడు. అతనికి వెన్న, మీగడ అంటే అంతగా ఇష్టంలేదనుకుంటాను." నేను అతనికి ఇంకేవైనా ఆహారపదార్థాలు తీసుకువస్తాను." ఎట్టకేలకు ఆమె గృహం చేరుకుంది. లోనికిపోయి దొడ్డి తలుపును గట్టిగా బంధించి కాని వీధి తలుపును బయటకు తీసి ఇలా అనుకుంది: "నాభర్త వీధి తలుపుకు సరిగా తాళం వేయవలసిందని కోరాడు. కనుక నేను తలుపును సురక్షితంగా అతని వద్దకే తీసుకుపోతాను." ఆమె కొన్ని కాయలను, వినీగరు పానీయమును, తలుపును తీసుకొని భర్త వద్దకు బయలుదేరింది.

కేథరిన్ ఫ్రెడరిక్ వద్దకుపోయి ఇలా అరిచింది: "ఫ్రెడరిక్! నేను తలుపునే ఇక్కడకు తీసుకు వచ్చాను, ఇక నీవు దానిని నీ యిష్టం వచ్చినట్లు సురక్షితంగా చూసుకోవచ్చును." ఆ మాటలను విన్న భర్త ఇలా అన్నాడు: "అయ్యో! నీవెంత తెలివిగల భార్యవు! నేను నిన్ను తలుపును గట్టిగా బంధించుమని పంపాను. నీవు తలుపునే తీసుకొని వచ్చావు! ఇప్పుడు మన ఇంటిలోనికందరూ ఎటువంటి అడ్డులేక తమ చిత్తం వచ్చినట్లు పోవచ్చును. అయినా నీవు చాలా కష్టపడి తలుపును తీసుకొని వచ్చావు కనుక ఇక దానిని నీ వద్దనే ఉంచుకొని మోస్తూ ఉండు." అపుడు భార్య

ఇలా అంది: "నేను నీవు చెప్పినట్లు చేస్తాను. తలుపు మోయ టానికి నాకు ఎటువంటి అభ్యంతరము లేదు. కాని కాయలను, వినీగరును నేను మోయను. వానిని కూడా మోయాలంటే నాకు చాలా బరువు అవుతుంది. నీకు అభ్యంతరం లేకపోతే నేను వాటిని తలుపుకు కట్టివేస్తాను."

"నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి" అని అన్నాడు ఫ్రెడ రిక్ తరువాత వారిద్దరు బయలుదేరి ముందుకు పోసాగారు. వారు అడవిలోకి కూడ వెళ్ళారు. ఎంత దూరం పోయినా వారికి దొంగలు కనిపించలేదు. అంతలో చీకటి పడింది. అప్పుడు భార్యా భర్త లిద్దరూ ఒక చెట్టుపైకి ఎక్కారు. అదే సమయమునకు వారి బంగారం దొంగిలించిన దొంగ వర్తకులు కూడ ఆ చెట్టు క్రిందకే వచ్చారు. ఆ దొంగలు బాగా అలసి ఉన్నారు. వారా చెట్టు కింద మంటవేసి చుట్టూ కూర్చున్నారు. అప్పుడు భర్త మెల్లగా క్రిందకుదిగి కొన్ని తాళ్ళు ప్రోగు చేసుకొని దొంగలకు కనిపించకుండా తిరిగి పైకి ఎక్కాడు. తరువాత ఒక్కొక్కరాయిని దొంగల తలలపై పడవేయసాగాడు. గాలికి చెట్టు పండ్లు తమమీద పడుతున్నాయని దొంగలు భావించసాగారు.

అంతవరకు తలుపును మోస్తున్న భార్య బాగా అలసిపోయింది. తలుపుకు కట్టబడిన కాయలు ఎంతో భారంగా ఉన్నాయని తలచి కేథరిన్ తన భర్తతో మెల్లగా ఇలా అంది: "ఫ్రెడరిక్! కాయలు చాలా భారంగా ఉన్నాయి. నేను వాటిని క్రిందకు వదిలివేస్తాను." అప్పుడు ఫ్రెడరిక్ ఇలా అన్నాడు. "వద్దు. వద్దు. మనం ఇక్కడ

ఉన్న విషయం దొంగలకు తెలుస్తుంది.” అంతట బాగా అలసిపోయిన భార్య, “అందుకు నేనేమిస్తాను? నేను కాయలను క్రిందికి వదిలి వేసింది. అవి దొంగలపై పడ్డాయి. అప్పుడొక దొంగ ఇలా అన్నాడు. “వడగళ్ళు పడుతున్నాయి.”

కొంత తడపైన పిదప తలుపు ఇంకను భారంగా ఉందని భార్య తలచింది. అందుకు వినీగరే కారణమని ఆమె భావించింది. అపుడామె భర్తతో ఇలా అంది. “తలుపు ఇంకా భారంగా ఉంది. వినీగరును క్రిందకుపోస్తాను.” “వలదు వలదు. అందువలన మనం ఇక్కడ ఉన్న సంగతి దొంగలకు తెలుస్తుంది” అని భర్త అన్నాడు. “నేను అందుకు బాధ్యురాలను కాను. నేను నా బరువును తగ్గించుకోక తప్పదు” అని కేథరిన్ చెప్పి, వినీగరును క్రిందకు పోసింది. అప్పుడు దొంగలు ఇలా అనుకున్నారు. “మంచు బాగా కురుస్తోంది.”

కొంతకాలం గడిచింది. భారమంతా తలుపు వలననే అనే అభిప్రాయం కేథరిన్‌కు కలిగింది. అందు వలన ఆమె మెల్లన భర్తతో ఇలా అంది. “ఫ్రెడరిక్ తలుపే బరువుగా ఉందని నేను ఇప్పుడు గ్రహించినాను. తలుపును క్రిందకు జారవిడుస్తాను.” “నీవు ఎంత మాత్రం అలా చేయకూడదు. మనం ఇక్కడ ఉన్న సంగతి దొంగలకిపుడు తప్పకుండా తెలుస్తుంది. మన ప్రాణాలకే మోసం వస్తుంది. నా మాట విను, నీకు పుణ్యముంటుంది” అని భర్త భార్యను దీనంగా ప్రార్థించాడు. “నేనింక తలుపును మోయలేను” అని యని కేథలిన్ తలుపును క్రిందకు జారవిడిచింది. తలుపు పెద్దచప్పుడుతో ఆ దొంగలమీద పడింది. “హత్య! హత్య!” అని

దొంగలు గట్టిగా అరిచారు. వారింక ఇతర విషయాలు ఆలోచించక తమ శక్తి కొలది ఆ ప్రదేశంనుంచి పరుగెత్తుకు పోయారు. వారు తమ వద్దనున్న బంగారమును ఆ చెట్టు క్రిందనే విడిచి పోయారు. వారిక అచ్చటకు తిరిగి రాలేదు. కడకు కేథరిన్ తాను తెలివిగలదానినని నిరూపించుకుంది. భార్యా భర్త లిరువురూ క్రిందకు దిగివచ్చారు. అచ్చటవారి పోయిన బంగారం సురక్షితంగా ఉంది. వారు దానిని తీసుకుని ఇంటికి పోయి సుఖంగా జీవిస్తున్నారు.

# మూఢు ఫలకాలు

ఒకనాడు ఇద్దరు రాజకుమారులు తమ అదృష్టం పరీక్షించుకోటానికి ప్రయాణమై వెళ్ళారు. కాని వారు కొద్ది కాలంలోనే ఎన్నో చురలవాట్లకు లోనయ్యారు. అంచేత వారు ఇంటికి తిరిగి రాలేదు. వారి తమ్ముడు ఒక మరుగుజ్జు అతడు అన్నలను వెదకటానికి బయలుదేరాడు. కొంత కాలానికి అతడు వారిని కలుసుకున్నాడు. అప్పుడు వారు నవ్వి అతనితో ఇలా అన్నారు: "మేమే ఈ ప్రపంచంలో ఎందుకూ పనికిరాకుండా పోతున్నాం-అటువంటప్పుడు నువ్వు కూడా ప్రయాణమై రావటం చాలా చోద్యంగాను, హాస్యాస్పదంగాను ఉంది" అయినా వారు ముగ్గురూ కలిసి ప్రయాణం సాగించారు. కొంతకాలమైన తర్వాత ఒక చీమలపుట్టను చేరుకున్నారు. ఆ పుట్టను లాగివేస్తే అందులోని చీమలు భయపడి ఎలా పారిపోతాయో చూడాలని పెద్దవారిద్దరూ అనుకున్నారు. వారి అభిప్రాయం తెలుసుకున్న మరుగుజ్జు ఇలా అన్నాడు: "ఆ చీమలను బాధపెట్టటం ఏ మాత్రం సమంజసం కాదు, నేను మీరు చేసేపనిని చూస్తూ ఊరకుండ లేను. వాటి ఆనందానికి మనం ఏ మాత్రం అడ్డుపడరాదని నేను నిశ్చయంగా అభిప్రాయపడుతున్నాను" పెద్దవారిద్దరూ అతని సలహాను పాటించారు.

ముప్పురూ కలసి ఇంకా ముందుకు పోయారు. త్రోవలో వారికొక చెరువు కనిపించింది. ఆ చెరువులో కొన్ని బాతులు ఈదులాడుతున్నాయి. రెండు బాతులను పట్టుకొని వాని మాంసం వండుకు తినాలని పెద్దసోదరులిద్దరూ అనుకున్నారు. కాని మరుగుజ్జు వారితో ఇలా అన్నాడు: "ఆ బాతులను సుఖంగా ఈదుకోనివ్వండి, వాటిని చంపవద్దు" తర్వాత వారింకా ముందుకుపోయారు. వారికొకచోట చెట్టుమీదున్న తేనెపట్టు కనిపించింది. అందులోనుంచి తేనెచెట్టు కాండపైకి కారుతుంది. క్రింద మంటపెట్టి తేనెటీగలన్నిటిని చంపి తేనె తీసుకోవాలని పెద్దసోదరులిద్దరూ అనుకున్నారు. మరుగుజ్జు అలా చేయవద్దని వారిని హెచ్చరిస్తూ ఇలా అన్నాడు: "మీరు తేనెటీగలను చంపకూడదు, అవి సంపాదించుకున్న తేనెను అవే త్రాగాలి."

కొంతకాలం గడచిన తర్వాత ముగ్గురు సోదరులు ఒక చోటును చేరుకున్నారు. వారు గుర్రపు శాలల ప్రక్క నుండి పోతుండగా ఆ శాలలో వారికి మనోహర మయిన గుర్రాలు కనిపించాయి. కాని అవి చలువరాతితో చేయబడ్డాయి. అచ్చట వారికి ఒక్క మనుష్యుడయినా కనిపించ లేదు. తర్వాత సోదరులు చాలా గదులు చూశారు. ఎట్టకేలకు వారు మూడు తాళాలు వేయబడియున్న ద్వారం వద్దకు వచ్చారు. వారు తలుపు సందులోనుండి లోపలికి చూశారు. అచ్చట టేబిల్ వద్ద కూర్చుండియున్న ముసలివాడొకడు వారికి కనిపించాడు. సోదరులు అతనిని ఒకటి రెండు సార్లు పిలిచారు. కాని ముసలివాడు వారికి సమాధానమీయ

లేదు. సోదరులు మూడవసారి పిలిచారు. అంతట వృద్ధుడు వారి వద్దకు వచ్చాడు.

ముసలివాడు సోదరులతో ఏమీ మాట్లాడలేదు. కాని ముగ్గురు సోదరులను రకరకాల భోజనపదార్థాలు పరచియున్న ఒక టేబిల్ వద్దకు తీసుకొనిపోయి కూర్చుండజేశాడు ముగ్గురు సోదరులు తమకు కావలసిన పదార్థాలు భుజించారు. మంచి మంచి పానీయాలు త్రాగారు. తర్వాత ఆ వృద్ధుడు వారిని వేర్వేరు గదులలోకి తీసుకుపోయాడు. అచ్చట వారు నిదురించారు.

మరునాటి ఉదయాన ముసలివాడు మొదటి రాకుమారుని వద్దకు వచ్చి అతనిని ఒక టేబిల్ వద్దకు తీసుకుపోయాడు. ఆ టేబిల్ మీద మూడు ఫలకాలు ఉన్నాయి. ఆ కోటను మంత్రశక్తినుండి ఎలా విడిపించవచ్చునో వాటిమీద వ్రాయబడివుంది. అందులో మొదటి ఫలకంమీద ఇలా ఉంది: "అడవిలో ఒకచోట రాకుమారికి చెందిన వెయ్యి ముత్యాలున్నాయి. అవి అన్నీ ఎక్కడ వున్నాయో కనుక్కోవాలి. సూర్యుడు అస్తమించేలోపల ఆ పని పూర్తి కావాలి. ఆ లోపల అన్నిటినీ కనుక్కోని, ఒక్కదానిని కనుక్కోలేక పోయినా ప్రయత్నించినవారు చలువరాయిగా మారిపోతాడు."

అంత మొదటివాడు అడవిలోకి వెళ్ళి ఆ ముత్యాల కోసం రోజంతా వెదికాడు. అంతలో సాయంకాలం అయింది. అతనికి మొదటి వందముత్యాలయినా కనిపింపలేదు. అంతట

వలన అతడు ఫలకముపై వ్రాయబడినట్లు శిలగా మారిపోయాడు.

మరునాడు రెండో రాకుమారుడు ముత్యాలను వెదకుటనికి పూనుకున్నాడు. అతడు రెండవ వంద ముత్యాలను మాత్రమే కనుక్కోగలిగాడు. అందువలన అతడు కూడా శిలగా మారిపోయాడు.

కడకు మరుగుజ్జు వచ్చాడు. అతడు నిర్ణీత ప్రదేశానికి వచ్చి ఆలోచించాడు. "ఆ పని ఎంత కఠినమయినది! ఎంత అలసటను కలుగజేస్తుంది! అందువలన అతడొక శిలమీద కూర్చుండి ఏడువసాగాడు. అతడట్లు కూర్చుండి యుండగా అతనిచే పూర్వం సహాయం పొందిన చీమలరాజు అయిదు వేల చీమలతో అక్కడకు వచ్చాడు. అవి అన్నీ అతి స్వల్ప కాలంలోనే అన్ని ముత్యాలనూ కనుక్కొని ఒకచోట కుప్పగా పోసాయి.

రెండవ ఫలకంమీద ఇలా వ్రాయబడి వుంది: "రాజకుమారి శయన మందిరపు తాళం చెవి తటాకంలో ఉంది. దానిని కనుక్కోవాలి" మరుగుజ్జు తటాకం వద్దకు వచ్చాడు. అప్పుడు అతనికి లోగడ అతనిచే రక్షింపబడిన బాతులు కనిపించాయి. అవి తటాకంలో మునిగి స్వల్పకాలంలోనే అతనికి తాళపుచెవి తీసుకు వచ్చి ఇచ్చాయి.

ఇక మూడవ ఫలకంమీద ఇలా వ్రాయబడి యుంది: "రాజుగారికి ముగ్గురు కూతుళ్ళు ఉన్నారు. అందరూ అందమైన వారే. ఒకే పోలికగా ఉంటారు. మొదటి కూతురు పంచదార తింది. రెండవ కూతురు తియ్యని పానీయం

త్రాగింది. మూడవకూతురు తేనె త్రాగింది. తేనె త్రాగిన రాజకుమారి ఎవ్వరో కనుక్కోవాలి.

అప్పుడు మరుగుజ్జుచే రక్షింపబడిన తేనెటీగలలోని రాణి ఈగ వచ్చింది. అది ముగ్గురు రాజకుమార్తెల పెదవులను పరీక్షించింది. దానిని బట్టి తేనె త్రాగిన రాజకుమారి ఎవ్వరో మరుగుజ్జు గ్రహింపగలిగాడు. అలా మరుగుజ్జు మూడు విషయాలలోను ఘనవిజయం సాధించాడు. అందుచేత ఆ కోట మంత్రశక్తినుండి విడుదల అయింది. శిలలుగానున్న వారందరు మానవులై నిదురనుండి మేల్కొన్నట్లు లేచేరు. మరుగుజ్జు ఆ మువ్వురు రాకుమార్తెలలోను తేనె త్రాగిన కడిపటి దానిని వివాహమాడాడు. రాజు మరణానంతరం ఆతడే సింహాసనం ఎక్కాడు. అతని సోదరులిద్దరూ మిగిలిన రాజకుమార్తెల నిద్దరినీ వివాహ మాడారు.

# హిమబాల

అది శీతాకాలం ఎక్కడ చూచినా హిమ పాతం ఎక్కువగా వుంది. ఒకనాడొక రాణి కిటికీ వద్ద కూర్చుండి సూదితో పని చేస్తోంది. ఆ కిటికీ నల్లని యెబొనీ కర్రతో చేయబడియుంది. మధ్యమధ్య రాణి హిమం వేపు చూస్తోంది అలా చేయటంలో సూది ఆమె వ్రేలికి గుచ్చుకుంది. అప్పుడు మూడు రక్తపు చుక్కలు నేలమీద పడ్డాయి. అంతటనామె ఎర్రని రక్తపు చుక్కలను తెల్లని హిమాన్ని దీర్ఘంగాచూచి ఇలా అనుకుంది. "నా కుమార్తె హిమన వలె తెల్లగాను, రక్తంవలె యర్రగాను: ఎబొనీ కర్రవలె నల్లగాను ఉంటే ఎంత బాగుంటుంది.

రాణి కోరుకున్నటులే ఆమె కూతురు ఎదగసాగింది. ఆమె చర్మం హిమం వలె తెల్లగా వుంది. ఆమె బుగ్గలు రక్తంవలె గులాబి వన్నెను కలిగి వున్నాయి. ఆమె జుట్టు యెబోనీ కర్రవలె నల్లగా వుంది. అందరూ ఆమెను హిమ బాల అని పిలువసాగారు.

కొంతకాలమైన తరువాత రాణి మరణించారు. తరువాత రాజు మరియొక స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఆ స్త్రీ చాలా అందమైనది. తనకంటే అందమైన వారెవ్వరూ యీ ప్రపంచంలోనే లేరని గర్విస్తుండేది. ఆమెవద్ద ఒక వింత అద్దం వుండేది. ఆమె అప్పుడప్పుడు ఆ అద్దం వద్దకు వెళ్ళి అందులో తన్ను చూచుకొని ఇలా అడుగుతూ వుండేది: "ఓ వింత అద్దమా! ఈ ప్రపంచంలోకెల్ల అందమైన స్త్రీ ఎవరో చెప్పుమా!" అద్దం ఇలా అంటూ వుండేది, "ప్రపంచంలోకెల్ల రాణియే మిక్కిలి అందమైన వనిత!"

హిమబాలఅందం అంతకంతకు అభివృద్ధి చెందుతోంది. ఆమెకు ఏడు సంవత్సరాయి వచ్చాయి. అప్పుడామె పగటి కంటె ఎంతో కాంతివంతంగా ఉంది. ఆమె అందమున తన సవతి తల్లిని మించిపోయింది. ఒకనాడు రాణి యథాప్రకారంగా అద్దం వద్దకు వెళ్ళి యెప్పటివలె ప్రశ్నించింది. అప్పుడు అద్దం ఇలా సమాధానం ఇచ్చింది: "ఓ రాణీ! నీవుఅందమైన వనితవే కావచ్చు. కాని హిమబాల నిన్ను మించిపోయింది." అప్పుడు రాణికి ఎంతో కోపం వచ్చింది. అసూయ చెందింది; చిన్న పుచ్చుకుంది. వెంటనే ఆమె ఒక సేవకుని పిలిపించి అతనితో ఇలా అంది: "నీవు వెంటనే హిమబాలను ఒక అడవిలోకి తీసుకొనిపోయి వధించు. నేనింక ఆమెను ఎన్నటికీ చూడదలుచుకోలేదు." సేవకుడు హిమబాలను ఒక కీకారణ్యములోనికి తీసుకుపోయాడు. "నా ప్రాణం రక్షించు" అని

హిమబాల సేవకుని బ్రతిమాలుకుంది. సేవకుని హృదయం కరిగింది. "క్రూరమృగాలు ఎలాగూ ఆమెను చంపివేస్తాయి. నేనీమెను చంపి పాపం సంపాదించుకోటం ఎందుకు? ఇప్పుడు నా హృదయ భారం తీరిపోయింది" అని అనుకొని సేవకుడు తన దారిని వెళ్ళిపోయాడు.

ప్రాణంతో ఉన్న హిమబాల ఆ అడవిలో తన ఇష్టం వచ్చినట్లు తిరిగింది. క్రూరమృగాలు ఆమెనుచూచి అరుస్తుండేవి. కాని ఆమెకు ఎటువంటి హానీ చేసేవి కావు. సాయంకాలం అయ్యేసరికి ఆమె ఒక చిన్న కుటీరం వద్దకు వచ్చింది అప్పటికామె బాగుగా అలసిపోయింది. అందుచేత ఆమె విశ్రాంతి తీసుకోటానికి కుటీరంలోకి వెళ్ళింది. కుటీరంఅంతా అందులో ఎవ్వరో నివసిస్తున్నట్లు, చాలాపరిశుభ్రంగాఉంది. టేబిలుపై తెల్లని గుడ్డపరచి యుంది. దానిమీద ఏడు పళ్ళెలున్నాయి. వానిలో రొట్టెముక్కలున్నాయి. ఏడు పాత్రలలో ద్రాక్షరసముంది. ఏడు పక్కలుకూడా సిద్ధము చేయబడి ఉన్నాయి. హిమబాల ప్రతి రొట్టెముక్కలోను కొంచెం భాగం తింది. ప్రతి పాత్రలోని ద్రాక్షారసము రుచి చూసింది. పిమ్మట నామె విశ్రమింప దలచింది. ఆరుపక్కలు ఆమెకు సరిపోలేదు. పొడుగు అవటమో, పొట్టి అవటమో తటస్థించింది. ఏడవ పక్క ఆమెకు సరిగా సంపోయింది. దానిపై ఆమె విశ్రమించింది.

కొంచెం సేపటికి ఆ కుటీరం యజమానులు లోనికి ప్రవేశించారు. వారు ఏడుగురు మరుగుజ్జులు; వారు కొండలలో బంగారం కోసం వెతుకుతున్నారు. ఏడుగురు తమ

దీపాలు వెలిగించారు. ఇంటిలో ఇతరులు ఎవ్వరో ప్రవేశించారన్న విషయం వారు గ్రహించారు. మొదటివాడు ఇలా అన్నాడు: "నా స్టూలుపై ఎవరు కూర్చున్నారు!" రెండవ వాడు ఇలా అన్నాడు: "నా పళ్ళెరమును ఎవ్వరో ముట్టుకొన్నారు!" మూడవవాడు ఇలా అన్నాడు: "నా రొట్టె ముక్కను ఎవ్వరో తిన్నారు!" ఆ విధంగా ఏడుగురు తమ ఆశ్చర్యం వెలిపుచ్చారు. అంతట మొదటివాటు తనచుట్టును చూచి "నా పక్కమీద ఎవ్వరో విశ్రమించి యున్నారు!" అని అన్నాడు. "నీ పక్కమీద ఎవ్వరో నిదురిస్తున్నారు!" అని మిగిలిన ఆరుగురు అరచారు. మొదటివాడు తన పక్క వద్దకు పోయి నిదురిస్తున్న హిమబాలను చూశాడు. మిగిలిన వారిని అచ్చటకు రావలసిందని పిలిచాడు. వారందరు తమ దీపములతో అచ్చటకు వచ్చి హిమబాలను చూశారు. వారామె అందం చూసి ఆశ్చర్యపోయారు. ఆమెను చూడడానికి వారెంతో ఆనంద పడ్డారు. ఆ రాత్రికామెకు నిద్రాభంగం చేయురాదని నిశ్చయించుకున్నారు! పక్కలేని మరుగుజ్జు వంతుల ప్రకారం మిగిలిలవారి పక్కలమీద పరుణ్నాడు!

తెల్లవారింది. హిమబాల నిదురనుండి లేచింది. తన కథను ఏడుగురు మరుగుజ్జులకు తెలియజేసింది. వారామెపట్ల తమకుగల సానుభూతిని తెలిపారు! ఇంకను ఆమెతో యిలా అన్నారు: "నీవు మా ఇంటిలో వుండు! మాకు కావలసిన పనులన్నీ చేస్తూ వుండు! మేము నిన్ను పోషిస్తాము!" హిమ

బాల అందుకు అంగీకరించింది! మరునాడు ఏడుగురు మరుగుజ్జులు విలువగల లోహములను వెదకడానికి పర్వతముల వద్దకు బయలుదేరారు! అప్పుడు హిమబాలను ఇట్లు హెచ్చరించారు: "నీవు ఎక్కడ ఉన్నావో రాణి త్వరలో తెలుసుకుంటుంది. అందుచేత నీవు చాలా జాగ్రత్తగా నుండాలి! లోనికి ఎవ్వరని ప్రవేశపెట్టవద్దు."

రాణి హిమబాల మరణించిందని తలచింది. ఇక అందమున తన్నుమించినవారు లేరని భావించింది. ఆమె మరి ఒకసారి వింతఅద్దము వద్దకుపోయి ఇలా అంది. "ఓ వింతఅద్దమా! ఈ ప్రపంచములోకెల్లా అందమైన స్త్రీ ఎవరో చెప్పుమా!" అద్దం ఇలా అంది: నీవు అదంమైన స్త్రీ వన్న మాటనిజమే. కాని అరణ్యంలో ఏడుగురు మఱుగుజ్జులతో నివసిస్తున్న హిమబాల చాలా అందమైనది."

వింత అద్దము ఎప్పుడూ సత్యమునే చెబుతుందని తెలిసిన రాణి ఆ మాటలు విని చాలా భయపడింది. సేవకుడు తన్ను మ్రోసగించాడని తెలుసుకుంది. తనకంటె అందమైన స్త్రీ ఒకర్తె ఇంకను ప్రపంచంలో ఉందన్న సత్యాన్ని ఆమె ఏమాత్రం సహింపలేకుండా ఉంది. ఆమె ఎలాగయినా హిమబాలను తుదముట్టింపదలచింది. అందువలన ఆమెమంచి వస్త్రువులనమ్ము ముసలమ్మ వేషం ధరించి కొన్ని వస్తువులు తీసుకొని అడవికి బయలుదేరింది. ఆమె పోయి పోయి మఱుగుజ్జుల కుటీరం చేరుకుంది. ఆమె తలుపు తట్టి, "అమ్మకానికి మంచి మంచి వస్తువులున్నాయి!" అనిగట్టిగా అరిచింది. హిమబాల కిటికీ లోనుండి బయటకు తొంగిచూచి, "నీ వద్ద ఏమి

వస్తువు లున్నాయి?" అని ప్రశ్నించింది. "నా వద్ద నీకు పనికి వచ్చు వస్తువులు అనేకం ఉన్నాయి" అని రాణి అంది." ఈ ముసలమ్మ చాలా మంచి దానవలె కనబడుతోంది. ఈమెను లోనికి ప్రవేశ పెడితే వాకు ఎటువంటి హాని ఉండదు" అని అమాయకు రాలైన హిమబాల తలచింది. ఆమె తలుపుతీసి రాణిని లోనికి ప్రవేశపెట్టింది. వెంటనే రాణి హిమబాల మెడను పట్టుకొని గట్టిగా నొక్కింది. హిమబాల చనిపోయిన దాని వలె నేలపయిన బడింది హిమబాల మరణించిందని తల చిన రాణి, "నీ అందం నట్టేట కలిసింది" అని అంది. తరు వాత తన దారిన పోయింది.

సాయంకాలమైన తరువాత ఏడుగురు మరుగుజ్జులు ఇంటికితిరిగివచ్చారు. మరణించినవానివలె ఇంకనుమూర్ఛలో మునిగి యున్న హిమబాలను చూచారు. అప్పుడువారుఎంతగా విచారించారో వర్ణించటానికి మాటలు చాలవు. తరువాత వారామెను ఎత్తి ఒక పక్కమీద పడుకో బెట్టారు. తగిన ఉపచారాలు చేశారు. అప్పుడు హిమబాల మూర్ఛనుండి లేచింది. జరిగిన విషయం మరుగుజ్జులకు చెప్పింది. "ఆముస లమ్మ రాణి తప్ప మరి ఇతరులెవ్వరూ కారు. ఈసారిచాలా జాగ్రత్తగా ఉండు. ఎవ్వరినీ లోనికి ప్రవేశ బెట్టకు. ఈసారి మా హెచ్చరికను పాటించక పోతే నిజంగా ప్రాణమోసం వస్తుంది"అని మరుగుజ్జులు ఆమెతో అన్నారు.

రాణి ఇంటికిపోయి ఎప్పటివలె అద్దాన్ని ప్రశ్నిం చింది. హిమబాల అంశమైన దన్న విషయాన్ని ఆ అద్దం ఉద్ఘాటించింది. వెంటనే రాణి మరిఒక విధంగా వేషం

వేసుకుంది. విషపూరితమైన దువ్వెన నొకదానిని తీసుకొని మరుగుజ్జుల కుటీరం చేరుకుంది. "ఉపయోగకరమైన వస్తువు లున్నాయి!" అని గట్టిగా అరిచింది. ఆ కేకను విన్న హిమబాల కిటికీలోంచి బయటకు తొంగి చూచి, "నేను ఎవ్వరిని లోనికి ప్రవేశపెట్టను" అని అంది. అపుడు రాణి ఇలా అంది: "నేను లోపలికి రాను. నా వద్దనుంచి దువ్వెనలున్నాయి. ఒకదానిని తీసుకో." ఆమె అలా అని విషపూరితమైన దువ్వెనను హిమబాలకు ఇచ్చింది. హిమబాల దానిని తీసుకొని తల దువ్వుకుంది. విషం చాలా ఘోరమైనదవటం మూలాన ఆమె వెంటనే మూర్ఛలో మునిగింది. రాణిసంతోషించి ఇంటికి వెళ్ళిపోయింది.

అదృష్టవశంచేత ఆరోజున మరుగుజ్జులు పెందలకడ ఇంటికి తిరిగి వచ్చారు, హిమబాల పరిస్థితిని చూచారు. దువ్వెనను తలలోనుండి బయటకు తీశారు. అప్పుడు హిమబాల మూర్ఛనుండి లేచింది. జరిగిన విషయం అంతా వారికి చెప్పింది. ఇక ముందు జాగ్రత్తగా ఉండవలసిందని వారామెను తీవ్రంగా హెచ్చరించారు.

రాణి మరల వింత అద్దమును ప్రశ్నించింది. అద్దం ఇచ్చిన సమాధానం వలన హిమబాల ఇంకా బతికే ఉందనే విషయాన్ని ఆమె తెలుసుకుంది. అప్పుడామెకు కలిగినకోపమునకు మితిలేదు. "నా ప్రాణం పోయినా సరే, హిమబాల జీవింపకూడదు. ఆమె మరణించి తీరాలి" అని రాణి శపథం చేసింది. ఆమె రహస్యంగా ఒక విషపూరితమైన ఆపిలును తయారు చేసింది. అది పైకి చూడటానికి ఎంతో మనోహరం

-గాను, అందంగాను ఉంది. కాని దానిని తిన్నవారెవ్వరైనా మరణించటం తథ్యం రాణి ఒక రైతు భార్య వేషం వేసుకొని ఆపిలు తీసుకొని ప్రయాణమై పోయింది. ఎట్టకేలకు మరుగుజ్జుల కుటీరం చేరుకుంది. తలుపుతట్టింది. హిమబాల కిటికీలోనుండి బయటకు తొంగి చూచి ఇలా అంది: "నీనెవ్వరినీ లోనికి ప్రవేశ పెట్టను. అలా చేయవద్దని మరుగుజ్జులు హెచ్చరించి యున్నారు." అప్పుడు రాణి ఇలా అంది: "నీ ఇష్టంవచ్చినట్లు చెయ్యి. ఈ ఆపిలు మాత్రం తీసుకో. దీనిని నేను నీకు బహుమానంగా ఇస్తున్నాను." "దాన్ని తీసుకునే సాహసం నాకు లేదు" అని హిమబాల బదులు పలికింది. అంత రాణి ఇలా అంది. "నీవు ఎందుకు భయపడుతున్నావ్? ఈ ఆపిలు విషపూరితమైనదని భావిస్తున్నావా? నేను ఒక భాగం తింటాను. నీవు ఇంకో భాగం తిను." రాణి అంతకు ముందే తెలివిగా ఆ పిలును ఒక వైపుననే విషపూరితం చేసింది. అందువలన ఆమె విషపూరితం కాని భాగాన్ని తింది.

హిమబాల ఇదివరకే ఆపిలుచే ఆకర్షింపబడియుంది. ఆపిలులో కొంత భాగమును రాణి తిన్న తరువాత దాని వలన ఎటువంటి హానీ కలుగదని హిమబాల భావించింది. అందువలన ఆమె రాణి ఇచ్చిన విషపూరితమైన భాగమును నోటిలో పెట్టుకుంది. వెంటనే ఆమె చచ్చి నేలపై పడింది. రాణి ఎంతో సంతోషించి, ఇంటికిపోయి, తన అందమును గూర్చి వింత అద్దమును ప్రశ్నించింది. అప్పుడు వింత అద్దం ఇలా అంది. "ప్రపంచములోకెల్లా రాణియే మిక్కిలి అంద

మైన స్త్రీ." ఆ మాటలను విన్న రాణికి అపరిమితమైన ఆనందం కలిగింది.

సాయంకాలం అయింది. మరుగుజ్జులు ఇంటికి తిరిగి వచ్చారు. నేలపై పడియున్న హిమబాలను చూచారు. ఆమె ఊపిరి పీల్చటంలేదు. అందువలన ఆమె మరణించిందేమో అని వారు భయపడ్డారు. ఆమెను పైకెత్తారు, తల దువ్వారు నీటితోను, ద్రాక్షా రసంతోను ఆమె ముఖం కడిగారు. అంతా వృథా అయింది, ఆమె మరణించిందని వారు గ్రహించారు, ఆమెను ఒక శవపేటికలో పెట్టారు, ఆమె కొరకు మూడు రోజులు విచారించారు. తరువాత ఆమెను భూమిలో పాతిపెట్ట దలచారు. హిమబాల బుగ్గలింకా గులాబి వన్నెను కలిగి యున్నాయి. ఆమె ముఖం జీవకళతో ఉంది. దానిని చూచిన ఏడుగురు మరుగుజ్జులు ఇలా అనుకున్నారు. "మనం ఈమెను ఎన్నటికిని భూమిలో పాతిపెట్టవలదు." అంతవారామెను ఒక అద్దాల పెట్టెలో పెట్టారు. ఆ పెట్టెను ఆమెకు సంబంధించిన వివరాలను సువర్ణాక్షరాలతో లిఖించారు. ఆ పెట్టెను ఒక కొండపై పెట్టారు. ఆ పెట్టె వద్ద ఎల్లప్పుడు ఒక మరుగుజ్జు ఉండెడివాడు. పక్షులు కూడా ఆమెకోసం చాలా విచారింపసాగాయి. మొదట ఒక గుడ్లగూబ వచ్చింది. తరువాత ఒక మాలకాకి వచ్చింది. పిమ్మట ఒక పావురం ఏగుదెంచింది.

హిమబాల ఈ విధంగా కొన్ని సంవత్సరాలు అద్దాల పెట్టెలో పడి ఉంది. ఆమె ఇంకా నిదురిస్తున్న దానివలనే యుంది! ఆమె ముఖంలో ఇంకా జీవకళ ఉట్టిపడుతూనే

యింది! ఒకనాడొక రాకుమారుడు మరుగుజ్జుల కుటీరం వద్దకు వచ్చాడు! అప్పుడతను అద్దాల పెట్టెలో నున్న హిమ బాలను చూచాడు! పెట్టెపైనున్న వ్రాతను చదువుకున్నాడు అంతట నతడు మరుగుజ్జులతో ఇలా అన్నాడు! "మీకు కావలసినంత ధనం ఇస్తాను! నన్ను హిమబాలను తీసుకుపోని వ్వండి!" అప్పుడు మరుగుజ్జులు ఇలా అన్నారు! "ప్రపం చంలో ఉన్న బంగారం అంతా ఇచ్చినా మేము ఆమెను పీడము!" రాజకుమారుడు మరుగుజ్జులను పరి పరి విధాల ఎంతో దీనంగా ప్రార్థించాడు, అప్పుడు మరుగుజ్జులతని కోరి కను తమ సమ్మతిని తెలపారు! రాజకుమారుడు హిమబా లను పైకి ఎత్తాడు! అప్పుడామె నోట్లో ఉన్న ఆపిలుముక్క క్రింద పడింది! వెంటనే ఆమెకు స్పృహ వచ్చింది! ఆమె లేచి ఇలా అంది! "నేను ఎక్కడ ఉన్నాను?" అప్పుడు రాజ కుమారుడు ఇలా అన్నాడు! "నీవు నావద్ద సురక్షితంగా ఉన్నావు!" తరువాత అతడు జరిగిన విషయమంతా రాకు మారికి చెప్పాడు, అతడింకా ఇలా అన్నాడు! "నేను నిన్న గాఢంగా ప్రేమిస్తున్నాను, నీవు నాతో మారాజ భవనానికి రా, అప్పుట నిన్ను నేను నా భార్యగా స్వీకరిస్తాను!" అం దుకు హిమబాల అంగీకరించింది! ఇరువురు కలిసి రాజభనానికి వెళ్ళారు! వారి వివాహానికి అత్యంత వైభవంగ ఏర్పాట్లు చేయబడ్డాయి!

వివాహానికి హిమబాల సవతితల్లి కూడా ఆహ్వానింప బడింది. ఆ రాణి చక్కగా దుస్తులు ధరించి వింత అద్దం వద్దకు పోయి ఇలా అంది: "ఓ వింత అద్దమా! నా కొక్క

విషయం చెప్పు, ప్రపంచంలోకెల్లా అందమైన స్త్రీ ఎవ్వరు''
అప్పుడు వింత అద్దం ఇలా అంది: "నీవు చాలా అందమైన స్త్రీవన్న మాట నిజమే, కాని క్రొత్త రాణితో సమానమైన అందంకలవారెవ్వరూ ఈ ప్రపంచంలో లేరు." రాణి కోపంతో కంపించిపోయింది. ఆమె మిక్కిలి అసూయతో క్రొత్తరాణిని చూడబోయింది. క్రొత్తరాణి హిమబాల అనే విషయమును ఆమె గ్రహించింది. ఆమె అసూయతో ఇంటికి పోయి జబ్బుపడింది. కొంతకాలమయిన తరువాత మరణించింది. హిమబాల, రాకుమారుల వివాహం అత్యంత వైభవంగా జరిగింది. వారు సుఖంగా జీవిస్తున్నారు.

# గులాబిపువ్వు

ఒక గ్రామంలో ఒక వర్తకుడు నివసిస్తున్నాడు. అతనికి ముగ్గురు కూతుళ్ళున్నారు. ఒకనాడు ఆ వర్తకుడు ఎక్కడికో ప్రయాణమై పోతున్నాడు, అంతకు ముందు అతడుతన ముగ్గురు కూతుళ్ళను దగ్గరకు పిలిచి ఇలా అన్నాడు: "నేను తిరిగివచ్చేటప్పుడు మీకు ఏ యే వస్తువులు తీసుకురావాలి?" అపుడు మొదటి కూతురు ఇలా అంది: "నాకు మంచి ముత్యాలు కావాలి." ఇక రెండో కూతురు ఇలా అంది: "నాకు నగలు కావాలి." తరువాత మూడో కూతురు ఇలా అంది. "నాన్నా! నాకు ఒక గులాబి పువ్వు తెచ్చిపెట్టు." అది శీతాకాలం అవటంచేత ఆ కాలంలో గులాబి పువ్వు తీసుకురావటం సామాన్యమయిన విషయం కాదు. కాని వర్తకుడు గులాబి పువ్వులంటే ఇష్టంగల తన అందాల కూతురును ఏ మాత్రం నిరుత్సాహ పరచటానికి ఇష్టపడక "నేను నీకు గులాబిపువ్వు తెచ్చిఇవ్వటానికి తప్పకుండా ప్రయత్నిస్తాను" అని అన్నాడు. వర్తకుడు ముగ్గురు కూతుళ్ళను ముద్దుపెట్టుకుని ప్రయాణమై పోయాడు.

ఆ వర్తకుడు ఇంటికి తిరిగి పోవలసిన సమయం ఆసన్నమయింది. అప్పుడతడు తన మొదటి యిద్దరు కూతుళ్ళకు మంచి ముత్యాలు, నగలు కొన్నాడు. ఇక గులాబి పువ్వు సంపాదించటానికి శతవిధాలా ప్రయత్నించాడు. అతడు ప్రతి తోటవద్దకు పోయి అచ్చట ఉన్నవారిని "గులాబి పువ్వులున్నాయా?" అని అడుగసాగాడు. "యీ కాలంలో గులాబి పువ్వులు ఎలా లభిస్తాయి?" అని అందరూ నవ్వసాగారు. తన ప్రియమయిన కూతురుకు కావలసిన గులాబిపువ్వు దొరకక పోవటం అతనికి అపరిమితమయిన విచారం కలిగింది. ఆమెకు యేమి తీసుకుపోవాలా అని అనుకుంటూ అతడు తిరుగు ప్రయాణం సాగించాడు. అప్పుడతడు ఒక అందమైన కోటవద్దకు వచ్చాడు. ఆ కోటచుట్టూ ఒక తోట వుంది- ఆ తోటలో సగభాగం వేసవికాలపు తోటవలెను, మిగిలిన సంభాగం శీతాకాలపు తోటవలెను ఉన్నాయి. వేసవి కాలపు తోటలో అన్ని రకాల పూవులూ ఉన్నాయి. ఆ వర్తకుడు తన అదృష్టానికి ఎంతో సంతోషించి నౌకరును పిలిచి ఆ తోటలోనుంచి ఒక గులాబిపువ్వు తీసుకురమ్మని చెప్పాడు. నౌకరు అతడు చెప్పినట్లు చేశాడు. తరువాత వారు ప్రయాణమై పోసాగారు. అంతలో వారిముందు కొక భయంకరమయిన సింహం వచ్చి యిలా అంది: "మీరు నా అనుమతి లేకుండా నా తోటలోని గులాబిపువ్వు కోశారు. మిమ్మిప్పుడే మ్రింగి వేస్తాను."

ఆ మాటలు విని వర్తకుడు యిలా అన్నాడు. "ఈ తోట నీదనే విషయం నాకు తెలియదు. ఇంక నా ప్రాణం

రక్షించుకోవటానికి మార్గం లేదా” అప్పుడు సింహం యిలా అంది. “ఒక మార్గం వుంది. నీవు యింటికి పోగానె నిన్ను మొదట కలుసుకునె వారిని నాకు యిచ్చివేయాలి! నీవు యిందుకు అంగీకరిస్తే నీ ప్రాణం రక్షిస్తాను, నీ కూతురు గులాబి పూవు తీసుకు పోనిస్తాను!” అలా చేయడానికి ఇష్ట పడని వర్తకుడు ఇలా అన్నాడు. “నా మూడో కూతురు నన్ను గాఢంగా ప్రేమిస్తోంది, ఆమెయే నన్ను మొదట కలుసుకుంటుంది, ఆమెను నీకు యివ్వటానికి నేను యివ్వటా నికి అంగీకరించను” అప్పుడు ప్రాణ భీతి చెందిన నౌకరు ఇలా అన్నాడు! “ఆవిధంగా ఏందుకనుకోవాలి, కుక్కగాని, పిల్లి గాని కావచ్చు,” ఎట్టకేలకు వర్తకుడు బరువయిన హృద యంతో సింహం కోరినట్లు వాగ్దానం చేశాడు! గులాబి పూవుతో యింటికి పయనమై పోయాడు!

వర్తకుడు తన గృహం సమీపించాడు, మొట్టమొదట మూడవ కూతురు అతనికి ఎదురుగా వచ్చింది, అతనిని అహ్వా నించింది, తండ్రివద్దనున్న గులాబి పువ్వును చూసి అపరిమిత మయిన ఆనందం పొందింది, కానివర్తకుడు మాత్రంమిగులు విచారంతో యేడుస్తూ ఆమెతో ఇలా అన్నాడు, “అయ్యో ప్రియమైన కూతురా, ఈ గులాబి పువ్వు మనకు సామాన్య ముగా రాలేదు, నేను ఇంటికి రాగానే మొట్టమొదట కలుసు కున్న వారిని ఒక సింహానికి ఇవ్వటానికి వాగ్దానం చేసి యున్నాను, ఇపుడు నిన్ను సింహానికి ఇవ్వాలి. అది నిన్ను ముక్కలు ముక్కలుగా చీల్చి తినివేస్తుంది!” తరువాత అతడు జరిగిన విషయమంతా ఆమెకు తెలిపాడు! “ఏమైనా

సరే నీ వా సింహం వద్దకు పోవద్దు” అని అతడు అన్నాడు!

మూడవ కూతురు తండ్రిని ఓదార్చి ఇలా అంది! ”ప్రియమైన నాన్నా నువ్వు నాకోసం ఏమాత్రం విచారింప వద్దు నీవు సింహానికి చేసిన వాగ్దానం నెరవేర్చుకో! నేను సింహం వద్దకు వెళ్ళి నన్ను రక్షించ వలసిందని దీనంగా ప్రార్థిస్తాను! తిరిగి ఇంటికి రావటానికి అనుమతి సంపాయిస్తాను!”

మరునాటి ప్రొద్దయాన ఆమె సింహం వద్దకుపోవటానికి దారి కనుక్కొని తన తండ్రివద్ద సెలవు తీసుకుని ధైర్యం వహించి సింహం వద్దకు ప్రయాణమై పోయింది! సింహం ఒక మంత్రబద్ధమయిన రాజకుమారుడు! పగలంతా ఆతడు ఆతని అతని అనుచరులు సింహముల రూపములు ధరించియుండేవారు! సాయంకాలం అయ్యేసరికి అందరూ తమ తమ నిజరూపాలు పొందుతుండేవారు! వర్తకుని మూడో కూతురు దుర్గం వద్దకు పోయే సరికి సాయంకాలం అయింది! అప్పటికప్పటి వారందరూ నిజరూపాలు ధరించి ఉన్నారు! రాజకుమారుడు ఆమెను యెంతో ఘనంగా ఆహ్వానించి తన్ను వివాహం చేసుకోవలసిందని కోరాడు! అందులకామె తన అంగీకారం తెలిపింది! వెంటనే వారిరువురకు ఘనంగా వివాహం జరిగింది, ఇరువురును సుఖంగా జీవింప సాగారు! రాజ కుమారుడు సాయంకాలము నుండి తెల్లవారే వరకు భార్య వద్ద ఉండేవాడు! తెల్లవారగానే ఎక్కడికో పోయి సాయంకాలమైన తరువాత తిరిగి వస్తుండేవాడు! అతని రహస్యము భార్యకు ఏమాత్రం తెలియటం లేదు!

కొంతకాలం గడిచింది. ఒకనాడు రాజకుమారుడు భార్యతో యిలా అన్నాడు- "రేపు నీ మొదటి సోదరి వివాహం జరుగుతుంది. ఆ సందర్భాన నీ తండ్రి యింటిలో గొప్ప విందు జరుగుతుంది. నీవు అచ్చటకు పోటానికి ఇష్టపడితే నా సింహాలు నిన్ను అక్కడకు తీసుకుపోతాయి" ఆమె తండ్రిని చూడటానికి ఎంతో యిష్టపడి సింహాములతో కలసి బయలు దేరింది. తండ్రి గృహం చేరుకుంది. అందరూ ఆమెను చూచి ఎంతో సంతోషించారు. ఆమె తన విషయమును అందరకు చెప్పి వారిని ఆనందసాగరంలో ముంచింది. మొదటి సోదరి వివాహము, విందు జరిగిన తరువాత ఆమె తన భర్త ఇంటికి తిరిగి పోయింది.

కొంతకాలం గడిచిన తర్వాత ఆ వర్తకుని రెండో కూతురు వివాహం వచ్చింది. అప్పుడు మూడో కూతురు తన భర్తతో ఇలా అంది: "ఈ సారి నేను ఒంటరిగా వెళ్ళను మీరు కూడా నాతో రావాలి?" అపుడు రాజకుమారుడు ఇలా అన్నాడు: "నాపై ఏ మాత్రం దీపముల కాంతి పడరాదు-ఏ మాత్రం పడినా నేను పావురముగా మారిపోతాను ఆ రూపంతో నేను ఏడుసంవత్సరాలు ఈ లోకంలో తిరుగవలసి వస్తుంది. ఇది చాలా ప్రమాదకరమైనది?" భార్య అతని మాటలను లెక్కింపక తనతో రావలసిందని పీడింపసాగింది. "మీపై కాంతి పడకుండా నేను జాగ్రత్త వహిస్తాను" అని ఆమె అంది. అంతట ఇరువురూ తమ పసిబిడ్డలతో బయలుదేరి వర్తకుని గృహం చేరుకున్నారు. పెండ్లి దీపములు వెలిగింపబడినపుడు మూడవకూతురు తన భర్తను

ఒక గట్టి గదిలో పెట్టింది. దురదృష్ట వశమున ఆ గదిగోడ లకు ఒకచోట సన్నని పగులు ఉంది. ఈ విషయమును మూడవ కూతురు గ్రహించలేదు. ఒక సన్నని కాంతికిర ణము పోయి రాజకుమారునిమీద పడింది. వెంటనే అతడు పావురముగా మారిపోయాడు. భర్తను కలుసుకోటానికివచ్చిన మూడవ కూతురుకు ఆ పావురం మాత్రం కనిపించింది.

ఆమె జరిగిన విషయం గ్రహించింది. అపుడు పావురం ఆమెతో ఇలా అంది: "నేను ఈ పావురం రూపాన్ని ఏడు సంవత్సరాలు భరించాలి. నేను అనేక ప్రదేశాలలో సంచ రిస్తాను. నేను అప్పుడప్పుడు నా తెల్లని ఈకలను క్రింద పడ వేస్తాను. వాటి మూలాన నీవు నేనుపోయిన మార్గం తెలుసు కోవచ్చును. నీవు నన్ను అనుసరిస్తూ ఉండు. ఎట్టకేలకు నీవు నాకు స్వేచ్ఛను ఈయగలవు."

తరువాత పావురం ఎగిరిపోసాగింది. ఆమె దాని ననుస రించి పోసాగింది. అది అప్పుడప్పుడు తెల్లని ఈకలను క్రింద పడవేస్తోంది. భార్య ఆ ఆనవాలును అనుసరించి ముందుకు పోతూనే ఉంది. ఆమె ఎన్నడూ అటు నిటు చూడటంలేదు. విశ్రాంతి తీసుకోటంలేదు. ఆ విధంగా సుమారు ఏడు సంవ త్సరాలు గడిచి పోయాయి. అప్పుడామె ఆనందానికి మితి లేదు.

ఒకనాడు ఆమెకు తెల్లని ఈకలు కనిపించలేదు. అపు డామె ఆకాశంవంక చూచింది. ఆమెకు పావురం ఎక్కడా కనిపించలేదు. అపుడామె తనలో తాను ఇలా అనుకుంది: "ఇపుడు నాకు మానవులెవరూ సహాయం చేయలేరు."

అంతట నామె సూర్యునివద్దకు పోయి ఇలా అంది "ఓ సూర్యుడా! నీవు ప్రపంచం అంతటా ప్రకాశిస్తున్నావు, నీ కిరణాలు చొచ్చుకుపోని ప్రదేశం ఏదీలేదు-కనుక నా తెల్లని పావురం ఎక్కడ ఉన్నదో చెప్పు." సూర్యుడు ఆమెకు ఇలా సమాధాన మిచ్చాడు "నేను నీ పావురమును చూడలేదు— కాని నేను నీ కొక చిన్న పెట్టెను ఇస్తాను, అవసరం వచ్చి నప్పుడు దానిని తెరచి ఉపయోగించుకో." ఆమె సూర్యుని వద్దనుండి పెట్టె తీసుకొని సాయంకాలం వరకు అటు నిటు తిరి గింది. రాత్రి ఆమెచంద్రునితో ఇలా అంది "ఓ చంద్రుడా! నీవు రాత్రి ప్రతిచోటా ప్రకాశిస్తావు కదా! నా తెల్లని పావురమును ఎక్కడయినాచూచినావా?" అప్పుడుచంద్రుడు ఇలా అన్నాడు "లేదు నేను నీ కొక గ్రుడ్డును ఇస్తాను. అవ సరం వచ్చినప్పుడు దానిని పగులగొట్టు" ఆమె చంద్రునివద్ద నుండి గ్రుడ్డుకు తీసుకుంది. తరువాత నామె రాత్రి గాలితో ఇలా అంది "ఓ గాలీ! నీవు వీచని ప్రదేశం లేదు-నా తెల్లని పావురమును ఎక్కడయినా చూచి యున్నావా?" రాత్రి గాలి ఇలా అంది "లేదు! కాని మిగిలిన మూడు గాలులను అడిగి తెలుసు కుంటాను."

తూర్పుగాలి పశ్చిమగాలి తమా పావురమును చూడ లేదని చెప్పాయి. దక్షిణపు గాలి మాత్రం ఇలా అంది— "నేనా తెల్లని పావురమును చూచాను. అది ఎఱ్ఱ సముద్రం వద్దకు పారిపోయింది. ఏడు సంవత్సరాలు గడిచిపోయాయి కనుక, తిరిగి సింహ రూపు దాల్చింది. అచ్చట ఆ సింహం

9 గు

ఒక మంత్రబద్ధమైన భయంకర మృగంతో పోరుతుంది.” అంత రాత్రి గాలి వర్తకుని కూతురుతో ఇలా అంది “నేను నీ కొక చక్కని సలహాను ఇస్తాను. వెంటనే ఎఱ్ఱసముద్రం వద్దకు పో, ఆ సముద్రమునకు కుడివైపున కొన్ని దండాలుంటాయి నీవు వాటిని లెక్కపెట్టు, పదకొండవది రాగానే దానినివిరిచి వెయ్యి. దానితో ఆ భయంకర మృగాన్ని కొట్టు. అప్పుడు సింహానికే విజయం కలుగుతుంది. అప్పుడు రెండు మృగములు మానవాకారం తాలుస్తాయి. అప్పుడు నీవు నీ భర్తతో వెంటనే ఇంటికి తిరిగిరా.”

వర్తకుని కూతురు ఎఱ్ఱసముద్రం వద్దకు పోయింది— రాత్రి గాలి చెప్పినట్లు చేసింది. సింహం రాజకుమారుడుగా మారిపోయింది. భయంకర మృగరాజకుమారిగా మారి పోయింది. వర్తకుని కూతురు వెంటనే తన భర్తనుపట్టుకోటం మరచిపోయింది. సమయంకోసం వేచియున్న రాకుమారిరాకు మారుని తీసుకుని ఎచ్చటికోపోయింది.

వర్తకుని కూతురు మరల దీనురాలయింది. కాని ఆమె ధైర్యం వహించి ఇలా అంది “నా బొందిలో ప్రాణం ఉన్నంతవరకు నా భర్తను వెదకి పట్టుకుంటాను.” ఆమె అలా నిశ్చయించుకొని పోయి పోయి ఒక దుర్గం చేరుకుంది. సరిగా రాకుమారి రాజకుమారుని ఆ దుర్గమునకే తీసుకు

పోయింది. రాజకుమారుని వివాహం చేసుకోవటానికి రాజకుమారి అన్ని ఏర్పాట్లు చేసింది. వారి వివాహం త్వరలోనే జరుగుతుందని వర్తకుని కూతురు తెలుసుకుంది. అప్పుడామె సూర్యుడు ఇచ్చిన పేటికను తెరచింది. అందులో సూర్యుని లాగ మెరుస్తున్న దుస్తులున్నాయి. ఆమె ఆ దుస్తులనుధరించి రాజభవనంలో ప్రవేశించింది. అందరూ ఆమెను పరిశీలించి చూశారు. పెండ్లికూతురు కూడా ఆ దుస్తులను చూచి, "వానిని వెలకు అమ్ముతావా?" అని వర్తకుని కుమార్తెను అడిగింది. "వీటిని వెండి బంగారాలకు ఇయ్యను. మాంసం రక్తం కొరకు ఇస్తాను" అని వర్తకుని కుమార్తె అంది. "నీ ఉద్దేశ్యం ఏమటి?" అని పెండ్లికుమార్తె అడిగింది. "యీ రాత్రికి నన్ను రాజకుమారునితో ఏకాంతంగా మాట్లాడ నివ్వాలి. అప్పుడు నీకీ దుస్తులు ఇస్తాను." అని వర్తకుని కుమార్తె అంది. ఎట్టకేలకు పెండ్లికుమార్తె అంగీకరించింది. కాని ఆమె తన సేవకునితో రహస్యంగా ఇలా చెప్పింది— "రాజకుమారునకు గాఢంగా నిదురపట్టె మందు ఇయ్యి."

సాయంకాలం అయింది. రాజకుమారుడు గాఢంగా నిదురిస్తున్నాడు. వర్తకుని కూతురు గదిలోకి ప్రవేశ పెట్ట బడింది. ఆమె రాజకుమారుని పాదములవద్ద కూర్చుండి ఇలా అంది "నేను నిన్ను ఏడు సంవత్సరాలు అనుసరించాను. నీ కోసం సూర్యుని చంద్రుని రాత్రి గాలిని ప్రశ్నించాను. ఎట్ట

కేలకు నిన్ను ఆ భయంకర మృగం బారినుండి రక్షించాను. అట్టి నన్ను నీవు మరచుట తగునా?" గాఢనిద్రలో మునిగి యున్న రాజకుమారునకు ఆ మాటలు ఏవీ వినబడలేదు. ఆమె ప్రార్థన వృథా అయింది.

అంత వర్తకుని కూతురును బయటకుతీసుకు పోయారు. పెండ్లికూతురు ఆమె బట్టలను లాగుతుంది. వర్తకుని కుమార్తె ఒక మైదానములోకి పోయి ఏడవసాగింది. అపుడామె చంద్రుడిచ్చిన గ్రుడ్డును పగులగొట్టింది. ఆ గ్రుడ్డులోనుంచి ఒక కోడిపెట్ట, పన్రెండు కోడిపిల్లలు బయటకు వచ్చాయి. అవి బంగారంతో చేయబడి ఉన్నాయి. అవి చక్కగా అటు నిటు తిరుగ సాగాయి. వర్తకుని కుమార్తె వాటిని పెండ్లి కుమార్తె గది వద్దకు తీసుకుపోయింది. "కోడిపెట్టను పిల్లలను అమ్ముతావా?" అని పెండ్లికుమార్తె ప్రశ్నించింది. రాజ కుమారునితో మరల మాట్లాడనిస్తే ఇస్తానని వర్తకుని కుమార్తె అంది. అందుకు పెండ్లి కూతురు అంగీకరించింది.

మనల రాజ కుమారునకు నిద్రపట్టు మందు నీయవల సిందని పెండ్లికూతురు తన నౌకరుకు చెప్పింది. ఈ సారి నౌకరు రాజకుమారునిచే ప్రశ్నింపబడి ఇదివరకు జరిగిన విషయం అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. రాజకుమారుడుని నిదురిస్తున్నట్లు నటింపసాగాడు. వర్తకుని పుత్రిక అతనికి తన గోడును చెప్పుకుంది. రాజకుమారుడు తనభార్య గొంతును ఆనవాలుబట్టి లేచి ఇలా అన్నాడు: "నేనిప్పుడు కలలోనుంచి మేల్కొంచినాను. రాజకుమారి నన్ను పూర్తిగా

వశం చేసుకోటం మూలాన నిన్ను పూర్తిగా మరచిపో యాను. నీవు సరియైన సమయానికి వచ్చి నాకు జ్ఞానోదయం కలుగజేశావు. నీకు ఎంతయినా కృతజ్ఞుడను."

అంతట నాఇరువురూ రహస్యముగా రాజభవనమును వీడిపోయి తమకోటకు చేరుకున్నారు. అచ్చట వారుసుఖంగా జీవిస్తున్నారు.

# పుంజు-పెట్ట

కోడిపుంజు పేరు చాంటిక్లీర్. కోడిపెట్టపేరు పార్ట్లెట్. ఆ రెండూను భార్యాభర్తలు. ఒకనాడు పెట్ట పుంజుతో ఇలా అంది: "ఇప్పటికి కాయలు బాగా తయారయి వుంటాయి. మనమిద్దరం పర్వతాలమీదకు వెళ్ళి ఉడుతలు తిని వేయక పూర్వమే మనకు కావలసిన అన్ని కాయలు తిందాము." "నీ కోరికను నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. మనమిద్దరం కలిసివెళ్ళి చక్కగా కాలం గడుపుదాము" అని పుంజు అంది.

పుంజు, పెట్ట కలిసి పర్వతాలమీదకు వెళ్ళాయి. ఆ రోజు వాతావరణం చాలా బాగుంది. అందుచేత అవి సాయంకాలం వరకు కూడా అక్కడనే యున్నాయి. అవి చాలా కాయలు తింటం వలన నడవలేకపోవటం వల్లనో లేక బద్ధకం వల్లనో కాలినడకను ఇంటికి తిరిగిపోవటానికి ఇష్టపడలేదు. అందుచేత పుంజు ఒక చిన్న బండిని తయారు చేసింది. దాని భార్య ఆ బండిపై కూర్చుండి, "నీవు దీనిని లాగుకొనిపో" అని భర్తను ఆజ్ఞాపించింది. "నేను నడచిపోటానికయినా ఇష్టపడ

తాను గాని నీవు చెప్పినట్లు చేయటానికి ఏమాత్రం అంగీకరించను. నీకిష్టమైతే నేనుకూడా బండిమీద కూర్చొండి ఒడిని నడుపుతాను" అని పుంజుఅంది. వారాధోరణిలో మాట్లాడు కుంటూ ఉండగా ఒక బాతు అక్కడకువచ్చి వాటితో ఇలా గట్టిగా అంది: "మీరు ఇక్కడకు ఎందుకు వచ్చినట్లు? పని పాటు లేక ఇక్కడ తిరుగుతున్నారు. మిమ్మల్ని నా భూమి పైకి ఎవ్వరు రమ్మన్నారు? నేను మీ అహంకారానికి తగిన శాస్తి చేస్తాను." అలా అని ఆ బాతు పుంజుమీద పడింది. పుంజు పిరికిది ఏమాత్రం కాదు. అందుచేత అది బాతును తల ఇష్టం వచ్చినట్లు కొట్టింది. అప్పుడు, "నన్ను దయతో చూడు" అని బాతు అంది. అంతట పుంజు ఇలా అంది: "మేమిరువురము బండిమీద కూర్చుంటాము. నీవు బండినిమా యింటికి లాగుకొనిపో. నీవిందులకు అంగీకరిస్తే నిన్ను రక్షిస్తాను." బాతు అలా చేయటానికి అంగీకరించింది. పుంజు కూడా బండిపై కూర్చుంది. "త్వరితంగా బండిని లాగుకొని పో" అని పుంజు బాతును హెచ్చరించింది. దాని ఆజ్ఞ ప్రకారం బాతు ఆ బండిని వేగంగా లాగుకొని పోతోంది.

అవి కొంత దూరం ప్రయాణం చేశాయి. అప్పుడు అవి కలసి ప్రయాణం చేస్తున్న ఒక సూదిని, గుండుసూదిని చూశాయి. సూది బండిని ఆపి లోపలనున్న వారితో ఇలా అంది: "మాకు త్రోవ సరిగా కనబడటంలేదు. మేము నడచి పోలేకున్నాం. మేమిద్దరం యిచ్చటకు కొన్నిమైళ్ళదూరంలో ఉన్న పానశాలకు పోయాము. అచ్చట రకరకాలపానీయాలు సేవిస్తూ ప్రొద్దుపోయిన విషయం గుర్తించలేదు. అందువలన

మీరు మాయందు దయయుంచి మీబండిలో కొద్దిగా స్థానం ఇయ్యాలి!" సూది, గుండుసూది చాలా సన్నంగా ఉన్న వనియు, అవి బండిలో ఎక్కువ స్థలం ఆక్రమింపవనియు తలచి పుంజు ఇలాఅంది: "మీరు మా బండిపైకి రావటానికి నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు, కాని ఎక్కేటప్పుడు బండి చక్రాలను మురికి చేయకండి! నా భార్య పాదాలను త్రొక్కకండి!" "అట్లే" అని సూది, గుండుసూది బండిలో ప్రవేశించాయి.

చాలా సేపు గడచిన తరువాత అవి ఒక పూటకూళ్ళ ఇల్లు చేరుకున్నాయి! అప్పటికి బాగా చీకటిపడింది! పాపం బాతు బాగా అలసిపోయింది! అందుచేత ఆ రాత్రికవిఅన్నీ అచ్చటనే విశ్రమించటానికి నిశ్చయించుకున్నాయి! వాటిని గూర్చి అంతమంచి అభిప్రాయము లేని యజమానుడు యిలా అన్నాడు: "ఇల్లు అంతా బాటసారులతో నిండివుంది! మీ కిచ్చట జాగా లేదు!" అప్పుడవి అన్నీ యజమానితో చాలా మర్యాదగా మాట్లాడాయి! కోడిపుంజు తన బాతు పెట్టిన గుడ్డును యజమానికియ్యటానికి అంగీకరించింది! అందువలన యజమానుడు వాటినన్నీటిని లోపలకు తీసుకుపోయి చక్కని భోజనము పెట్టాడు! అవి నిదురపోటానికి తగిన ఏర్పాట్లు చేశాడు!

ఇంకనూ బాగా తెల్లవారలేదు. ఇంటిలో ఎవ్వరూ లేవలేదు. అప్పుడు పుంజు నిదురనుండి మేల్కొని తనభార్యను కూడా లేపింది. పుంజు యజమానున కిచ్చిన గ్రుడ్డుతీసుకు వచ్చి దానికి రంధ్రం పొడిచింది. పుంజు, పెట్టా కలసి గ్రుడ్డు

లోపలనున్నదానిని తీసివేసి గుల్లను కుంపటిలో పడవేశాయి తరువాత సూదిని, గుండుసూదిని, తీసుకువచ్చి ఒకదానిని ఇంటి యజమానుని కుర్చీలోను, మరియొక దానిని అతని చేతి రుమాలకు గుచ్చాయి. పిమ్మట మెల్లన బయటకుపోయాయి ఆ సంగతి గమనించిన బాతు వెంటనే ప్రాటకూళ్ళ ఇంటికి ప్రక్కనేయున్న ప్రవాహంలోవడి ఈదుకుంటూ ఎక్కడికో పోయింది. పుంజు పెట్ట తమదారిని పోయాయి.

ఒకటి రెండు గంటలు గడచిన తరువాత యజమానుడు నిదురనుండి లేచి చేతి రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు. అప్పుడతని ముఖానికి గుండుసూది గుచ్చుకుంది, తరువాత అతడు చుట్ట కాల్చుకోటానికి కుంపటి వద్దకు వెళ్ళి నిప్పును కదిలించాడు, కాలియున్న గుల్ల ముక్కలు ఎగిరి అతని కండ్లలోపడి అతనిని చాలవరకు అంధుని చేశాయి. "అయ్యో! నేటి ఉదయాన నాకు అంతా వ్యతిరేకంగా ఉన్నట్లుంది!" అని అతడు కుర్చీలో కూలబడ్డాడు. అప్పుడతనికి సూది బాగా గుచ్చుకుంది. యజమానునకు అపరిమితమైన కోపం వచ్చింది. గతరాత్రి వచ్చినవే ఆపనిని చేసియుంటాయని అతడనుమానించి వాటికిచ్చిన గదిలోనికి వెళ్ళాడు. కాని అతనికచ్చట ఏవీ కనిపించలేదు, అప్పుడతడు ఇలా శపథం చేశాడు: "ఇవి పొట్టనిండా తిన్నాయి. నాకు ఏమీ ఇవ్వలేదు. పైగా నాకు బాధను కలుగజేశాయి. ఇట్టి తిరుగుబోతులకు ఇంకెప్పుడూ నా గృహంలో చోటు పెట్టను."

* * *

మరికొంతకాలము పుంజు పెట్ట కలసి ఎచ్చటికో వెళ్ళ దలచాయి. పుంజు నాలుగు ఎర్రని చక్రములుగల అందమైన బండి నొకదాన్ని తయారు చేసింది ఆ బండికి ఆరు ఎలుకలను పూన్చింది. పుంజు పెట్ట బండిపై కెక్కాయి. బండి ప్రయాణం సాగించింది. కొంతకాలం గడిచిన తరువాత అవి ఒక పిల్లిని కలుసుకున్నాయి. "మీరు ఎక్కడకు వెళుతున్నారు?" అని పిల్లి వాటిని ప్రశ్నించింది. "మా మిత్రుడు కోర్బెస్ అను నక్కను కలుసుకోటానికి పోతున్నాము" అని పుంజు జవాబిచ్చింది. "నన్ను కూడా మీతో తీసుకుపొండి" అని పిల్లి అంది. "అందుకు నాకు ఎటువంటి అభ్యంతరమూ లేదు. నీవు బండిమీద వెనక కూర్చో. పడకుండా జాగ్రత్తగా ఉండు" అని పుంజు అంది. పిల్లి బండిపై కెక్కింది. తరువాత బండి సాగిపోతోంది. అనతికాలంలోనే మిల్లురాయి, గ్రుడ్డు, బాతు, గుండుసూది మొదలగు వానికన్నిటికీ పుంజు బండిలో స్థానమిచ్చింది.

పిమ్మట అన్నీ నక్క ఇంటికి వచ్చాయి. అప్పుడు నక్క ఇంటిలో లేదు. ఎలుకలు బండిని శకట గృహంలోకి తీసుకుపోయాయి. అంత పుంజు, పెట్ట ఒక దూలము మీదకు ఎక్కాయి. పిల్లి దాలి గుంటలో కూర్చుంది. బాతు నీళ్ళ తొట్టెలో ప్రవేశించింది. గుండుసూది తలగడకు గుచ్చుకుంది. గ్రుడ్డు తుండులో దూరింది. మిల్లురాయి వీధితలుపు మీద పడుంది.

కొంతసేపయిన తరువాత నక్క ఇంటికి వచ్చి నిప్పు చేయటానికి దాలి గుంట వద్దకు పోయింది. అప్పుడు పిల్లి దాలి

గుంటలో సన్న బూడిదను విదల్చగా అది నక్క కన్నులలో పడింది. అప్పుడది నీళ్ళ తొట్టె వద్దకు పోయింది. బాతు నీళ్ళను నక్క మొగమునిండా పడునట్లు చల్లింది. అంత నక్క తుండుతో మొగము తుడుచుకోటానికి ప్రయత్నించింది. గుడ్డు పగిలి నక్క ముఖమంతా అపరిశుభ్రమైంది. నక్క కోపించి భోజనం చేయకుండానే మంచం మీద పరుంది. అప్పుడు తలగడలోని గుండుసూది దానికి బాగా గుచ్చు కుంది. నక్క మిక్కిలి కోపముతో మంచముపై నుండి క్రిందకు దుమికి బయటకు వెళ్ళబోయింది. అప్పుడు మిల్లురాయి దాని మీద పడింది. వెంటనే నక్క మరణించింది.

* * *

మరియొకనాడు పుంజు, పెట్ట కలసి కాయలు తింటానికి పర్వతంమీదకు పోదలచాయి. తమకు దొరకిన కాయలను సమంగా పంచుకోటానికి రెండూ అంగీకరించాయి. రెండూ పర్వతం మీదకు వెళ్ళాయి. పెట్టకు ఒక పెద్ద కాయ దొరికింది. కాని ఆ విషయం పుంజుకు చెప్పకుండానే మింగి వేసింది. కాని ఆ కాయ చాల పెద్దది అవటంవలన దాని గొంతులో ఇరుక్కుపోయింది. అప్పుడది చాలా భయపడి పుంజుతో ఇలా అంది. "దయయుంచి వెంటనే పరుగెత్తుకు పోయి నాకు మంచినీరు తీసుకురా, లేకపోతే నేను ఉక్కిరి బిక్కిరియై మరణించటం తప్పదు." పుంజు తన శక్తి కొలది నది వద్దకు పరుగెత్తుకుపోయి, "నదీ! నా భార్య గొంతులో కాయ ఇరుక్కుపోయింది. దానికి మంచినీరు కావాలి. దయయుంచి నాకు మంచినీరు ఇయ్యి" అని ప్రార్థించింది. అప్పుడు

నది ఇలా అంది. "నీవు వెంటనే పెండ్లికూతురు వద్దకువెళ్ళి నీటిని తోడుకోవటానికి పట్టు త్రాడు తీసుకురా."

పుంజు పెండ్లికూతురు వద్దకు వెళ్ళి ఇలా అంది. "నాకొక పట్టు త్రాడు ఇయ్యి. అప్పుడు నది నాకు నీరు ఇస్తుంది. నేను ఆ నీటిని నా భార్య వద్దకు తీసుకుపోతాను. అప్పుడది ఆ నీరు త్రాగి ప్రాణాలు రక్షించుకుంటుంది." కాని పెండ్లికూతురు ఇలా అంది. "తోటలో ఒక చెట్టుకు వ్రేలాడుతున్న పూల మాలను తీసుకురా!" పుంజు వెంటనే తోటలోకి వెళ్ళి చెట్టుకు వ్రేలాడుతున్న పూలమాలను తీసుకుని పెండ్లికూతురుకు ఇచ్చింది. పెండ్లికూతురు పట్టు త్రాడును ఇచ్చింది. పుంజు నీటిని భార్య వద్దకు తీసుకుపోయింది. ఈ లోపలనే భార్య ఉక్కిరి బిక్కిరియై చచ్చి పడియుంది.

చాంటిక్లీర్ కడు విచారంతో గోలు గోలున ఏడ్చింది. అన్ని మృగాలూ అక్కడకు వచ్చాయి. దానితో పాటుగా అవికూడా ఏడ్చాయి. అంత పార్ట్లెట్‌ను స్మశానానికి తీసుకుపోటానికి ఆరు ఎలుకలు ఒక విధమగు బండిని తయారు చేశాయి. చనిపోయిన పార్ట్లెట్‌ను బండిమీద కూర్చుంది. ఎలుకలు బండిని లాగుతున్నాయి! క్రమక్రమంగా నక్క, తోడేలు, ఎలుగుబంటి, మేక మొదలైన మృగాలన్నీ వచ్చి బండిమీదకు ఎక్కాయి!

ఆ బండి పోయి పోయి వేగంగా ప్రవహిస్తున్న ఒక ప్రవాహం వద్దకుపోయి నిలిచింది. "ఈ ప్రవాహమును దాటటం ఎట్లా?" అని చాంటిక్లీర్ ప్రశ్నించింది. అప్పుడొక

గడ్డిపరక ఇలా అంది: "నేను ప్రవాహం మీద పరుంటాను. బండిని నా మీద పోనివ్వండి." ఎలుకలు ఆ విధంగా బండిని పోనిస్తున్నాయి. గడ్డిపరక జారి ప్రవాహంలో పడింది. దానితో బాటు ఎలుకలు కూడా పడిపోయాయి, అప్పుడింక చేసేది ఏమిటి? అంతలో అచ్చటకు ఒక పెద్దకర్ర దుంగ వచ్చి ఇలా అంది.

"నేను చాలా విశాలంగా ఉన్నాను. నేను ప్రవాహం మీద పరుంటాను. బండిని నా మీద పోనివ్వండి" కాని దుంగ కూడా ప్రవాహంలో మునిగిపోయింది. తర్వాత ఒక రాయి వారికి సహాయం చేయటానికి వచ్చింది. ఈ సారికి మాత్రం చాంటిక్లీర్ తన భార్య శవంతో అవలిగట్టు చేరుకుంది. కాని దురదృష్ట వశాన బండిలో వెనుక కూర్చుండియున్న మృగములన్నీ ప్రవాహంలో పడి మునిగిపోయాయి.

చాంటిక్లీర్ తన భార్యను పాతిపెట్టటానికి ఒక గొయ్యి తవ్వింది. శవమును అందులో పాతిపెట్టింది. పైన ఒక చిన్న [illegible] ఏర్పరచింది. అది అక్కడనే మరణించిన తన భార్య కోసం [illegible] ఏడువ సాగింది. కొన్ని నాళ్ళకు అదె మరణించింది. ఆ విధంగా అన్నీ మరణించాయి.

# ఏమిటో కోరిక

ఒక గ్రామంలో ఒక గృహయజమానునకు ఇద్దరు కొడుకులున్నారు. వారిలో పెద్దవాడు సారదృష్టి, తెలివి తేటలు కలవాడు. ఏ పని చేయటానికయినా సామర్థ్యం కల వాడు. చిన్నవాడు మాత్రం వట్టి మొద్దు. అతనికి ఏ విష యమూ అర్థమయ్యేది కాదు. అర్థం చేసుకోటానికి ప్రయత్న మయినా చేసేవాడు కాడు. అతడు తండ్రికి భారమవుతాడని అందరూ అంటుండేవారు, ఏ పని అయినా చేయవలసి వచ్చి నపుడు తండ్రి పెద్దవానికే కబురంపుతుండేవాడు. అయినా చీకటిపడిన తర్వాత స్మశానం వైపునుంచి గాని మరి ఏ ఏకాంత ప్రదేశం నుంచిగాని పోవలసి వచ్చినపుడు పెద్ద వాడు భయపడి ఇలా అంటుండేవాడు: "వద్దు! వద్దు! నేన క్కడకు వెళ్ళలేను, నాకు వణుకు పుడుతుంది." వణుకుట అంటే ఏమిటో చిన్నవానికి అర్థమయ్యేది కాదు. శీతా కాలంలో సాయంకాలమందు ఇంటిలోనివారు కుంపటి వద్ద కూర్చుండి భయం పుట్టించే కథలు చెప్పుకుంటూ ఉండేవారు ఆ కథలు వింటున్న వారిలో కొందరు "మాకు వణుకుపుడు తోంది." అని అంటూవుండేవారు. చిన్నవాడు ఒక మూల కూర్చుండి అందరూ చెప్పుకుంటున్న మాటలు వింటుండే

వాడు. కాని ఆతనికి వణుకుట అంటే ఏమిటో ఏ మాత్రం అర్థంఅయ్యేది కాదు.

ఒక రోజున తండ్రి చిన్నవానితో ఇలా అన్నాడు: "మూల కూర్చున్న కుర్రవాడా! నేను చెప్పే విషయం జాగ్రత్తగా విను. నీవు పొడుగ్గా, బలిష్ఠంగా ఉన్నావు, కాని నీకు భోజనం సంపాదించి పెట్టుపని నేర్చుకోలేదు. నీ సోదరుడు ఎలా పనిచేస్తున్నాడో చూడు." అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "అవును నాన్నా! నేను ఏదయినా పని నేర్చుకోటానికి సిద్ధంగా ఉన్నాను. వీలయితే నేనువణుకుట నేర్చుకో దలచాను. వణుకుట అంటే ఏమిటో నాకేమీ అర్థంకావటం లేదు." చిన్నవాని మాటలు విన్న పెద్దవాడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "ఇతడు వట్టి వెఱ్ఱిబాగులవాడు! ఇతడు ఎన్నటూ ఏ పనీ చేయలేడు." తండ్రి నిట్టూర్పు పుచ్చి చిన్న కొడుకుతో ఇలా అన్నాడు: "నీవు వణకటం నేర్చుకోవచ్చు, కాని అందువలన నిన్ను నీవు పోషించుకోలేవు."

ఈ సంభాషణ జరిగిన కొద్ది కాలానికి ఒక చర్చి ఉద్యోగి వారి గృహామునకు వచ్చాడు. తండ్రి ఆ చర్చి ఉద్యోగికి తన కుమారుని అవివేకమును గూర్చియు, బుద్ధి మాంద్యమును గూర్చియు ఉదాహరణ పూర్వకంగా, సవిస్తరంగా తెలిపాడు. అతడు ఇంకా ఇలా అన్నాడు: "తనన్ను పోషించుకునే మార్గం నేర్చుకోమని నేను చెప్పగా వణకటం నేర్చుకోదలచుకున్నానని అతడు నాతో అన్నాడు. ఆ మాటలను విన్న చర్చి ఉద్యోగి ఇలా అన్నాడు: "అంతేనా! దాని

నతడు నా వద్ద నేర్చుకోనవచ్చును. అతనిని నా దగ్గరకుపంపు. నేనతనికి మెరుగు పెడ్తాను."

చర్చి ఉద్యోగివద్ద తన కొడుకు తెలివితేటలు నేర్చుకోటానికి వీలుకలుగుతుందని తలచి తండ్రి అందుకు అంగీకరించాడు. చర్చి ఉద్యోగి చిన్న కొడుకును తనతో తీసుకుపోయాడు. గంట మ్రోగించు పనిని అప్పగించాడు.

ఒకటి రెండు రోజులు గడిచాయి. చర్చి ఉద్యోగి అర్ధరాత్రి సమయాన చిన్నవానిని నిదురనుండి లేపి యిలా అన్నాడు: "నీవిపుడు తక్షణమే చర్చిగోపురములోనికి పోయి గంటను మ్రోగించు." చర్చి ఉద్యోగి తనలో ఇలా అనుకున్నాడు. "వణుకుట అంటేయేమిటో యిప్పుడు నీవు నేర్చుకోవచ్చును." పిమ్మట అతడు రహస్యంగా చర్చి గోపురంలోకి ప్రవేశించాడు. చిన్నవాడు కూడా గోపురంలో ప్రవేశించాడు. అతడు త్రాడు పట్టుకోటానికి ప్రయత్నిస్తుండగా ఎదుట నున్న కన్నములో నుండి తెల్లని విగ్రహం కనబడసాగింది. "ఎవరక్కడ?" అని చిన్నవాడు అన్నాడు. "నా ప్రశ్నకు వెంటనే జవాబియ్యాలి. లేకపోతే వెంటనే యీ ప్రదేశం వీడిపోవాలి. ఈ అర్ధరాత్రి సమయమున నీవిక్కడ నుండవలసిన పనిలేదు." తన నొక దయ్యంగా చిన్నవాడు భావించాలని చర్చి ఉద్యోగి ఏ మాత్రం కదలలేదు. అపుడు చిన్నవాడు ఇంకా ఇలా అన్నాడు "నీకేమి కావాలి? నిజంగా మానవుడవైతే వెంటనే మాట్లాడు, లేకపోతే నిన్ను మెట్లమీదనుండి క్రిందకు త్రోయగలను." చిన్నవాడు అట్టి పని నెన్నడూ చేయలేడని భావించి చర్చి ఉద్యోగి ఏమీ

మాట్లాడలేదు. నిలబడియున్న చోటనే ఒక శిలాప్రతిమవలె నిలబడి యున్నాడు. చిన్నవాడు మళ్ళీ పిలిచాడు. కానివృథా అయింది. చిన్నవాడు కోపించి దయ్యముపైకి ఉరికి క్రిందకు త్రోశాడు. చర్చి ఉద్యోగి మెట్లపైనుండి క్రిందపడి ఒక మూలను చేరుకున్నాడు. అతడచట ప్రాణావశిష్టుడై పడి యున్నాడు. చిన్నవాడప్పుడు గంట మ్రోగించాడు. తిన్నగా ఇంటికి వెళ్ళాడు. జరిగిన విషయం ఎవ్వరికి చెప్పకుండానే నిదురింపసాగాడు.

చర్చి ఉద్యోగి భార్య తన భర్త రాకకోసం చాలా కాలం వేచియుంది. అతడు ఎంతకూ రాకపోవుటచేత అతనికి ఏదయినా అపాయం సంభవించి యుంటుందని ఆమె భావించింది. ఆమె చిన్నవాని వద్దకు పోయి అతనిని నిదుర నుండి లేపి ఇలా అంది: "మీ యజమానుడు ఎక్కడ ఉన్నాడు?" "నాకు తెలియదు. కాని ఒక విషయం జరిగింది. నేను గంట మ్రోగించటానికి వెళ్ళగా నా ఎదుట నున్న కన్నములో నుంచి ఎవ్వరో చూడసాగారు. నేను ఎన్ని సార్లు పలుకరించినా అతడు మాట్లాడలేదు. అతడొక దుర్మార్గుడని తలచి కోపించి అతనిని మెట్లమీదనుండి క్రిందకు త్రోసి వేశాను. అతడే యజమానుడయితే మన విచారానికి అంతం ఉండదు." వెంటనే చర్చి ఉద్యోగి భార్య చర్చికి పరుగెత్తింది. ఒక మూల పడియున్న భర్తను చూచింది-కాలు విరగటం చేత అతడు మూలుగుతున్నాడు. ఆ దృశ్యం భార్యకు ఎంతో విచారం కలిగించింది.

భార్య భర్తను ఇంటికి తీసుకు పోయింది. పిమ్మట ఆమె గట్టిగా కేకలు పెడుతూ చిన్నవాని తండ్రి ఇంటికి వెళ్ళింది. "మీ చిన్నకొడుకు మాకు ఎంతో హాని చేశాడు. నా భర్తను గోపురపు మెట్లమీదనుండి క్రిందకు త్రోసివేశాడు. అందుచేత నా భర్తకాలు విరిగింది. ఎందుకూ పనికిమాలిన మీ చిన్నవానిని మీ ఇంటికి తెచ్చుకోండి" అని ఆమె చిన్నవాని తండ్రితో అంది. తండ్రి భయపడ్డాడు. వెంటనే అతడు చర్చి ఉద్యోగి ఇంటికి వెళ్ళి కొడుకును కలుసుకుని అతనిని దూషింపసాగాడు. "నీవు ఇటువంటి దుర్మార్గపు పనులు చేస్తున్నావెందుకు? సైతాను నిన్ను పట్టుకొని పీడిస్తున్నాడనుకుంటాను" అని తండ్రి చిన్నకొడుకుతో అన్నాడు. "నాన్నా! నా మాట విను-ఇందులో నా తప్పు ఏమీలేదు. ఏదో తప్పుచేయబోతున్న వానివలె అతడు అర్ధరాత్రి నా ముందు నిలబడ్డాడు. అతడు ఎవ్వరో నాకు తెలియలేదు. ఎన్నిసార్లు పలకరించినా అతడు మాట్లాడలేదు. అతడు నా హెచ్చరికలను ఏ మాత్రము లెక్క చేయలేదు" అని చిన్న వాడు సమాధానం ఇచ్చాడు.

"నీ వలన నాకు కష్టాలు తప్ప ప్రయోజనం లేదు. నీవు నా ఎదుటనుండి పో. నీకు నాకు ఇంక ఎటువంటి సంబంధము లేదు." అని తండ్రి అన్నాడు. "మంచిది నేను పోకటానికి సిద్ధంగా నేయున్నాను. కాని తెల్లవారువరకు ఆగు, అప్పుడు నేను వెళ్ళిపోయి వణకటం నేర్చుకుంటాను. తద్వారా నేను నా పొట్ట పోషించుకుంటాను" అని అతడు అన్నాడు. "నీవు ఏది నేర్చుకున్నా నాకు ఒకటే. ఇవిగో ఈ ఏబది వెండినాణె

ములను తీసుకో. వీనితో నీ అదృష్టం పరీక్షించుకో. నీవు ఎవరవో, నీ తండ్రి ఎవరో, ఎవరికీ చెప్పకు. నీవు నా కొడుకువని చెప్పకోటానికి నాకు సిగ్గవుతోంది.” అని తండ్రిఅన్నాడు అపుడు చిన్నవాడు ఇలా అన్నాడు: “మంచిది నేను నీవు చెప్పినట్లు చేస్తాను, నీకు అంతకంటే ఎక్కువ ఏమీ అక్కరలేకపోతే నీవు చెప్పిన పనిని నేను సులభంగా చేయగలను.”

తెల్లవారింతర్వాత చిన్నవాడు ఏబది వెండినాణెములను జేబులో పెట్టుకుని రోడ్డుమీద నడచి పోతున్నాడు. “నేను వణకితే ఎంత బాగుంటుంది! నేను వణకితే ఎంత బాగుంటుంది!” అని అతడు అంటూ పోసాగాడు. ఆ దారిన పోతున్న ఒకడు చిన్నవాని మాటలను విన్నాడు. అతడు చిన్నవానికి ఉరిమానును చూపుతూ ఇలా అన్నాడు: “అల్లదిగో! ఆ చెట్టును చూడు-అచ్చట ఏడుగురు త్రాళ్ళు పేనువాని కుమార్తెను వివాహం చేసుకోదలచి ఎగరటం నేర్చుకుంటున్నారు, నీవు ఆ చెట్టు క్రింద కూర్చో. రాత్రి వరకు వేచియుండు. అప్పుడు నీవు వణకుతావు. ఆ మాటలు విన్న చిన్నవాడు ఇలా అనుకున్నాడు: ”చేయవలసినది అంతేకదా! అది చాలా సులభమయిన పని, యింత సులభంగా నేను వణకటం నేర్చుకోగలిగితే నీకు ఏబది వెండి నాణెములు ఇస్తాను, నీవు రేపు పెందలకడ రమ్ము.”

చిన్నవాడు ఉరిమాను క్రిందకు వెళ్ళి సాయంకాలం వరకు వేచియున్నాడు. మంచు కురుస్తూ ఉండటంచేత అతడు మంట వేసుకొని చలిని పోగొట్టుకొన సాగాడు. అర్ధ రాత్రి

అయ్యేసరికి అపరిమితమయిన చల్లని గాలులు వీస్తుండటం వలన, మంట నిరుపయోగమయింది. అప్పుడు అతడు యిలా అనుకున్నాడు: "నేను మంటవద్ద కూర్చుండి గడ్డగట్టుకు పోవడానికి సిద్ధంగా ఉన్నాను, అట్టి సందర్భమున పైనున్నవారు గడ్డగట్టుకు పోతారనటంలో ఆశ్చర్యం ఏమీలేదు" అతడు వారిపట్ల దయతలచి దగ్గరనే యున్న నిచ్చెన సహాయంతో పైకెక్కి త్రాళ్ళకు వ్రేలాడగట్టబడియున్న ఏడుగురినీ క్రిందకు దింపాడు. అప్పుడతడు మంటను రగుల్కొల్పి ఏడుగురినీ మంటచుట్టూ కూర్చుండబెట్టాడు. వారు అతడు యెలా కూర్చుండబెడితే అలాగే కూర్చున్నారు గాని కదలటం లేదు. అందువలన వారి బట్టలు కాలటానికి సిద్ధంగా ఉన్నాయి. అప్పుడు అతడు ఇలా అన్నాడు: "జాగ్రత్త పడండి! లేకపోతే ఇదివరకువలె చెట్టుకు వ్రేలాడతీస్తాను." వారి [illegible] కాలిపోసాగాయి. అప్పుడు అతడు అపరిమితమయిన [illegible] ఇలా అన్నాడు: "మీ జాగ్రత్త మీరు [illegible] పోతే మీకు నేను చేయగల సహాయం ఏదీ లేదు. మీతో పాటు నేనుకూడా కాలి బాధపడను." అతడలా అని ఏడుగురిని ఇదివరకు వలెనే చెట్టుకు వ్రేలాడగట్టాడు. తర్వాత అతడు మంట ప్రక్కనే పరుండి గాఢంగా నిదురపోసాగాడు.

మరునాటి ఉదయమున ఏబది వెండినాణెములను తీసుకోవాలను తలంపుతో అతనికి ఉపాయం చెప్పిన మనుష్యుడు వచ్చాడు. అతడు చిన్నవానితో ఇలా అన్నాడు: "ఇప్పుడు నీకు వణకటం అంటే ఏమిటో అర్థమైందా?" కాని చిన్నవాడు ఇలా అన్నాడు: "లేదు! నాకు ఎలా అర్థం అవుతుంది?

ఆ పైనున్నవారు నోరు విప్పి మాట్లాడరు, వారు ఒట్టి మూర్ఖులు. పైనుండి తీసుకొని వచ్చి మంటవద్ద కూర్చుండ బెట్టగా తమ బట్టలను కాల్చుకోటానికి సిద్ధపడ్డారు." ఆ మాటలను వినగానే ఆ మనుజునకు అంతా అర్థమైంది. "ఇట్టి వానిని నే నెన్నడూ నా జీవితములో చూచియుండలేదు." అని అతడు అనుకున్నాడు. చిన్నవాని వద్దనుండి ఏబది వెండి నాణెములు సంపాదించటం దుర్ఘటమని యెంచి అతడు తన దారిని పోయాడు.

చిన్నవాడు మరల ప్రయాణమై పోసాగాడు. అతడు ఎప్పటివలె "నేను వణికినా బాగుండును! నేను వణికినా బాగుండును!" అని గట్టిగా అనుకోసాగాడు. అతని వెనుకనే వస్తున్న బండివాడొకడు ఆ మాటలు విని "నీవు ఎవరవు?" అని ప్రశ్నించాడు. "నాకు తెలియదు" అని చిన్నవాడు సమాధానం యిచ్చాడు. "నీ తండ్రి ఎవ్వరు?" అని బండి వాడు ప్రశ్నించాడు. "నీకు చెప్పరాదు?" అని చిన్నవాడు చెప్పాడు. "మరి గొణుగుతున్నా వెందుకు?" అని బండి వాడు అన్నాడు. "నేను వణకటం నేర్చుకోవాలనుకుంటు న్నాను. నాకు దానిని నాకు నేర్పేవా రెవ్వరూ కనబడటం లేదు." అని చిన్నవాడు అనగా బండితోలువాడు యిలా అన్నాడు: "అట్టి తెలివితక్కువ మాటలు మాట్లాడకు. నాతోరా నీకు ఆశ్రయం ఇస్తాను." ఇద్దరూ కలసి ప్రయాణ మైపోయి ఒక పూట కూళ్ల ఇల్లు చేరుకున్నారు. లోపలకు పోయిన తరువాత చూటా చిన్నవాడు ఎప్పటివలె అన సాగాడు. ఇంటి యజమానుడు ఆమాటలు విని నవ్వుకుని

చిన్నవానితో ఇలా అన్నాడు: "నీవు వణకటం నేర్చుకో వలిస్తే నీ కిచ్చట మంచి అవకాశం ఉంది: ఆమాటలు విన్న యజమానురాలు ఇలా అంది: "అలామాట్లాడకండి ఇదివరకే అనేకమంది తమ్మ ప్రాణములు పోగొట్టుకున్నారు. ఈ కుర్ర వాడు కూడా అలాగే మరణించటం చాలా విచారింపదగు విషయం" భార్యా భర్తల మాటలు విన్న చిన్నవాడు ఇలా అన్నాడు:" అది అంత కష్టమైనదైతే నేను తప్పక నేర్చు కోవాలి నేను అందుకే ఇల్లు వదలిపెట్టి సంచారం చేస్తు న్నాను. ఇంటి యజమానుడు ఏమి మాట్లాడలేదు.

తనకు ఉపాయం చెప్పవలసిందని చిన్నవాడు యజ మానుని శతవిధాల పోరాడు. కడకు విసిగి యజమానుడు ఇలా అన్నాడు: "ఇచ్చటకు కొద్దిదూరంలోనే మంత్ర బద్ధ మైన దుర్గం ఒకటి వుంది. అందులో ఎవరయినా వరసగా మూడు రాత్రులు గడిపితే వణకటం అంటేయేమిటో అర్థం చేసుకోవచ్చును. ఈ సాహస కృత్యం చేసిన వానికి తన కూతురునిచ్చి వివాహం చేస్తానని వాగ్దానం చేసియున్నారు. రాజకుమారి భూలోక సుందరి. ఆమె అందమునకు సాటి ఎవ్వరూ లేరని నిశ్చయంగా చెప్పవచ్చును. అదీగాక ఆ దుర్గంలో పయ్యాలచే రక్షింపబడుతున్న రకరకాల నిధులు న్నాయి. మూడురోజులు నీవా దుర్గంలో నివసించగానే దయ్యములు ఆ నిధులను వదలిపోతాయి. అప్పుడా నిధులన్నీ నీ వశం అవుతాయి. అనేకులు రాకుమారిని వివాహం చేసు కొని నిధులను వశం చేసుకోవాలనే ఉద్దేశంతో దుర్గంలో ప్రవేశించారు. కాని ఒక్కరూ తిరిగి బయటకు రాలేదు.

మరునాటి ఉదయాన చిన్నవాడు రాజుగారి వద్దకు పోయి వినయం ఉట్టిపడేటట్లు ఇలా అన్నాడు: "ఆర్యా! దుర్గంలో మూడు రాత్రులు గడపటానికి నాకు అనుమతి దయచేయవలసిందిగా ప్రార్థిస్తున్నాను." చిన్నవానిని చూడగానే రాజుగారికి అతనివట్ల సదాభిప్రాయం కలిగింది. రాజుగారు అతనితో ఇలా అన్నారు: "చిన్నవాడా! దుర్గంలో మూడురాత్రులు గడపటానికి నీకు అనుమతి యిస్తున్నాను. నీవు అచ్చటకు మూడు ప్రాణంలేని వస్తువులను తీసుకపోవచ్చును." "మంచిది. నేను దుర్గంలోనికొక నిప్పు కుంపటిని; పీపాలు చేయువాడుపయోగించు బల్లనొకదానిని, తరిమెన యంత్రము నొకదానిని పట్టుకు పోతాను" అని చిన్నవాడు అన్నాడు. రాజుగారి ఆజ్ఞపై ఆ మూడు వస్తువులు పగలే దుర్గములోనికి తీసుకొని పోబడ్డాయి.

చీకటిపడిన తరువాత చిన్నవాడు దుర్గములోనే ప్రవేశించాడు. అతడు కుంపటిలో మంట రగుల్కొల్పి, బల్లను కుంపటి ప్రక్కనుంచి, తరిమెన యంత్రంపై కూర్చున్నాడు: పిమ్మట అతడు ఇలా అన్నాడు: "నేను వణికితే ఎంత బాగుంటుంది! దానిని నేనుఇచ్చటగూడా నేర్చుకోలేను." అర్ధరాత్రి అయింది. అంత చిన్నవాడు కుంపటిలోని నిప్పురగుల్కొల్ప సాగాడు. అంతలో అతనికి ఒక మూలనుండి వస్తున్న యీ మాటలు వినబడ్డాయి, "ఓ మానవుడా! మేముచలిబాధను సహింపలేకున్నాము." అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "మాటలతో పనిఏముంది? ఇచ్చటకు వచ్చి నిప్పు కుంపటి

వద్ద కూర్చోండి. చలిబాధను పోగొట్టుకోండి." అతడా మాటలను పూర్తిగా అన్నాడో లేదో రెండు పెద్ద నల్ల పిల్లులు ఒక మూలనుండి కుంపటి పద్దకు దుమికిచెరొకవైపున కూర్చుండి భీతిగొల్పు కన్నులతో భయంకరముగా చిన్న వానిని చూడసాగాయి. కొంతసేపు చలి కాచుకున్న తరువాత ఆ పిల్లలు చిన్నవానితో ఇలా అన్నాయి: "స్నేహితుడా! పేకాట ఆడదామా?" అపుడు చిన్నవాడు యిలా అన్నాడు: "తప్పక ఆడదాము. కాని ముందు మీ పంజాలను చూపండి." పిల్లులుతమ పంజాలను చూపాయి. అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "గోళ్ళు ఎంత పొడవుగా వున్నాయి! ముందువాటిని కత్తిరించాలి." అతడుఅన్నాడుఅని ఆ పిల్లులు మెడలు గట్టిగా పట్టుకొని బల్లమీద పెట్టి, "నేను మీ గోళ్ళను చూశాను. ఇక మీతో పేకాటఆడే ఉద్దేశం నాకు లేదు" అని అన్నాడు. అతడు అల్లా అని ఆ రెండు పిల్లులను గట్టిగామోది చంపి కిటికీలోనుండి అగడ్తలోనికి విసిరి వేశాడు.

అతడు తిరిగి కుంపటివద్ద కూర్చోటానికి ప్రయత్నిస్తుండగా నాలుగు మూలల్లో ఉన్న కన్నంలో నుంచి పిల్లులు, కుక్కలు గుంపులు గుంపులుగా బయటకు రాసాగాయి. ఒక్కొక్క దానికొక్క ఎర్రగా మండుతున్న గొలుసు వ్రేలాడు తోంది. అవి ఆ గదిలో తమ ఇష్టంవచ్చినట్లు తిరుగసాగాయి. చిన్నవాడు వాటి సాహసానికి కోపించి, "దుష్టులారా! ఇక్కడ నుండి పొండి" అని అరచి తనవద్దనున్న చాకుతో వాటిని పొడువసాగాడు. కొన్ని తప్పించు

తున్నాయి. చాలా జంతువులు మరణించాయి. వానినా చిన్న వాడు కందకంలోకి విసిరి వేశాడు.

చిన్నవాడు మళ్ళీ కుంపటి దగ్గర కూర్చుండి నిప్పు రగుల్కొల్పసాగాడు. అంతలో అతని కన్నులు మూతపడ సాగాయి. నిదురించవలెననుకోరిక గాఢం కాసాగింది. అతడు చుట్టూ కలయజూచాడు. ఒక మూల ఒక విశాలమైన పక్క కనిపించింది. చిన్నవాడు పోయి దానిమీద పరున్నాడు. అతడు కన్నులు మూసుకోటానికి సిద్ధపడుతుండగా ఆ పక్క కదల సాగింది. ఆ పక్క అతని నా దుర్గ మందంతటా త్రిప్ప సాగింది. "ఇదీ మంచిదే" అని చిన్నవాడు అనుకున్నాడు. ఆరుగుర్రాలు లాగుతున్న బండివలె ఆ పక్క తిరుగ సాగింది. ఎట్టకేలకు ఆ పక్క హఠాత్తుగా బోర్లగిలపడింది. క్రిందనున్న చిన్నవానిపైన ఒక పర్వతం ఉన్నట్లుంది. చిన్న వాడు కడు ధైర్య సాహసాలతో కష్టపడి పనిచేసి ఆ పక్క క్రిందనుండి బయటకు వచ్చాడు. "ఇక నా బదులు ఇష్టం వచ్చినవారెవ్వరైనా దీనిపై తిరుగవచ్చు" అని యని చిన్న వాడు కుంపటి వద్దకు వచ్చి తెల్లవారే వరకు గాఢంగా నిదురిస్తున్నాడు.

తెల్లవారిన తరువాత రాజు దుర్గంలో ప్రవేశించాడు క్రిందపడియున్న చిన్న వానిని చూచి అతడు మరణించాడని రాజు భావించాడు. అందుచేత అతడు ఇలా అన్నాడు. "అయ్యో పాపం! ఈ అందాల యువకుడు మరణించటం ఎంతో విచారింపదగు విషయం!" ఆ మాటలు విన్న చిన్న వాడు చెంగున గెంతి లేచాడు. రాజుతో ఇలా అన్నాడు:

"అయ్యా! మీరు అనుకొంటున్నట్లు జరుగలేదు." రాజు ఆశ్చర్యపడ్డాడు. సంతోషించాడు. రాత్రి ఎలాగడిచిందని చిన్నవాణ్ణి ప్రశ్నించాడు. అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "రాత్రి అంతా చక్కగా గడిచింది. ఇప్పటికొక రాత్రి అయింది! ఇంకా రెండు రాత్రుళ్ళు కూడా ఇలాగే గడుస్తాయి." తరువాత చిన్నవాడు పూటకూళ్ళ ఇంటికి వెళ్ళాడు. యజమానుడతడు కనబడగానే కన్నులు పెద్దవి చేసి చూచాడు. అతడు చిన్నవానితో ఇలా అన్నాడు: "నిన్ను ప్రాణాలతో తిరిగి చూడగలనని నేనెన్నడూ భావించ లేదు. సరే కాని వణకటం అంటే ఏమిటో నీకు అర్థమైందా?" "లేదు. అంతా వృథా అయింది; నాకు ఎవరైనా దాని విష యం పూర్తిగా చెబితే బాగుండును" అని చిన్నవాడు సమాధానం ఇచ్చాడు.

రెండవరాత్రి కూడ చిన్నవాడు దుర్గంలో ప్రవేశించి నిప్పు కుంపటి వద్ద కూర్చుండి, "నేను వణికితే ఎంత బాగుం డును!" అని అనుకోసాగాడు. అర్ధరాత్రి అయ్యేసరికి అతనికి గొప్ప ధ్వని వినబడసాగింది. అది క్రమ క్రమంగా సమీ పించుచున్నట్లుంది. సమీపిస్తున్న కొలది ఆ ధ్వని ఎక్కువ వుతోంది. హఠాత్తుగా ధ్వని తగ్గిపోయింది. సగం మనుష్యుడు పెద్ద కేకవేస్తూ పొగగొట్టములోనుంచి సరిగా అతని ముందు పడ్డాడు. "మిగిలిన సగం కూడా కావాలి" అని చిన్నవాడు అన్నాడు. మరల ధ్వని ప్రారంభమైంది. కొంచెం సేపైన పిదప మిగిలిన సగం కూడా పొగగొట్టంలో నుంచి క్రింద పడింది. "ఆగు. నేను కుంపటిలోని నిప్పును రగుల్కొల్పి

తాను” అని చిన్నవాడు అన్నాడు, అతడట్లని చుట్టూ చూచే సరికి రెండు భాగాలూ కలుసుకుని ఉన్నాయి. భయంకరమైన మానవుడు చిన్నవాని స్థానమున కూర్చుని యున్నాడు. “నేను కోరిందదికాదు. బల్లనాది” అని చిన్నవాడన్నాడు. అతడట్లని తన శక్తి అంతా ఉపయోగించి ఆ మనుజుని నెట్టివేసి తన స్థానంలో కూర్చున్నాడు. ఇంకను కొందరు మనుష్యులు ఒకరి తరువాత నొకరు గొట్టంలోనుంచి క్రిందకు దిగి వచ్చారు. వారివద్ద తొమ్మిది ఎముకలు, రెండు పుర్రెలు ఉన్నాయి. వారు వాటితో ఆటలాడుకో సాగారు.

చిన్నవాడు కూడా ఆ ఆటలో పాల్గొన వలెనను గాఢమగు కోరికకలవాడై వారితో ఇలా అన్నాడు: “ఓ మనుష్యులారా! నేను కూడా మీ ఆటలో పాల్గోనా?” అప్పుడు వారిలో ఒకడు ఇలా అన్నాడు: “నీవద్ద డబ్బుంటే ఆటలో పాల్గోవచ్చును.” “చాలా ఉంది. కాని మీ బంతులు గుండ్రంగా లేవు” అని చిన్నవాడు అన్నాడు. అతడట్లని పుర్రెలను తీసుకొని తరిమెన యంత్రంలో పెట్టి గుండ్రంగా చేశాడు. వాని నా మనుష్యులకు తిరిగి యిస్తూ అతడు ఇలా అన్నాడు. “ఇవన్నడవి ఇది వరకు కంటె బాగా దొర్లుతాయి కనుక మనమింక ఆట ప్రారంభిద్దాం” అందరూ ఆటలో పాల్గోసాగారు. చిన్నవాడు కొద్దిగా ధనం పోగొట్టుకున్నాడు, కాని పన్రెండు గంటలయ్యే సరికి మనుష్యులందరూ తమ వద్దనున్న వస్తువులతో బాటు అదృశ్యమయ్యారు.

మఱునాటి ఉదయమున రాజు ఎప్పటివలె చినవానిని చూడటానికి వచ్చాడు. “రాత్రి అంతా ఏమి

చేశావు?" అని చిన్న వానిని ప్రశ్నించారు. "రాత్రి అంతా ఆడాను. కొద్దిగాధనం పోగొట్టుకున్నాను" అని చిన్నవాడు సమాధానం ఇచ్చాడు. నీవు వణికావా?" అని రాజు ప్రశ్నించాడు. "వణకటమా! నిన్నరాత్రి ఎంతో సంతోషంగా కాలంగడిపాను! నేను వణుకుతే ఎంత బాగుండును.!" అని చిన్నవాడు అన్నాడు.

మూడవ నాటి రాత్రి కూడా చిన్నవాడు తన బల్లమీద కూర్చుండి విచారంతో తనలో తాను ఇలా అనుకోసాగాడు: "నేను వణికితే ఎంత బావుండును!" అంతలో అతనికి ఆరుగురు పొడుగాటి మనుష్యులు కనిపించారు. వారొక శవపేటికను మోసుకొని వస్తున్నారు. చిన్నవాడు దానిని చూచి ఒకటి రెండు రోజుల క్రితం మరణించిన తన బంధువొకడు అయ్యున్నాడని భావించాడు. అందువలననతడు. "రమ్ము! రమ్ము!" అని అరిచాడు. ఆరుగురు మనుష్యులూ శవపేటికను నేలపై పెట్టారు. చిన్నవాడు ఆ పేటిక వద్దకుపోయి మూతను తీసివేశాడు. లోపల మరణించిన మనుజులొకనిని అతడు చూచాడు. అతడా మరణించినవాని ముఖం పట్టుకుచూడగా అది మంచుగడ్డవలె, చల్లగా ఉంది. అప్పుడతడు ఇలా అన్నాడు: "ఆగు! నేను నీకు వేడితగిలేటట్లు చేస్తాను. అంతట నతడు తన చేతులను నిప్పుపై నుంచి వేడి చేసుకున్నాడు. ఆ చేతులను చచ్చిపోయినవాని ముఖం మీద పెట్టాడు. మరణించినవాని ముఖం ఎప్పటివలె చల్లగానే యుండి.

అప్పుడతడు చనిపోయినవానిని పేటికలోనుండి బయటకు తీసి కుంపటి వద్ద పరుండ బెట్టాడు. రక్తం ప్రసరింప

జేయటానికి శరీరవయవాలను గట్టిగారుద్దాడు: కాని అంతా నిరుపయోగమైంది. అప్పుడతడు వేరొక ఉపాయం ఆలోచించాడు. చిన్నవాడు చనిపోయినవానిని ఒక పక్కమీద పరుండబెట్టాడు. అతనికి బాగా కప్పాడు. తాను అతనికి తాను ప్రక్కనే పరున్నాడు. కొంచెం సేపైన పిదప చనిపోయినవాడు వెచ్చపడ్డాడు. అతడు కదల సాగాడు. అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "సోదరా! నిన్ను వెచ్చచేశాను, చూశావా?" మరణించినవాడు లేచి కూర్చుండి, "నిన్ను గొంతు పిసికి చంపుతాను!" అని అన్నాడు. ఆమాటలు విన్న చిన్నవాడు ఇలా అన్నాడు: "ఏమిటి? ఇదేనా! నువ్వు చూపించవలసిన కృతజ్ఞత! నీవు వెంటనే శవపేటికలోకి తిరిగి పోదువుగాక!" వెంటనే చిన్నవాడాతనినెత్తి శవపేటికలో పెట్టి మూత వేశాడు, వెంటనే ఆర్గురూ శవపేటికను మోసుకుంటూ ఎక్కడికో పోయారు. "నేనిక్కడ నాజీవితకాలమంతా గడచినా వణకటం అంటే ఏమిటో నాకు తెలియదు" అని చిన్నవాడు అనుకున్నాడు. అంతలో అచ్చటకు వికృతాకారము, భయంకరము పముకలవాడొకడు వచ్చాడు. అతడు ముసలివాడు; తెల్లని పొడుగాటి గడ్డం వ్రేలాడుతోంది. ఆముసలివాడు చిన్నవానితో ఇలా అన్నాడు: ఓ మానవుడా! వణకడం అంటే ఏమిటో నీవు తెల్సుకోబోతున్నావు. ఏమంటేనువ్వు త్వరలోనే మరణింపబోతున్నావు." "నేను మరణించాలంటే ముందుగా నువ్వునా అనుమతి పొందాలి" అని చిన్నవాడు అన్నాడు. కాని ఆ వికృత మానవుడు ఇలా అన్నాడు: "నీ అనుమతి పొంద

వలసిన అవసరం ఏమిలేదు. నేను నిన్ను సులభంగా చంప గలను." అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "మెల్లన మాట్లాడు. నీకెంత బలం వుందో నాకూ అంత బలముంది ఇంకా మాట్లాడితే నీకంటె ఎక్కువబలం ఉంది."

"ఆవిషయాన్ని మనం త్వరలోనే తెల్సుకోవచ్చును. నీకు నాకంటె ఎక్కువబలం కలదని రుజువు చేసుకోగలిగితే నీవు స్వేచ్ఛగా పోవచ్చును. రా మన బలబలాలు చూద్దాం అలా అని ముసలివాడు ఒక చీకటి దారిలో నుండి చిన్న వానిని ఒక కమ్మరి కొలిమి వద్దకు తీసుకు పోయాడు. అచ్చట ఒక గొడ్డలి తీసుకొని ఒక్క దెబ్బతో దాగలినొకదానిని నేలమట్టం చేశాడు. "నేను యింకా ఎక్కువగా నా బలం చూపగలను." అని చిన్నవాడు అని వేరొకదాగలి వద్దకు పోయాడు. జరుగనున్న దానిని చూడటానికి ముదుసలి దాగలివద్ద నిలబడ్డాడు. అతని గడ్డం పొడుగ్గా వ్రేలాడు తోంది. అపుడు చిన్నవాడు గొడ్డలి తీసుకొని ఒక్క దెబ్బతో దాగలిని రెండుగా చీల్చి ముదుసలి పొడుగాటి గడ్డమును దానికి కట్టివేశాడు. "నీవిప్పుడునా చేతిలో ఉన్నావు. నీకింక మరణమే శరణ్యం" అని చిన్నవాడు అన్నాడు. అతడొక ఇనుపదండం తీసుకొని ముదుసలిని గట్టిగా కొట్టసాగాడు. ముదుసలి ఏడుస్తూ ఇలా అన్నాడు: "నన్నింకరక్షించు. ఇక కొట్టవద్దు నీకు అపరిమితంగా ధనసహాయం చేస్తా.

చిన్నవాడు దయతలచి ముసలి వానినింక కొట్టటం మాని అతనికి స్వేచ్ఛను ప్రసాదించాడు. ముదుసలి చిన్న

వానిని తిరిగి దుర్గంలోకి తీసుకుపోయాడు. అతడు చిన్న వాని కొక నేల మాళిగను చూపాడు. అందులో బంగారంతో నిండిన మూడు పేటికలున్నాయి. ముదుసలి చిన్నవానితో ఇలా అన్నాడు. "నీవీ పేటికలను తీసుకుపో. ఒకదానిని బీదల కియ్యి. రెండో దానిని రాజుకియ్యి. మూడోదానిని నువ్వు తీసుకో" అప్పుడు సరిగా పన్నెండు గంటలయింది. వెంటనే ముదుసలి అదృశ్యమయ్యాడు. చిన్నవాడు అంధకారంలో మునిగియుండి ఇలా అనుకున్నాడు. "నేను త్వరలోనే ఇక్కడ నుండి బయటకుపోయే మార్గం కనుక్కోగలను." అతడుతడుము కుంటూ పోయి మొదట కూర్చున్నగదిని చేరుకున్నాడు. అచటనతడు తెల్లవారే వరకు కుంపటివద్ద పడున్నాడు.

తెల్లవారిన తరువాత రాజు వచ్చాడు. "రాత్రి ఏమి జరిగింది?" అని ప్రశ్నించాడు. "వణకటం అంటే ఏమిటో నాకు తెలియలేదు. నేను బంధువునొకనిని చూచాను. పొడి వైన గడ్డంకల ముదుసలి నొకనిని చూచాను. అతడు నాకు సువర్ణ పేటికలున్న నేల మాళిగను చూపినాడు. కాని వణకటం అంటే ఏమిటో చెప్పలేదు." అప్పుడు రాజు చిన్నవాని చేయిపట్టుకొని, "నీవీ దుర్గమును దయ్యం బారినుండి తప్పించావు. నీవు నా కూతురును పెండ్లి చేసుకోవాలి" అని అన్నాడు. అపుడు చిన్నవాడు ఇలా అన్నాడు. "ఆ విషయం మంచిదే, కాని నేను ఎన్నటికీ వణకటం నేర్చుకోలేనా?"

చిన్నవాడు రాజకుమారిని వివాహం చేసుకున్నాడు. దంపతులిరువురు సుఖంగా కాలం గడప సాగారు. అయినా అతడు, "నేను వణుకుతే ఎంత బాగుండును!" అని పలు

మార్లు అనుంటూ ఉండేవాడు. ఈ విషయం అతని భార్యకు చిరాకు కలుగజేయ సాగింది. అంత ఒక పనిమనిషి ఆమెతో ఇలా అంది: "మీ అనుమతితో మీభర్తకు వణకటంఅంటే ఏమిటో తెలియజేస్తాను." ఆ పనిమనిషి తన యజమానురాలి అనుజ్ఞను పొంది తోటలో ప్రవహిస్తున్న ప్రవాహం వద్దకు వెళ్ళింది. ఒక తొట్టిని చిన్న చేపలతో నింపింది. ఆ తొట్టిని తన యజమానురాలికిచ్చింది. ఆరాత్రి చిన్నవాడు నిదురిస్తున్నాడు. అప్పుడతని భార్య, భర్త కప్పుకొనియున్న దుప్పటిని తీసివేసి, తొట్టిని అతనిపై బోర్లించింది. చేపలతని మీద తిరుగుతూ తడిచేయ సాగాయి. అపుడు చిన్నవాడు ఉలికిపడి లేచి, "ఓ భార్యా రత్నమా! నేనిప్పుడు ఎందుకు ఇలా వణుకుతున్నాను?" ఇప్పుడు నాకు వణకటం అంటే ఏమిటో అర్థమైంది." ఆహా! ఏమి కోరిక! చివరకు తీరింది!

# పాఠం నేర్పిన పెండ్లి కొడుకు

ఒక ఊర్లో ఒక రాజు వున్నాడు. అతనికి చాలా అందమైన కూతురుంది. ఆమె చాలా గర్వి. తనకంటే అంద మైన వారెవ్వరూ లేరని విర్రవీగుతుండేది. ఆమెకు యుక్త వయస్సు వచ్చింది. ఆమెను పెండ్లి చేసుకోటానికి పలువురు వచ్చారు. కాని వారిలో ఆమెకు ఒక్కడూ నచ్చలేదు.ఆమె అందరినీ హేళన చేసింది.

ఒక రోజున ఆ రోజు ఒక గొప్ప విందు చేశాడు. అతడా విందుకు తన కూతురును పెండ్లి చేసుకోదలచిన రాకుమారుల నందరనూ ఆహ్వానించాడు. వారు తమ తమ అంతస్తుల ప్రకారం వరుసగా కూర్చున్నారు.

రాకుమారి వారి ముందుగా పోతూ ఒక్కొక్కరిని పరీక్షింపసాగింది. ఆమె ఆక్షేపించని రాకుమారుడు ఒక్కడు లేడు. మొదటివాడు చాలా లావుగా వున్నాడు. "అతడొక తొట్టిలా గుండ్రంగా ఉన్నాడు" అని రాకుమారి అతనిని ఆక్షేపించింది. రెండోవాడు చాలా పొడవుగా వున్నాడు

"తాడిచెట్టులా వున్నాడు" అని రాకుమారి అతనిని వెక్కిరించింది. మూడోవాడు చాలా పొట్టిగా వున్నాడు. "అతడు రుబ్బురోలులా వున్నాడు" అని రాకుమారి అతనిని అవహేళనచేసింది. నాలుగోవాడు పాలిపోయి యున్నాడు. "వట్టి తెల్ల మొగం" అని ఆమె అతనిని పిలిచింది. ఆరోవాడునిటారుగా లేచాడు. "వంగిన గడబొంగు" అని ఆమె అతనిని హాస్యమాడింది. ఆవిధంగా ఆమె ప్రతివానిని వెక్కిరించింది ఆమె అందరికంటే యెక్కువగా ఒకనిని ఆక్షేపించింది. "అతనిని చూడండి. గడ్డం ఎంత అసహ్యంగా వుందో! అతని పేరు గ్రిస్లీబియర్డు! [అసహ్యకరమగు గడ్డం కలవాడు] అది అతని సార్థకనామం."

ఆ మాటలన్నీ విని రాజు మిగుల కోపించాడు. అతడు తన కూతురుకు బుద్ధిచెప్పదలచి యిలా శపథం చేశాడు: "ఇక నా యింటికి మొట్టమొదటగా వచ్చే బిచ్చగానికి నా కూతురునిచ్చి వివాహం చేస్తాను."

రెండురోజుల తర్వాత ఒక సంగీత పాటకుడు రాజభవనం వద్దకు వచ్చి కిటికీ క్రింద నిలబడి పాడుతూ బిచ్చం అడుగసాగాడు. రాజు అతని పాటలు, మాటలు విన్నాడు. "వెంటనే అతనిని లోనికి ప్రవేశపెట్టండి" అని రాజు సేవకులకు ఆజ్ఞాపించాడు. సేవకులు ఆ బిచ్చగానిని రాజువద్దకు తీసుకువచ్చారు. అతడు చూడటానికి చాలా అసహ్యంగా వున్నాడు. అప్పటకు రాకుమారి కూడా వచ్చింది. బిచ్చగాడు వారిముందు పాటలు పాడి తనకున్న ఒక కోరికను తీర్చాలని రాజును కోరాడు. రాజు అతనితో ఇలాఅన్నాడు:

"నీవు మధురంగా పాడావు. అందుచేత నేను నా కూతురును నీ కిచ్చి పెండ్లి చెయ్యదలచుకొన్నాను." తన కా సంబంధం వద్దని కూతురు తండ్రిని బతిమాలుకుంది. కాని రాజు ఇలా అన్నాడు: "నా యింటికి మొట్టమొదట వచ్చిన బిచ్చగానికి నిన్నిచ్చి పెండ్లి చేస్తానని శపథం చేశాను. నేనందుకు వ్యతిరేకంగా ప్రవర్తించను" రాకుమారి కన్నీరు కార్చి తండ్రిని పరిపరి విధాల ప్రార్థించింది. కాని లాభంలేకపోయింది. రాజు పురోహితుని పిలిపించి పెండ్లి పూర్తిచేయించాడు. తరువాత క్రొత్తదంపతులతో ఇలా అన్నాడు: "మీరు యింకా నా యింట్లో వుండటానికి వీల్లేదు. వెంటనే వెళ్ళిపోవటానికి సిద్ధపడండి. ఇక ఏ మాత్రం ఆలస్యం చేయకూడదు."

క్రొత్తదంపతులు రాజభవనం వదిలిపెట్టి ప్రయాణం సాగించారు. తుదకు వారొక అడవి చేరుకున్నారు. "యీ అడవి ఎవరిది?" అని భార్య భర్తను ప్రశ్నించింది. "ఇది గ్రిస్లీబియర్డుకు చెందిన అడవి" అని భర్త జవాబిచ్చాడు. "నేను ఎంత దురదృష్టవంతురాలను, నేను అతనిని పెండ్లి చేసుకొని యుంటే యెంత బాగుండేది!" అని ఆ రాకుమారి నిట్టూర్పు విడిచింది. కొంతసేపైన తరువాత ఒక చక్కని మైదానం చేరుకున్నారు. "ఈ మైదానం ఎవరిది?" అని భార్య ప్రశ్నించింది. "ఇది గ్రిస్లీబియర్డుది. నీ వతనిని పెండ్లి చేసుకొనియుంటే దీనికి అధికారిణివై వుండేదానవు" అని భర్త అన్నాడు. "అతనిని పెండ్లిచేసుకోనందుకు నన్ను నేనే నిందించుకోవలసి యుంది. నేను వట్టి తెలివితక్కువ దానను" అని రాకుమారి అనుకుంది.

మరికొంతకాలం గడచిన తరువాత వారొక పెద్ద పట్టణం చేరుకున్నారు. "ఇంత చక్కని పట్టణం ఎవరిది?" అని రాకుమారి భర్తను ప్రశ్నించింది. "ఈ పట్టణంకూడ గ్రిస్లీ బియర్డుకు చెందిందే. నీ వతనిని పెండ్లి చేసుకొనియుంటే దీనికి రాణివై యుండేదానవు" అని భర్త అన్నాడు. "అయ్యో! నావంటి దురదృష్టవంతురాలు వేరొకర్తె ఈ ప్రపంచంలో లేదని భావిస్తున్నాను. నే నతనిని యెందుకు వివాహం చేసుకోలేదు" అని భార్య వేడి నిట్టూర్పులు విడిచింది. ఆ మాటలు విన్న భర్త యిలా అన్నాడు: "నాకా విషయంతో సంబంధంలేదు! నీవు యేల వేరొకనిని భర్తగా వాంఛిస్తున్నావు? నేను నీకు తగి యుండలేదా?"

కొంతసేపు గడచింతరువాత వారొక చిన్న కుటీరం చేరుకున్నారు. "చూచుటకు అసహ్యంగా నున్న యీ పందులగుడిసె యెవరిది?" అని భార్య భర్తను ప్రశ్నించింది. అప్పుడు భర్త యిలా సమాధానం యిచ్చాడు: "ఇది నీకు నాకు చెందిన భవనం. మనం ఇంకే యిందులోనే నివసించాలి." "మీ నౌకరులు యెక్కడ వున్నారు?" అని భార్య ప్రశ్నించింది. "మనకు నౌకరులతో పనియేమి వున్నది? మన యింటిలోని పని అంతా నువ్వే చేసుకోవాలి. నేను బాగా అలసిపోయాను. వెంటనే కుంపటి వెలిగించు. భోజనం తయారు చెయ్యి" అని భర్త అన్నాడు.

కుంపటి వెలిగించటంగాని, భోజనం తయారుచేయటంగాని రాకుమారికి బాగా తెలియదు. అందువలన ఆ పనులు చేయటంలో ఆమెకు భర్త సహాయం చేయవలసివచ్చింది.

వారు కొద్దిగా తిన్నతరువాత నిదురింపబోయారు. కాని ఇంకా తెల్లవారకముందే భర్త భార్యను లేపి యింటిపను లన్నీ చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. రాకుమారి తనకు చేతనైనట్లు చేసింది.

ఆ విధంగా రెండురోజులు గడిచాయి. అప్పటికా కుటీరంలోగల అన్ని ఆహార పదార్థాలన్ని అయిపోయాయి. అంతట భర్త భార్యతో ఇలా అన్నాడు. "సతీ! మనమిా విధంగా వున్నది తింటూ కూర్చోటం తగదు. మనం ఏద యినా పనిచేసి డబ్బు సంపాదించుకోవాలి. నీవు బుట్టలల్లటం నేర్చుకో." అతడట్లని బయటకువెళ్ళి బుట్టలల్లటానికి కావల సిన బద్దలు మున్నగు వాటిని తెచ్చిఇచ్చాడు. భార్య బుట్టలు అల్లసాగింది. కాని ఆమె చేతి వ్రేళ్ళు కందిపోసాగాయి. అంతట భర్త భార్యతో యిలా అన్నాడు. "నీకు ఏపని సరి పడదని తోస్తున్నది. నూలు వడకటం చేతవుతుందేమో ప్రయత్నించి చూడు. నీవాపని బాగా చేయగలవని తలు స్తాను." అపుడు రాకుమారి ఒకచోట కూర్చుని నూలు వడ కటం ప్రారంభించింది. కాని కొంతసేపయ్యేసరికి దారాలు ఆమె చేతి వ్రేళ్ళను కోసివేయసాగాయి. రక్తం ధారగా కారుతోంది. అప్పుడు భర్త కోపంతో ఇలా అన్నాడు. "నీవు ఎందుకూపనికిరావు. నీవేపనీ చేయలేవు! నేను ఎట్టి స్త్రీని వివాహమాడియున్నాను! అయినా నేనే ప్రయత్నించి చూస్తాను. నేను కుండల వర్తకం చేస్తాను. నీవు సంతలో నిలు బడి వాటిని అమ్ము. ఈపని నీకు చేతనవుతుందను కుంటాను." అపుడు భార్య ఇలా అంది. "అయ్యో! నాకు ఏమిపరాభవం

కలుగుతుందో! నేను సంతలో నిలబడి కుండలమ్ముతుంటే నా తండ్రి ఉద్యోగులు చూచినవ్వరా!"

బిచ్చగాడు భార్య మాటలను లెక్కచేయలేదు- "మనం ఆకలిబాధతో చావకుండా ఉండాలంటే ఇంతకంటే గత్యంతరం లేదు" అని అతడు అన్నాడు. మొట్టమొదట వ్యాపారం బాగా నడిచింది. రాకుమారివంటి అందమయిన స్త్రీ సంతలో నిలబడి కుండలు మున్నగు వస్తువులు అమ్ముతుంటే అందరూ అక్కడికే పోయి వస్తువులు కొంటున్నారు. చాలామంది వస్తువులు తమతో తీసుకుపోకుండానే వాటి ఖరీదు ఆమెకిస్తున్నారు. భార్యాభర్తలు ఆ సంపాదనపై జీవితం సాగించారు. భర్త మరల కొన్ని వస్తువులు కొనిఅమ్మకానికి తన భార్యకిచ్చాడు. భార్య వాటిని సంతలో ఒక మూల పెట్టుకొని అమ్మకానికి కూర్చుంది.

అంతలో ఒక త్రాగుబోతు సైనికుడు గుర్రంమీద అక్కడకు వచ్చి గుర్రమును కుండల దుకాణంపైగా పోనిచ్చాడు. కుండలన్నీ ముక్కలయ్యాయి. "అయ్యో! నా పని ఏమవుతుంది? నా భర్త ఏమంటాడో!" అని రాకుమారి విలపించింది. వెంటనే ఆమె ఇంటికి వెళ్ళి జరిగిన విషయ్యంఅంతా భర్తకు చెప్పింది. అపుడు అతడు ఇలా అన్నాడు: "కుండల దుకాణమును అందరూ నడిచే దారిలో పెడతావని యెవరూహిస్తారు? నీ వింత తెలివితక్కువ దానవని ఎవరికి తెలుసు? అంతా నీదే తప్పు. అయినా ఇంతలో వచ్చిననష్టం ఏమీ లేదులే. నేను రాజభవనానికి వెళ్ళి నీ కొక పని

చూచాను. నీ వచ్చుట వంటయింట పనికత్తెగా పని చేయ వచ్చును. నీ కచ్చట కావలసినంత తిండి దొరుకుతుంది."

రాకుమారి రాజభవనానికి పోయి పనికత్తెగా కుది రింది. ఆమె వంటమనిషికి పలు విధములయిన పనులలో సహా యము చేస్తోంది. ఆమె ఇంటికి కొన్ని భోజనపదార్థాలు తీసుకుపోటానికి అచ్చటి అధికారులు అనుమతించారు. భార్యా భర్తలు ఆ భోజన పదార్థాలు భుజిస్తూ జీవితం గడప సాగారు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు రాజకుమారుడు పెండ్లికై తరలిపోతున్నాడను వార్త రాకుమారికి తెలిసింది. అంత నామె ఒక కిటికీలోనుండి బయటకు చూడసాగింది. రాజకుమారుని ప్రయాణమునకు సంబంధించిన వైభవమంతా ఆమెకంట పడింది. అప్పుడామె హృదయం ఎంతో బాధపడ సాగింది. ఆమె తన దుస్థితికి ఎంతో విచారింపసాగింది. తన గర్వంవలన తన కిట్టి స్థితి వచ్చిందనే నగ్నసత్యాన్ని ఆమె గుర్తించింది. అంతలో అచ్చట సేవకులామెకు చక్కని భోజన పదార్థాలు ఇచ్చారు. ఆమె వాటిని ఒక బుట్టలో పెట్టుకొని ఇంటికి పోటానికి సిద్ధమైంది.

హఠాత్ గా ఆమె వద్దకు తళ తళ మెరుస్తున్న బంగారు దుస్తులతో ఒక రాజకుమారుడు వచ్చాడు. అతడు అందాల రాకుమారిని చూచి ఆమె చేయి పట్టుకొని తనతో నాట్యం చేయవలసిందని కోరాడు. ఆమె భయంతో వణకసాగింది. ఎందుకు? ఆమె ఎదుట నున్నది ఎవ్వరో కాడు! ఇదివర

కామెచే వెక్కిరింపబడిన గ్రిస్లీ బియర్డు! ఇప్పుడతడు ఈమెను హేళన చేస్తున్నాడా! రాకుమారుడు రాకుమారిని లోనికి తీసుకుపోసాగాడు. అప్పుడామె వద్దనున్న బుట్టలోని పదార్థాలన్నీ క్రిందపడ్డాయి. అచ్చటనున్న వారందరూ పకాలున నవ్వారు. అప్పుడామె అవమాన భారంతో క్రుంగిపోసాగింది ఆమె రాజభవనంవీడటానికి సిద్ధపడింది. గ్రిస్లీ బియర్డు ఆమెను పట్టుకొని వెనుకకు తీసుకువచ్చి, ఇలా అన్నాడు. "భయపడకు నీతో కుటీరంలో నివసించిన సంగీతపాటకుడను నేనే. నేను నిన్ను ప్రేమించాను కనుకనే అక్కడకు తీసుకువచ్చాను. నీ దుకాణం పైగా గుర్రమును పోనిచ్చిన సైనికుడను కూడా నేనే. ఇది అంతా నేను ఎందుకు చేశాను? నీ గర్వమును పోగొట్టదలచాను, నీవు నాకు చేసిన అవమానమునకు నిన్ను శిక్షింపదలచాను. ఇప్పుడంతా అయిపోయినది. నీవు తెలివి తేటలు నేర్చుకున్నావు. నీ తప్పులన్నీ సమసిపోయాయి. మన వివాహపు విందు జరుగు సమయం వచ్చింది."

అప్పుడు సేవకులు వచ్చి రాకుమారికి చాలా విలువైన చక్కని దుస్తులను ఇచ్చారు. రాకుమారి తండ్రి మున్నగు వారందరూ ఇదివరకనే అచ్చటకు వచ్చియున్నారు. వారందరూ ఆమెను అభినందించారు. అందరి ముఖాలలోను సంతోషం వెల్లివిరుస్తోంది. విందు చాలా అద్భుతంగా ఉంది. అందరూ ఆనందసాగరమున మునిగిపోయారు.

# పళ్ళెంలో పాము

పూర్వం ఒకప్పుడు ఒక దేశాన్ని ఒక రాజు పరిపాలిస్తున్నాడు. అతడు చాలా తెలివైనవాడని ప్రసిద్ధిపొందాడు. అతనికి తెలియని విషయం ఒక్కటికూడా లేదు. ఎంతో రహస్యమైన విషయాలుకూడా అతనికి తెలిసేవి. అటువంటి రాజు కొక వింతఅలవాటుండేది. ప్రతిదినమూ భోజనమైన పిదప అతిథులు తమ స్థానములకు వెళ్ళిపోయిన తర్వాత నమ్మకమయిన సేవకుడొకడు మూత వేయబడిన పళ్ళెము నొకదానిని తెచ్చి అతనికి ఇస్తుండేవాడు. ఆ పళ్ళెములో యేముందో ఇతరులెవ్వరికీ తెలియదు. సేవకులకు కూడా తెలియదు. ఏమంటే రాజు తానొంటరిగా నున్నప్పుడే పళ్ళెము మీదున్న మూతను తీస్తుండేవాడు. ఆ విధంగా కొంతకాలం గడిచింది. ఒకనాడు నమ్మకమయిన సేవకునకు ఆ పళ్ళెంలో ఏముందో తెలుసుకోవాలను కోరిక కలిగింది. అతడు ఆ కోరికను ఏ మాత్రం అణచుకోలేక పోయాడు. అందువలనఅతడా పళ్ళెమును రాజుగారివద్దకు తీసుకొని పోక, తానున్న గదిలోకి తీసుకుపోయాడు. లోపల తాళం పెట్టి ఆ పళ్ళెంమీద ఉన్న మూతను తీసివేశాడు. అందులో ఒక తెల్లని పాము మాత్రం ఉంది. అతనికా పామును రుచిచూడాలను కోరిక కలిగింది. అందువలన అతడా పాములో కొంత ముక్కను

కోసి రుచి చూచాడు. అతను అలా చేశాడో లేదో అతని కొక కిటికీవద్ద ఎవ్వరో రహస్యంగా మాట్లాడుకొంటున్నట్లు వినబడింది.

సేవకుడు కిటికీవద్దకు పోయాడు. అక్కడ కొన్ని పిచ్చుకలు మాట్లాడుకొంటున్నాయి. అవి ప్రపంచంలో తాము చూచిన విషయాలను గూర్చి ముచ్చటించుకుంటున్నాయి. పాము ముక్కను రుచి చూడటం వలన సేవకుడు పశుపక్ష్యాదుల భాషను అర్థంచేసుకో గలిగాడు.

సరిగా ఆదేరోజున రాణిగారి విలువైన ఉంగరం పోయింది. రాజ భవనంలో ఎచ్చటికయినా పోటానికి అర్హత గల నమ్మకమగు సేవకుడే దానిని అపహరించి యుంటాడని రాణి అనుమానించింది. రాజు అతనికోసం కబురుపంపి ఇలా బెదిరించాడు: "రేపటి ఉదయంలోపల నీవు ఆ ఉంగరాన్ని తెచ్చియియ్యాలి. లేదా ఆ ఉంగరాన్ని దొంగిలించిన వారికి సంబంధించిన వివరములను తెలుపాలి." తనకాసంగతి ఏమీ తెలియదని సేవకుడు పరివిధములు విన్నవించుకున్నాడు. సేవకుడు రాజుగారిసమక్షమునుండి బయటకు పంపివేయబడ్డాడు. సేవకుడు తనకుకలిగిన కష్టమునకు ఎంతో విచారింపసాగాడు. ఆ కష్టమునుండి తప్పిచుకోటం ఎలాగా అని ఆలోచింపసాగాడు. అప్పుడతడు నీటిలో తిరుగుతున్న కొన్ని బాతులను చూశాడు. అవి ఒకదానితోనొకటి సుఖంగామాట్లాడుకొంటున్నాయి. సేవకుడు వాటి మాటలను వినసాగాడు. ఒక బాతు మిగిలిన బాతులతో ఇలా అంది: "నేనీ ఉదయాన అనేక ప్రదేశాలలో తిరిగాను. రకరకములగు మంచి ఆహార

పదార్థములను తిన్నాను." అప్పుడు మరిొక బాతు యిలా అంది: "నా కడుపులో బాధ అపరిమితంగా వుంది. నేను తొందరలో రాణిగారి కిటికీ వద్దనున్న పండ్లతో బాటుగా ఒక ఉంగరమును గూడ మింగివేసినాను."

సేవకుడు వెంటనే ఆ బాతును పట్టుకున్నాడు. వంట గదిలోకి తీసుకుపోయి వంటమనిషికిచ్చి ఇలా అన్నాడు: "ఇది ఎంతో బలిసి వుంది. దీనిని చంపివేస్తే మంచిది." "అవును. దీనినిదివరకెన్నడో చంపి యుండవలసింది" అని వంటవాడు అన్నాడు. వంటవాడు బాతును చంపికోసాడు. అప్పుడు బాతు కడుపులోనున్న ఉంగరం బయట పడింది. సేవకుడు నిర్దోషి అని ఋజువయింది. అప్పుడురాజు సేవకునితో ఇలాఅన్నాడు: "నేను నీపైనఅన్యాయంగా నేరారోపణ చేసినందుకు ఎంతో విచారిస్తున్నాను. నీకు ఏమి కావాలో కోరుకో. నేను నీకు ఎటువంటి ఉద్యోగము నయినా ఇయ్యటానికి సిద్ధంగా ఉన్నాను." అప్పుడు సేవకుడు రాజుతో ఇలా అన్నాడు: "నాకు ఉద్యోగం వలదు. నాకు ఒక చక్కని గుఱ్ఱమును, కొలదిగా ధనమును ఇవ్వండి. నాకు ప్రయాణంచేసి ప్రపంచమును చూడవలెనని ఉంది." రాజు అతని కోరికను అడిగిన వెంటనే తీర్చాడు.

సేవకుడు ప్రపంచ యాత్రకు బయలుదేరాడు. అతడొకనాడు ఒక చెరువు వద్దకు వచ్చాడు. అక్కడ మూడు చేపలు నీరులేని స్థలంలో పడివున్నాయి. అవి ఇటునటు కొట్టుకొంటున్నాయి. వాటి అరపుల వలన అవి చావటానికి

సిద్ధంగా వున్నవని సేవకుడు గ్రహించాడు. దయాయయు డగు ఆ సేవకుడు ఆ చేపలను పట్టుకొని నీటిలో పడవేశాడు అవి ఆనందంతో అటునిటు కొట్టుకుంటూ ఇలా అరచాయి: "నీవు మాకుఉపకారం చేసావు. దీనినిమేము జ్ఞప్తియందుంచు కుంటాము. నీకు ప్రత్యుపకారం చేస్తాము."

సేవకుడింకను ముందుకు పయనమై పోయాడు. అప్పు డతనికి కాళ్ళవద్ద ఎవ్వరో మాట్లాడుతున్నట్లు వినబడింది. చీమల రాజు మాటలు ఆ సేవకునకు ఇలా వినబడ్డాయి: మనుష్యులు దిక్కుమాలిన జంతువులపైనెక్కి మమ్ము చంపి వేస్తున్నారు. నా ప్రజలు ఈ దయమాలిన గుర్రం క్రింద పడి నలిగి మరణిస్తున్నారు." ఆ మాటలు విన్న సేవకుడు గుర్రమును ప్రక్కకు తీశాడు. అప్పుడు చీమలరాజు యిలా అన్నాడు: "మేము నీ ఉపకారాన్ని మరచిపోం. నీ ఋణం తీర్చుకుంటాము."

అతడొక అడవిలోపడి ముందుకు సాగిపోతున్నాడు. ఆ అడవిలో ఒకచోట ఒక మాలకాకులజంట తమ పిల్లలను బయటకు త్రోసివేస్తున్నాయి. అవి పిల్లలతో ఇలా అంటు న్నాయి: "బయటకు పొండి. మీరు పెద్దవారయ్యారు. మిమ్ము లను మేము తృప్తిపరచలేం. మీ ఆహారం మీరు సంపా దించుకోవాలి." ఇంకా సరిగా ఎగరలేని స్థితిలోవున్న పిల్ల కాకులు ఇలా అంటున్నాయి. "చూడండి. మేమింకా సరిగా ఎగరలేని స్థితిలోవున్నాం. ఎగరలేని మేం మా ఆహారం ఎలా సంపాదించుకోగలం? ఆకలి బాధతో మలమల మాడి మర

ణించటం తప్ప మాకు వేరే దారిలేదు." అప్పుడా సేవకుడు గుర్రముపైనుండి క్రిందకు దిగి గుర్రమును కత్తితో చంపి వేశాడు. దాని మాంసాన్ని ఆహారంగా పిల్లకాకులకు వేశాడు, అవి ఆ మాంసమును కడుపారా భుజించాయి. పిమ్మట అవి ఇలా అన్నాయి. "మేము ఎన్నడూ మీ ఉపకారం మరచిపోము. నీకు తప్పకుండా ప్రత్యుపకారం చేస్తాము.

తరువాత సేవకుడు కాలినడకను ప్రయాణించేశాడు. ఎట్టకేలకతడొక పెద్ద పట్టణం చురుకున్నాడు. ఆపట్టణంలోని వీధులన్నీ చాలా సందడిగా ఉన్నాయి. గుర్రముపై నున్న మనుష్యుడొకడు ఇలా చాటింపు వేస్తున్నాడు: "రాజుగారి అందాల కూతురుకొక వరుడు కావాలి. కాని ఆమెను పెండ్లి చేసుకొనువారు ఆమెచేయబోవు తీవ్రమైనపరీక్షలో విజయం పొందాలి. అపజయం పొందువారు తమ ప్రాణాలు కోల్పో వస్తుంది." రాజకుమారిని వివాహం చేసుకోవాలనే తలంపుతో పలువురువీవరక్తే ఆమె పరీక్షలో పాల్గొన్నారు. అపజయం పొందారు. ప్రాణాలు కోల్పోయారు. సేవకుడా విషయం పూర్తిగా తెలుసుకున్నాడు. అయినా అంత మాత్రాన అతడు నిరుత్సాహంచెందలేదు. అతడెట్లాగైనా భువన మోహినియగు రాజకుమారిని వివాహం చేసుకో దలచాడు. అందుచేత అతడు రాబోవు అపాయమును మరచి కడుధైర్యంతో రాజు వద్దకు వెళ్లి ఇలా అన్నాడు: "ప్రభూ నేను మీ రాజకుమారి చేయబోవు పరీక్షలోపాల్గొని విజయ లక్ష్మిని వరించాలని వచ్చాను."

సేవకుడు సముద్రతీరమునకు తీసుకుపోబడ్డాడు. రాజోద్యోగులతని కన్నుల ముందే ఒక ఉంగరమును సముద్రములో పడవేశారు. దానిని తీసుకొని వచ్చియిమ్మని సేవకుని కోరాడు. ఇంకా ఇలా అన్నాడు: "నీవు లోనికి దుముకాలి. ఉంగరం లేకుండా పైకి వస్తే తిరగి లోపలకు పోవాలి. అలా నీవు మరణించే వరకు చెయ్యాలి." తరువాత వారందరూ తమకతని పట్లగల సానుభూతిని తెలిపి రాజ భవనమునకు పోయారు. ఇక ముందేమి చేయవలయునాయని సేవకుడా సముద్ర తీరమున నిలబడి ఆలోచింపసాగాడు. అంతలో అతని వద్దకు హఠాత్తుగా మూడు చేపలు ఈదు కొంటూ వచ్చాయి. అవి లోగడ తనచే రక్షింపబడిన చేపలే అని సేవకుడు గ్రహించాడు. ఆచేపలు అతనిని సముద్రపుటడుగు నున్న ఉంగరమును తెచ్చి ఇచ్చాయి. అపరిమితమగు సంతోషంతో సేవకుడా ఉంగరం తీసుకుపోయి రాజుగారికి చ్చాడు.

గర్విష్ఠియగు రాజకుమారి సేవకుడు తనతో సమానమైన అంతస్తు కలవాడు కాడని తెలుసుకోవటంచేత అతనిని పెండ్లి చేసుకోటానికి ఇష్టపడలేదు. అందువలన ఆమె సేవకుని ఇంకనూ పరీక్షింపదలచింది. ఆమె తోటలోకి వెళ్లి తన స్వహస్తములతో పది బస్తాల జొన్నలను గడ్డిలో పారబోసింది. తరువాత ఆమె సేవకుతో ఇలా అంది: "రేపు సూర్యోదయం కాకముందే నీవీ జొన్నల నన్నిటినీ తిరిగి సంచులలోకి ఎత్తాలి. ఒక్క గింజయైనా బయట మిగులకూడదు." సేవకుడు తోటలో కూర్చుండి ఆ పని చేయటం

ఎలాగా అని ఆలోచించాడు. అతనికేమీ తోచలేదు. మఱునాడు తనకు మరణం తప్పదని నిశ్చయించుకున్నాడు. ఆ విచారంతో అతడు నిదురించాడు. తెల్లవారింది. అప్పుడతడు లేచి చూచేసరికి పది బస్తాలు జొన్నలతో నిండి యున్నాయి. ఆరాత్రి చీమలరాజు కొన్నివేలమంది చీమలతో అక్కడకు వచ్చాడు. ఆచీమలు అపరిమితమైన కృతజ్ఞతతో జొనసలన్నిటిని బస్తాలలోనికెత్తాయి. అంతలో రాజకుమారి తోటలోకి వచ్చింది. తాను చెప్పిన పనిని ఆసేవకుడు పూర్తి చేశాడని ఆమె గ్రహించింది. అయినా ఆమె అతనిని వివాహం చేసుకోటానికి ఇష్టపడటంలేదు.

రాజకుమారి సేవకునితో ఇలా అంది: "నీవు రెండు పరీక్షలలో విజయం సాధించావు. ఇక మూడవ పరీక్షలో కూడా విజయం సాధించాలి. నీవు జీవవృక్షమునుంచి ఒక బంగారు ఆపిలు పండును తీసుకొని రావాలి." అట్టి వృక్షం ఎక్కడ ఉందో సేవకునకు ఏమాత్రం తెలియదు. దానిని కనుగొంటానని ఆశ అతనికి అణుమాత్రమైనా లేదు. అయినా అతడు కాళ్ళలో శక్తి యున్నంత వఱకు నడిచి పోవాలని నిశ్చయించుకున్నాడు. అతడు ప్రయాణమై పోయి పోయి అనేక ప్రదేశాలలో తిరిగాడు. సాయంకాలం అయ్యేసరికి అతడొక అడవిలో ప్రవేశించాడు. బాగా అలసి ఉండుటచేత అతడొక చెట్టుక్రింద కూర్చొండి విశ్రమింపదలచాడు. హఠాత్తుగా అతనికి చెట్ల ఆకుల సవ్వడి వినిపించింది. ఆ చెట్టుపైనుండి ఒక బంగారు ఆపిలుపండు అతని ఒడిలో

పడింది. అదే సమయమున మూడు మూలకాకులు అతని వద్దకు వచ్చి వ్రాలాయి. అవి సేవకునితో ఇలా అన్నాయి: "మేము ఇది వరకు నీచే ఆకలి బాధనుండి రక్షింపబడిన పిల్ల కాకులము. నీవు బంగారు ఆపిలు పండుకోసం వెదకుచున్నావని మేము తెలుసుకున్నాము. మేము అనంత దూరాన ఉన్న జీవవృక్షం దగ్గఱకు వెళ్లి బంగారు ఆపిలుపండును నీకు తెచ్చి యిచ్చాము."

సేవకుడు ఆ అపరిమితమైన ఆనందంతో బంగారు ఆపిలు పండును తీసుకొని పయనమైపోయి రాజ భవనం చేరుకున్నాడు. ఆ పండును రాజకుమార్తెకే బహూకరించాడు. ఇక ఏవిధా మిష చెప్పటానికి వీలులేక రాజకుమార్తె ఆ సేవకుని వివాహం చేసుకుంది. నాటి నుండి భార్యా భర్తలిరువురూ సుఖంగా జీవిస్తున్నారు.

# పడుచు నక్క పెండ్లి

ఒక గ్రామంలో తొమ్మిది తోకలుగల ముసలి నక్క ఒకటి నివసిస్తోంది. అది ఒక నాడు ఇలా అనుకుంది. "నా భార్య నన్నెంతగా ప్రేమిస్తోందో, నాపట్ల దానికి భక్తి ప్రపత్తులుంటవో, లేవో తెలుసుకోవాలి" వెంటనే అది తన గదిలో ఒక బల్ల క్రింద చనిపోయినట్లు పడుకుంది.

అపుడు ముసలి నక్క భార్య తనగదిలోకి పోయి తాళం పెట్టుకుంది. ఇక ఇంటిలో పనిమనిషి పిల్లిమాత్రం వంటకాలు తయారు చేస్తూ వంట యింటిలో కుంపటి దగ్గర కూర్చున్నాయి.

ముసలి నక్క చనిపోయిందన్న వార్త గ్రామమంతటా ప్రాకింది. అప్పుడెవరో వంటగది తలుపుతట్టి ఇలా అన్నారు: "ఓ పిల్లీ! నీవు ఏమి చేస్తున్నావు? నిదురిస్తున్నావా? మేలుకొని యున్నావా? ఒక్కసారి తలుపుతీయి." పిల్లి పోయి తలుపు తీసింది. అచ్చట ఒక పడుచు నక్క ఉంది. పిల్లి దానితో ఇలా అంది: "ఓ పడుచు నక్కా! నేను నిదురించటం లేదు. నేను చక్కని ఆహారపదార్థాలు తయారు చేస్తున్నాను. నీవీ పూటకు భోజనానికి ఉంటావా?" అపుడు పడుచునక్క ఇలా అంది: "ఉండను. కాని పాపం, మీ నక్క యజమానురాలు ఏమిచేస్తోంది?" పిల్లి ఇలా జవాబిచ్చింది: "తనగదిలో ఒంట

రిగా కూర్చుంది తనకు సంప్రాప్తించిన దురదృష్టమునకు ఎంతో విచారిస్తున్నది అయ్యో, ముసలి నక్క మరణించింది గదా!" అప్పుడు పడుచునక్క ఇలా అంది: "నీవు మీయజమానురాల దగ్గరకు పోయి ఒక పడుచునక్క వచ్చిందని చెప్పు. తనను వివాహం చేసుకోగోరుతున్నానని కూడా చెప్పు."

పిల్లిపోయి యజమానురాలున్న గది తలుపు తట్టి, "లోపల మీరున్నారా?" అని అంది. "ఏమికావాలి?" అని యజమానురాలు ప్రశ్నించింది. "మిమ్ములను వివాహమాటటానికి ఒక పడుచు నక్క వచ్చింది." అని పిల్లి సమాధానం ఇచ్చింది. అప్పుడు యజమానురాలు యిలా అంది. "ఆపడుచు నక్క ఎలా వుంది. అందముగా రాజటీవితో వుందా దానికి తొమ్మిది తోకలు లేకపోతే నాకు అవసరం లేదు." "ఒక్క తోక మాత్రమే వుంది." అని పిల్లి అంది. "నాకు వద్దు" అని యజమానురాలు అంది. పిల్లిపోయి ఆ మాటలను పడుచు నక్కతో చెప్పింది. అది నిరాశతో వెళ్ళిపోయింది. తరువాత రెండు తోకలు మొదలు యెనిమిది తోకలు వరకు గల నక్కలు వచ్చాయి. యజమానురాలు వాటినన్నిటిని నిరాకరించింది.

కడకు తొమ్మిదితోకలు గల నక్క ఒకటి వచ్చింది. ఆ మాట వినగానే యజమానురాలు గంతి ఇలా అంది: "ఓ పిల్లీ! నా వివాహానికి సర్వసన్నాహాలూ చేయించు. మన స్నేహితులందరికీ కబురుపెట్టు చచ్చిన ముసలినక్కను గుంతలో పారవేయించు."

వివాహానికి సర్వసన్నాహాలూ చేయబడ్డాయి. పెండ్లికి పలువురు మిత్రులు, బంధువులు వచ్చారు. అప్పుడు ముసలి నక్క గంతిలేచి, ఒక గండ్ర గొడ్డలిని తీసుకొని, వచ్చిన వారినందరినీ బయటకు వెళ్ళగొట్టింది.

కొంతకాలమైన తరువాత ముసలినక్క నిజంగా మరణించింది. అప్పుడొక తోడేలు నక్క భార్యను కలుసుకోటానికి వచ్చింది. అది తలుపు తట్టి ఇలా అంది: "ఓ పిల్లీ! నీవు నీవు ఒంటరిగా కూర్చున్నావెందుచేత? నీవు ఏమేమి చక్కని పదార్థాలు తయారు చేస్తున్నావు?" అప్పుడు పిల్లి ఇలా అంది. "భోజనానికి రొట్టె, పాలు తయారు చేస్తు న్నాను. నీవీ పూటకు భోజనానికి కుంటావా? లేక ఒక పాత్రలో ద్రాక్షసారాయమును తీసుకొనివచ్చి ఈయనా?" అంత తోడేలు ఇలా అంది. "వలదు, వలదు. మీ యజమానురాలు ఇంటిలో ఉందా?" "ఉంది. ఆమె తన గదిలో ఒంటరిగా కూర్చుండి మరణించిన భర్త కోసం ఎంతో విచారిస్తోందని" అని పిల్లి అంది. "అయ్యో, పాపం! ఎంత కష్టం సంప్రాప్తించింది. మీ యజమానురాలు నన్ను వివాహం చేసుకునే అవకాశం ఏమైనా ఉందా?" అని తోడేలు అంది. పిల్లి తోడేలును ఒక కుర్చీమీద కూర్చుండబెట్టి వివాహ విషయం కనుక్కోటానికి యజమానురాలివద్దకు పోయింది.

పిల్లి యజమానురాలితో ఇలా అంది. "మీకోరకొక తోడేలు వచ్చి ఉంది. మిమ్ములను వివాహం చేసుకోవాలనే తలంపుతో ఉంది."

"దానికి ఎర్రని పాదాలు, పొడుగాటి మూతి ఉన్నాయా?"

"లేవు!"

"అయితే నేనా తోడేలును వివాహం చేసుకోను."

పిల్లి తన యజమానురాలి అభిప్రాయమును తోడేలుకు తెలియ జేసింది. తోడేలు నిరాశతో వెళ్ళిపోయింది. తరువాత అనేక మృగములు వచ్చాయిగాని అవి అన్నీ యజమానురాలిచే నిరాకరింపబడ్డాయి. ఎట్టకేలకు ఒక పడుచు నక్క వచ్చింది. అది యజమానురాలికి నచ్చిన విధంగా ఉంది. యజమానురాలు ఆ పడుచునక్కను పెండ్లి చేసుకోటానికి సమ్మతించింది.

చనిపోయిన ముసలినక్క బయటకు ఈడ్చి వేయబడింది. "నాకు పీడ వదిలి పోయింది" అని యజమానురాలు అనుకొంది. పిల్లి తన యజమానురాలి వివాహానికి సర్వసన్నాహాలూ చేసింది. వివాహ సమయమునకు అనేక మంది మిత్రులు వచ్చారు. పడుచునక్కకు, యజమానురాలికి అతి వైభవంగా వివాహం జరిగింది. తరువాత అందరూ చక్కని విందులో పాల్గొన్నారు. రుచికరములైన పిండివంటలను, మనోహరమగు ద్రాక్షసారాయము సేవించారు. మనోహరమగు నాట్యంలో పాల్గొన్నారు, ఆడారు. పాడారు. అందరూ సుఖంగా ఉన్నారు.

# జంతువుల కృతజ్ఞత

ఒక గ్రామంలో ఒక మనుజుడున్నాడు. ఆతడు తన వద్దనున్న ధనాన్ని చాల వరకు పోగొట్టుకున్నాడు. తరువాత నతడు ప్రపంచ యాత్రకు బయలు దేరాడు. మొట్ట మొదట ఆతడొక గ్రామంలో ప్రవేశించాడు. ఆ ఊళ్ళో కొందరు జనులు కేకలు వేసుకుంటూ అరుస్తూ అటు నిటు తిరుగు తున్నారు. "ఏమి జరిగింది?" అని అతడు వారిని ప్రశ్నించాడు. వారిలా అన్నారు. "ఇటు చూడు. మావద్దమమ్మ సంతోష పెట్టటానికి నాట్యం చేసే ఎలుక ఒకటి ఉంది. ఎంతటి మనోహర దృశ్యమో చూడు. ఎలా ఎగురుతుందో చూడు." కాని ఆ మనుజుడు ఆ ఎలుకపట్ల దయగలవాడై ఇలా అన్నాడు. "ఈ ఎలుకను వదిలి పెట్టండి. నేను మీకు కొంత ధనం ఇస్తాను." అందుకలా ఎలుకను పట్టుకొన్నవారు అంగీకరించారు. ఆ మనుజుడు వారికి కొంత ధనం ఇచ్చి ఎలుకను తీసుకొని దానిని వదిలివేశాడు. ఎలుక దగ్గరలోనున్న ఒక కన్నంలో దూరింది.

ధనమును పోగొట్టుకొన్న మనుజుడు ఇంకా ప్రయా

ణం చేసి వేరొక గ్రామం చేరుకున్నాడు. ఆ గ్రామంలో కొందరు పిల్లలు ఒక గాడిదను పట్టుకొని దానిని తమ యిష్టం వచ్చినట్లు బాధిస్తున్నారు, అది బాధ పడుతుండగా నవ్వుతూ కేరింతలు కొడుతున్నారు. అతడా. బాధాకరమైన దృశ్యం చూచాడు. అతడా గాడిదపట్ల అపరిమితమగు దయగల వాడై ఆ పిల్లలకు కొంత ధనమిచ్చి గాడిదను విడిపించాడు.

తరువాత ఆ మనుజుడు వేరొక గ్రామం చేరుకున్నాడు అచ్చట కొందరు మనుజులు నాట్యం నేర్చిన ఒక ఎలుగు బంటి చేత తమ ఇష్టంవచ్చినట్లు నాట్యం చేయిస్తున్నారు. ఏ మాత్రం విశ్రాంతి లేని ఆ ఎలుగుబంటి అపరిమితంగా బాధ పడుతోంది. ఆ మనుజుడు వారికి కొంత ధనం ఇచ్చి ఆ మృగమును విడిపించాడు. బాధ తప్పించినందుకు ఆ మృగం ఎంతో సంతోషించింది. అది ఎప్పటివలె సుఖంగా ఉంది.

అప్పటికతని వద్ద పోగొట్టుకొనగా మిగిలిన ధనమంతా ఖర్చయిపోయింది. అతనివద్ద ఇంకా చిల్లి గవ్వ అయినా లేదు. అప్పుడప్పుడు తనలో తాను ఇలా అనుకున్నాడు. "రాజు గారి ధనాగారంలో కావలసినంత ధనం ఉంది. దానినతడు ఎప్పుడూ ఉపయోగించడు, నేను ఆకలి బాధతో మరణించను! నేనా ధనములో ఇప్పుడు కొలదిగా అప్పు తీసుకొని తిరిగి ధనికుడైన తరువాత దానిని తీర్చివేస్తాను!"

అతడట్లు అనుకొని ధనాగారంలో ప్రవేశించి కొలదిగా ధనం తీసుకున్నాడు! అతడు లోపలనుండి బయటకు వస్తుండగా రక్షక భటులతనిని చూచారు! అతడొక దొంగయని

భావించారు! ఆ ఉద్దేశంతో అతనినొక న్యాయాధిపతి వద్దకు తీసుకుపోయారు! న్యాయాధిపతి అతని నేరం విచారించి ఇలా తీర్పు ఇచ్చాడు! "ఇతనినొక పెట్టెలో పెట్టి నీటిలో పడవేయాలి" రక్షకభటులు అతనినొక పెట్టెలో పెట్టారు! లోనికి గాలి ప్రవేశింపటానికి ఆ పెట్టె మూతకు కన్నములు చేయబడ్డాయి! లోపల ఒక పాత్రలో నీరు, ఒక రొట్టెముక్క కూడా ఉంచారు! పిమ్మట భటులా పెట్టెను నీటిలో పడవేశారు!

పెట్టె నీటిలో కొట్టుకుపోతుంది. లోపలనున్న మనుజుడు అపరిమితమైన విచారముతో నున్నాడు. అతనిని హఠాత్తుగా ఎవ్వరో పెట్టె తాళం తీస్తున్న సవ్వడి వినబడింది. కొంతసేపటికి పెట్టె మూత తెరుచుకుంది. అప్పుడతనికిపూర్వం సహాయం పొందిన ఎలుక కనిపించింది. పెట్టె మూతను తీసినది ఆ ఎలుకయే! అంతలో అచ్చటకు అతని సహాయం పొందిన గాడిద, ఎలుగుబంటి వచ్చి పెట్టెను ఒడ్డుకు ఈడ్చుకొని పోయాయి. అటుల అతని సహాయం పొందిన మృగములన్నీ అతనికి తిరిగి సహాయం చేసి తమ కృతజ్ఞతను ప్రకటించుకున్నాయి.

తర్వాత ఏమి చేయాలో ఎవ్వరికీ తోచలేదు. ఆ మృగములు ఒకదానితో నొకటి సంప్రదించుకొన సాగాయి. అంతలో ఒక అల వేగమునకు ఒక రాయి వచ్చి తీరముపై పడింది. అది వొక కోడిగ్రుడ్డువలె ఉంది. అప్పుడు ఎలుగుబంటి ఇలా అంది: "ఈ రాయి యిక్కడ పడటం మన అదృష్టమే అని చెప్పవచ్చును. ఇది చాలా మహిమగలరాయి

ఎవ్వారివద్ద ఉంటుందో వారి కోరికలన్నీ నెరవేరుతాయి" ఆ మాటలు వినగానే జంతువుల మిత్రుడు ఆ రాయిని తీసుకొని ఒక చక్కని భవనం, ఒక మనోహరమైన తోట, మంచి గుర్రములు కావాలని కోరుకున్నాడు. వెంటనే అవి అన్నీ సమకూర్చబడ్డాయి. అంత నతడు మనోహర భవనంలో సుఖంగా జీవించసాగాడు. అతని ఆనందానికి మితిలేదు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు కొందరు వర్తకులు ఆ దారిన పోతూ మిత్రుని మనోహర భవనం చూచి ఇలా అనుకున్నారు: "మనం ఇదివరకు ఈ దారిని ప్రయాణం చేసినపుడు ఈ ప్రదేశం అంతా ఒక ఎడారివలె ఉండేది-ఇప్పుడిచట ఎటువంటి మనోహర భవనం ఉన్నదో?" అచ్చట ఆ అద్భుత భవనం ఉండటం ఎలా తటస్థించిందో ఆ వర్తకులు తెలుసుకొన గోరారు. అందువలన వారు లోనికి పోయి మిత్రుని కలసికొని తమ సందేహం వెలిబుచ్చారు. అప్పుడు మిత్రుడు ఇలా అన్నాడు: "నేను నా స్వశక్తి ఉపయోగించి చేసిన దేమీలేదు-ఇది అంతా ఒక అద్భుతమగు రాయి మహాత్మ్యం చేత జరిగింది. "ఆ రాయి ఎట్టిదో కదా?" అని వర్తకులు తమ ఆశ్చర్యమును వెలిబుచ్చారు. మిత్రుడా వర్తకులకు తన వద్దనున్న రాయిని చూపాడు. అపుడు వర్తకులు అతనితో ఇలా అన్నారు: "మీరీ రాయిని మాకు అమ్ముతారా? మీకు మా వద్దనున్న సరకుల నన్నిటినీ ఇస్తాము." వర్తకులు తమ వద్దగల సరకులను మిత్రునకు చూపారు. ఆ వస్తువులు అతనిని బాగా ఆకర్షించాయి. తన వద్దనున్న

రాయి అటువంటి వస్తువుల నెన్నిటినో సృష్టించగలదనే వగ్న సత్యమును అతడు మరచిపోయాడు. వర్తకుల సరకులను తీసుకొని వారికి తన రాయిని ఇచ్చాడు.

మిత్రుడలా చేయగానే అతని పరిస్థితి పూర్తిగా మారిపోయింది. అతడెప్పటివలె పెట్టెలో కూర్చుండి యున్నాడు. అతని పక్క మంచినీటి పాత్ర, రొట్టె ముక్క ఉన్నాయి. పెట్టెకు తాళంకూడా వేయబడి యుంది. అంతలో అచ్చటకు ఎలుక, గాడిద, ఎలుగుబంటి కూడా వచ్చాయి. ఎలుక తాళం తీయటానికి ప్రయత్నించింది. కాని అలా చేయటం ఏ మాత్రం సాధ్యంకాక పోయింది. ఈ సారి తాళం పూర్వం కంటే బలంగా ఉంది. అపుడు ఎలుగుబంటి ఇలా అంది: "మనం ఎలాగయినా పోయినరాయిన తిరిగి సంపాదించాలి, లేకపోతే మనం ఏమి చేసినా నిరర్థకమే అవుతుంది."

ఈ లోపల వర్తకులు మనోహర భవనమును ఆక్రమించుకున్నారు. మూడు మృగములు కలసి ఆ భవనంవద్దకు పోయాయి. అపుడు ఎలుగుబంటి ఎలుకతో ఇలా అంది: "ఓ మిత్రమా! నీవు లోనికి పోయి వర్తకులు ఆ రాయిని ఎక్కడ దాచారో కనుక్కో—నీవు చాలా చిన్నదానవు. అందుచేత నిన్ను ఎవరూ చూడరు." ఎలుక ఎలుగుబంటి చెప్పినట్లు లోనికిపోయి కొంచెము సేపయిన తర్వాత తిరిగి వచ్చి ఇలా అంది: "నేను లోపలికి వెళ్ళి చూచాను, అంతా మనకువ్యతిరేకంగా ఉంది. రాయిని ఒక పట్టుదారానికి వ్రేలాడగట్టి యున్నారు. దాని కిరువైపుల రెండు భయంకరమైన పిల్లులు

కూర్చుని ఉన్నాయి.” అపుడు మిగిలిన రెండు మృగములు సంప్రదించుకొని ఎలుకతో ఇలా అన్నాయి: “నీవు మరల లోనికి పో-యజమానుడు నిదురించువరకు అచ్చట వేచి యుండు. అతడు నిదురించిన పిదప అతని ముక్కు మీద గీరు-అతని జుట్టు పట్టుకొని లాగు” ఎలుక లోపలికి పోయి రెండు మృగములు చెప్పినట్లు చేసింది. యజమానుడు కోపముతో మంచంపైనుండి క్రిందకు దుమికాడు. ముక్కు నలుపు కున్నాడు. పిమ్మట ఇలా అరచాడు: ఈ రెండుపిల్లులు వట్టి పనికిమాలినవయ్యాయి, అవి ఈ ఇంటిలో ఉండగానే ఎలుక నా ముక్కు తింటానికి సిద్ధపడింది. నా జుట్టు పీకింది” అతడట్లు అంటూ లోపలనున్న రెండు పిల్లులను బయటకు తరిమి వేశాడు.

మరునాటి రాత్రి యజమానుడు నిదురిస్తున్నపుడు ఎలుక మరల భవనంలోకి ప్రవేశించింది. అప్పుడది రాయిని వ్రేలాడగట్టిన పట్టుదారమును కొరికి వేసింది. అపుడా రాయి క్రిందపడింది. ఎలుక దానిని మెల్లగా తలుపు వద్దకుదొర్లించు కుంటూ వచ్చింది. అప్పటికది పూర్తిగా అలసి యుండటం చేత గాడిదతో ఇలా అంది: “నీవు లోనికి నీ పాదమును బెట్టి దాని సహాయమున రాయిని బయటకు తీసుకుపో.” గాడిద ఎలుక చెప్పినట్లు చేసి రాయిని బయటకు తీసింది. అంతట మూడు మృగములు రాయిని తీసుకొని నీటివద్దకు పోయాయి అప్పుడు ఎలుగుబంటి ఇలా అంది: “నేను బాగుగా ఈదగలను. గాడిద, నీవు నీ ముంగాళ్ళను నా భుజముపై పెట్టి

జాగ్రత్తగా గట్టిగా పట్టుకో. రాయిని జాగ్రత్తగా నీటిలో ఉంచుకో. ఎలుక! నీవు నా చెవిలో కూర్చో."

అంతా సవ్యంగా జరిగింది. మూడు కలసి పెట్టెవద్దకు పోసాగాయి. అప్పుడు ఎలుగుబంటి మిగిలిన వానితో ఇలా అంది: "మనము చాలా ధైర్యవంతులము కాదా? ఏమం దువు గాడిద!" కాని తెలివిగల గాడిద గట్టిగా నోరుమూసు కొని ఒక్క మాటయిననూ మాట్లాడలేదు. ఎలుగుబంటి కోపించి ఇలా అంది: "గాడిద! నీ వేల నాకు జవాబుచెప్పవు ప్రశ్నించినపుడు జవాబు చెప్పకుండుట పెద్దమనుష్యుల లక్ష ణము కాదు. నీకు గౌరవనీయులవద్ద యెలా మెలగాలో ఏ మాత్రం తెలియదనుకుంటాను" ఆ మాటలను విన్న గాడిద ఇక నోరు మూసుకుని ఉండలేక పోయింది. అందువలన అది మాట్లాడటానికి నోరు తెరిచింది. అపుడు దాని నోటిలోనున్న రాయి నీటిలో పడింది. అంత నది ఎలుగుబంటితో ఇలా అంది: "నా నోటిలో రాయి వున్నదను విషయం నీకు తెలియదా? అందువలన నేను యేమీ మాట్లాడలేదు! చివరకు నీకు సమాధానం చెప్పటానికి నోరు తెరవగా రాయి నీటిలో పడింది. ఇది అంతా నీ తప్పిదమే" అపుడు ఎలుగుబంటి యిలా అంది– "ఇక వ్యర్థ ప్రసంగం చాలించు, ప్రస్తుత కర్త వ్యం ఏమిటో ఆలోచిద్దాం"

మూడు మృగములు కలసి ఆలోచించుకొని ఒక ఉపా యం పన్నాయి! అవి నీటిలో వున్న కప్పలనన్నిటినీ పిలిచి వాటితో యిలా అన్నాయి: "మిమ్ములనందరినీ చంపి తింటా

నికి బలవంతుడైన శత్రువు ఒకడు వస్తున్నాడు. కాని మేము మీకు సహాయం చేస్తాం. నీటిలోపలనున్న రాళ్ళనన్నిటినీ తీసుకురండి. వాటితో మిమ్ము రక్షించటానికి ఒక పెద్ద గోడను నిర్మిద్దాం" ఆ మాటలను వినగానే కప్పలు ఎంతో భయపడి నీళ్ళలోనున్న రాళ్ళను పైకి తీసుకురాసాగాయి. ఎట్టకేలకు మూడుజంతువులకు కావలసిన రాయిని పయికి తీసుకొచ్చాయి. దానిని చూడగానే ఎలుగుబంటి సంతోషంతో గెంతి యిలా అంది: "ఇప్పుడు మనకోరిక తీరింది. మనకు కావలసిన వస్తువు దొరికింది" ఇక పని చేయవలసిన అవసరంలేదని చెప్పటంవలన కప్పలు తమ తమ స్థానాలకు పోయాయి.

అంతట ఆ మూడు మృగములు పెట్టెవద్దకు పోయాయి. అపుడు పెట్టెతలుపు తెరచుకుంది. అప్పటికి పెట్టెలోనున్న మిత్రుడు మంచినీటిని పూర్తిగా త్రాగి రొట్టెను తినివేశాడు. మృగములు రాయిని అతనికిఇచ్చాయి. వెంటనే అతడు తాను తిరిగి మనోహర భవనంలో వుండాలని కోరుకున్నాడు. అతడు కోరుకున్న విధంగానే జరిగింది. మూడు మృగాలూ కూడా అతనితోబాటు ఆ మనోహర భవనంలో నివసింపసాగాయి. కాలం సుఖంగా గడచి పోతోంది.

# సోదరులు-సోదరి

పూర్వం ఒకప్పుడు ఒక రాజు రాజ్య పరిపాలన చేస్తూ రాణితో సుఖంగా కాలం గడుపుతున్నాడు. ఆదంపతులకు పన్నెండుగురు కొడుకులుపుట్టారు. ఒకనాడు రాజు తన భార్యతో ఇలా అన్నాడు: "మన పదమూడో సంతానం ఆడది అయితే పన్నెండుగురు కొడుకులు మరణింపవలసిందే అప్పుడు మన కూతురే రాజ్యానికి వారసురాలు అవుతుంది" రాజు పన్నెండు శవపేటికలు తయారు చేయించాడు. వాటిని జాగ్రత్తగా ఒక మందిరంలో వుంచి ఆ మందిరానికి తాళంవేసి తాళపు చెవిని రాణికి యిచ్చాడు. తాను చెప్పిన రహస్యమును ఎవ్వరికి చెప్పవలదని కూడా చెప్పాడు. అప్పుడు రాణి ఎంతో విచారించింది. ఆరోజంతా ఆమె యెంతగానో ఏడ్చింది. తల్లితో ఎప్పుడూ వుండెడి కడపటికొడుకు బెంజమిన్ ఆశ్చర్యపడి "అమ్మా, నీవు యెందుకు దుఃఖిస్తున్నావు" అని ప్రశ్నించాడు. అప్పుడు రాణి యిలా అంది — "దానికి కారణం చెప్పేసాహసం నాకు లేదు" కొడుకు ఆ సమాధానంతో సంతృప్తిపడక పరిపరి విధాల ప్రశ్నించాడు.

అప్పుడు రాణి విసుగుచెంది పన్నెండు శవపేటికలు వున్న మందిరములోనికి బెంజమిన్‌ను తీసుకొనిపోయి శవపేటికలను చూపి యిలా అంది: "నాయనా, ఈ పన్నెండు

శవపేటికలు మీ తండ్రి ఆజ్ఞపై మీ సోదరులకోసంతయారు చేయబడ్డాయి. నాకు నీ తరువాత స్త్రీ శిశువు జన్మిస్తే నీ తండ్రి మమ్ములనందరినీ చంపిస్తాడు. ఈ శవపేటికలలో పెట్టి పూడ్చివేస్తాడు." ఆమె అలా చెపుతూ ఘోరంగా విలపించ సాగింది. బెంజమిన్ ఆమెను ఓదారుస్తూ యిలా అన్నాడు- "అమ్మా, విచారించకు. మేము ఈ అపాయమునుండితప్పించు కుంటాము. మేము ఈ రాజ్యం విడిపోతాము" ఒక క్షణం ఆలోచించిన పిదప తల్లి యిలా అంది- "మీరిలా చేయండి! నీవు నీ సోదరులతో కలసి అడవికివెళ్ళు. మీలో ఒకరు చాలా ఎత్తయిన చెట్టుపైకెక్కి ఎల్లప్పుడూ రాజభవనం వైపుకు చూస్తూ వుండండి. నాకు మరల కొడుకుపుడితే మీకు కనబడేట్లు తెల్లజెండాను ఎగురవేయిస్తాను. అపుడు మీరందరూ సుక్షితంగా రాజభవనానికి తిరిగిరావచ్చును. కూతురుపుడితే ఎర్రజెండాను ఎగురవేయిస్తాను, అపుడు మీరు మీ శక్తికొలది పరుగెత్తుకొని పొండి. భగవంతుడు మిమ్ము రక్షించుగాక! భగవంతుడు ఆ యా కాలాలలో మీకు సర్వసౌకర్యాలు సమకూర్చుగాక! ప్రతిరాత్రి మీకోసం నేను ప్రార్థిస్తాను."

పన్నెండుగురు సోదరులు తల్లి ఆశీర్వాదం పొంది అడవికి పోయారు. వారు వంతులప్రకారం ఒక ఎత్తయిన చెట్టుపైకెక్కి రాజభవనం వయిపుకు చూడసాగారు. అలా

పదకొండు రోజులు గడిచాయి. పన్నెండవ రోజున బెంజ
మిన్ వంతువచ్చింది. అప్పుడతడు రాజభవనముపై ఎగుర
వేయబడిన జెండాను చూచాడు- కాని వారు ఆశించినట్లు
తెల్లజెండా కాక ఎర్రజెండా ఎగురవేయబడింది. బెంజ
మిన్ ఆ విషయం తన అన్నలకు చెప్పాడు. అప్పుడు వారు
ఆగ్రహంతో యిలా అన్నారు. "మనమందరం ఈ ఆడ
శిశువువలన మరణించటమా, ఈ అన్యాయానికి తగిన ప్రతీ
కారం చేస్తామని మేమందరం దైవసాక్షిగా శపథంచేస్తు
న్నాము. మాకు బాలికలు కనబడితే వారి రక్తం కళ్ళ
చూస్తాం."

తరువాత ఆ సోదరులు యింకను అడవిలోపలకు
పోయారు. బాగుగా చీకటిపడిన తరువాత వారి కొకచోట
ఒక చిన్న గుడిసె కనిపించింది. అన్నలు బెంజమిన్‌తో ఇలా
అన్నారు- "నీవు మా అందరికంటే చిన్నవాడవు. కనుక నీవీ
గుడిసెలో కూర్చో. మేము పోయి ఆహారం తీసుకువస్తాము"
సోదరులా అడవిలో సులభంగా ఆహారం సంపాదించారు.
వారు కుందేళ్ళను లేళ్ళను, పావురములను పట్టుకొని బెంజ
మిన్ వద్దకు వచ్చారు. ఆహారం చక్కగా భుజించారు. ఆ
విధముగా వారా గుడిసెలో పదిసంవత్సరాలు జీవితము
గడిపారు. వారికా కాలం స్వల్పకాలం వలె వుంది.

ఈ లోపల రాకుమారి ఎదుగుతోంది. ఆమె కడు
రూపసి, దయార్ద్ర హృదయ! ఆమె కనుబొమపై బంగారు

వర్ణపు నక్షత్రం వుంది. ఒకనాడామె ఆరవేయబడిన పం
డ్రెండు చొక్కాలను చూచింది. "ఇవి యెవరివి?" అని
ఆమె తల్లిని ప్రశ్నించింది; "ఇవి నా తండ్రివి కావను
కుంటాను. ఇవి చాల చిన్నవిగ వున్నాయి" అనికూడాఆమె
అంది! బరువయిన హృదయంతో రాణి యిలాజవాబిచ్చిదిం-
"ఇవినీ పండ్రెండుగురు సోదరులకు చెందిన చొక్కాలు."
"నా అన్నలు ఎక్కడ వున్నారు? నేను ఇంతవరకు వారిని
గూర్చి వినియుండలేదు" అని రాకుమారి అంది. అప్రుడు
రాణి ఇలా అంది: "అయ్యో! వారిప్పుడు ఏమిచేస్తున్నారో
నాకు తెలియదు. ప్రపంచంలో తిరుగుతున్నారను కుంటాను."
తరువాత ఆమె కూతురును పండ్రెండు శవపేటికలు వున్న
మందిరములోకి తీసుకొనిపోయి పేటికలను చూపింది. పిమ్మట
నామె ఇలా అంది. "ఈ పండ్రెండు శవపేటికలు నీసోదరుల
కోసం తయారుచేయబడ్డాయి. కాని వారు నీవు పుట్టక
పూర్వమే ఈ భవనమును రహస్యముగా విడి పోయారు."
రాణి జరిగిన విషయం అంతా తన కూతురుకు వివరంగా
తెలిపింది. అప్రుడా రాకుమారి ఇలా అంది. "తల్లీ! నీవు
ఏమాత్రం విచారించకు. నేను వెళ్ళి నా సోదరులను వెదకి
ఇక్కడకు తీసుకు వస్తాను." రాకుమారి పండ్రెండు చొక్కా-
లను తీసుకొని రాజభవనం వీడిపోయింది. సరిగా ఆమె అన్న
లున్న అడవిలో నుండి పోవటం తటస్థించింది. ఆమె
రోజంతా ప్రయాణం చేసి సాయంకాలం ఆయ్యేసరికి
అన్నలు నివసిస్తున్న గుడిసెను చేరుకుంది. ఆమె
లోపలకు పోగా అచ్చట ఒక బాలుడు కనిపించాడు. ఆ

బాలుడామె అందమును, రాజకళను, కనుమొముపైగల నక్షత్రమును చూసి ఎంతో ఆశ్చర్య పడ్డాడు. అతడు బాలికతో ఇలా అన్నాడు: "నీవెవ్వరవు? ఎక్కడకు పోతున్నావు? ఇచ్చటకెందుకు వచ్చావు?" అప్పుడు బాలిక ఇలా అంది: "నేను రాజకుమారిని. నా పన్నెండుగురు అన్నల కోసం వెదకుతున్నాను. వారికోసం నేను ఎంతదూరమైనా, ఎన్ని రోజులయినా ప్రయాణం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను." తరువాత ఆమె తనవద్దనున్న పన్నెండు చొక్కాలను ఆ బాలునకు చూపింది. ఆ బాలుడెవ్వరో కాడు! కడపటిరాజకుమారుడగు బెంజమిన్. అతడు వెంటనే తనఎదుట నిలబడియున్న బాలిక తన సోదరి అని గ్రహించాడు. అంతనతడా బాలికతో ఇలా అన్నాడు: "నేను పరాయి వాడను కాను. నీ అన్నలలో కడపటివాడను. నా పేరు బెంజమన్." ఆ మాటలు వినగానే రాకుమారి ఆనంద బాష్పాలు రాల్చింది ఇరువురు ఒకరినొకరు గాఢంగా కౌగలించుకున్నారు.

తరువాత బెంజమిన్ తన సోదరితో ఇలా అన్నాడు: "మన ఆనందానికి ఒక అంతరాయం ఉంది. ఒక బాలిక కోసం మేము రాజ్యం వదలిపెట్టవలసి వచ్చింది. కనుక మేము కనిపించిన బాలికలందరినీ చంపటానికి తీవ్రమైనప్రతిన పూనియున్నాము." అంత నా బాలిక ఇలా అంది: "నేను సంతోషంతో మరణించటానికి సిద్ధంగా వున్నాను. నాకుకావలసినది నా పన్నెండుగురు అన్నలను రక్షించుకోటమే." అప్పుడు బెంజమిన్ ఇలా అన్నాడు: "నీవు మరణించటానికి ఏ మాత్రం వీలులేదు. మన అన్నలు వచ్చువరకు ఆ తొట్టి క్రింద దాగి

యుండు. నేను నిన్ను రక్షించటానికి తగిన ఏర్పాట్లుచేస్తాను.” అప్పుడు రాకుమారి బెంజమిన్ చెప్పినట్లు చేసింది. చీకటిపడిన తరువాత పదకొండుమంది అన్నలు వేటనుండి ఇంటికి తిరిగి వచ్చారు. పిమ్మట సోదరులందరు భోజనం చేయసాగారు.

కడపటి వానిని అన్నలిలా ప్రశ్నించారు: “ఏమైనా విశేషాలున్నాయా?” “మీకేమీ తెలియదా?” అని బెంజమిన్ ఎదురు ప్రశ్న వేశాడు. “తెలియదు” అని అన్నలు అన్నారు. “మీరడవిలో తిరిగి వచ్చారు. నేనింటివద్దనే యున్నాను. నాకు మీకంటే ఎక్కువ విషయాలు తెలియనా?” అని తమ్ముడు అన్నాడు. “చెప్పు. చెప్పు” అని సోదరులన్నారు. “నేనలాగే చెబుతాను. కాని నాకొక వాగ్దానంచేయండి. మనకు మొట్టమొదట కనిపించు బాలికను రక్షిస్తామని వాగ్దానం చేయండి” అని బెంజమిన్ అనగా అన్నలిలా అన్నారు: “సరే. అలాగే. విశేషములేమిటో త్వరగా చెప్పు.” అంతట బెంజమన్ ఇలా అన్నాడు: “అయితేసరే. వినండి. మనసోదరి ఇక్కడకు వచ్చినది.” అత డట్లని తొట్టిని పైకెత్తాడు. అందాల సుందరి రాకుమారి సోదరులకు కనిపించింది. ఆమె మనోహర రూపమును, సౌకుమార్యమును చూచి ఆనందించిన సోదరులామెపై ముద్దుల వర్షం కురిపించి గాఢంగా కౌగలించుకున్నారు.

రాజకుమారి గుడిసెలోనే యుండి బెంజమిన్‌కు సహాయం చేస్తోంది. పదకొండుగురు అన్నలు ఎప్పటివలె అడవికి పోయి కావలసిన పదార్థాలు తీసుకు వస్తున్నారు. బెంజమిన్ రాకుమారి ఇంటివద్దనేయుండి భోజనం తయారుచేస్తున్నారు!

వారింకా చుట్టు ప్రక్కలనుండి కావలసిన పదార్థాలు తెస్తున్నారు. రాజకుమారి ఇంటిని చక్కగా తీర్చిదిద్ది సోదరులకు ఎంతో సహాయపడుతోంది! అందరు సంతృప్తితో సుఖజీవనం గడుపుతున్నారు!

వారి గుడిసెకు చుట్టూ ఒక చిన్న తోటవుంది! ఆ తోటలో రకరకాల పూల మొక్కలున్నాయి! ఒకసారి మనోహరమైన లిల్లీపుష్పములు పన్నెండు పుష్పించిఎంతో మనోహరంగా వున్నాయి! రాజకుమారి ఆ పుష్పములను తన సోదరులకు ఇచ్చి వారికి ఆనందం చేకూర్చనెంచి ఆ పూలను కోసింది! ఆమె అలా చేసిన వెంటనే సోదరులంతా మాల కాకుల రూపం దాల్చి అడవిలోకి ఎగిరిపోయారు! గుడిసె, తోట మున్నగునవి అన్నీ అదృశ్యమై పోయాయి! అపరిమితమగు భయంతో ఆ చిన్నారి బాలిక తన చుట్టూ కలయ జూచింది. అప్పుడామెవద్ద ఒక ముసలమ్మ నిలబడి యుంది! ఆ ముసలమ్మ బాలికతో ఇలా అంది! "బాలికా! నీవేమి చేసావు? ఆ పన్నెండు పుష్పములను ఎందుకు కోసినావు? ఆ పుష్పములే నీసోదరులు! వారిప్పుడు శాశ్వతంగా మాలకాకి రూపం వచ్చేసింది!" అప్పుడా బాలిక కడుధయిర్యముతో ఇలా అంది! "అయ్యో! నేను ఎంత మూఢురాలను! నేను తెలియక ఈ పని చేసాను! నా సోదరులు తిరిగి తమ రూపం పొందటానికి ఉపాయం లేదా?" బాలిక ప్రశ్నకు ముసలమ్మ ఇలా సమాధానం చెప్పింది! "అందుకు ఏ ఉపాయం లేదనే చెప్పవచ్చు! ఏమంటే ఒక ఉపాయంవుంది గాని అదిచాలా కష్టతరమైనది! ఆఉపాయం చెప్పటంకూడా

వృథా అని నేను అభిప్రాయ పడుతున్నాను! నువ్వు ఏడు సంవత్సరాలవరకు మూగదానిలా వుండాలి! నీవుమాట్లాడరాదు! నవ్వరాదు! నీవీ నియమమును ఏ మాత్రం ఉల్లంఘించినా నీవింతవరకు సోదరులకు చేసిన మంచి అంతా నాశనమవుతుంది! నీ సోదరులు మరణించ వలసిందే!" అప్పుడు బాలిక తనలోతాను ఇలా అనుకుంది! "ఎలాగయినా నేను నా సోదరులను రక్షించుకుంటాను!"

రాజకుమారి ఒక ఎత్తయిన చెట్టుపైకెక్కి ఒకచోట కూర్చుంది! మాట్లాడటం గాని, నవ్వటం గాని చేయకనూలు వడక సాగింది! ఆ సమయమునకు ఒక రాజు ఆ అడవిలోకి వేటకు రావటం తటస్థించింది! ఒక వేటకుక్క రాజకుమారిని పసిగట్టి గట్టిగా అరుస్తూ చెట్టుపైకి దుముక సాగింది! ఎంత మంది వేట కాండ్రు వారించినా అది అలా చేయటం మానలేదు! కొంసేపటికి రాజుకూడాఅక్కడకు వచ్చాడు! అతడు రాజకుమారిని చూశాడు. ఆమె కనుబొమ్మలపైగల నక్షత్రపు గుర్తుకు అబ్బుర పడ్డాడు.

ఆమె అందచందములకు ముగ్ధుడయ్యాడు. తనకు భార్యగా రావలసిందని ఆమెను ప్రార్థించాడు. రాజకుమారి తల ఊపింది గాని జవాబీయలేదు. రాజు చెట్టుపైకెక్కి ఆమెను క్రిందకు తీసుకువచ్చాడు. తన గుర్రముపైకూర్చుండ బెట్టుకొని ఇంటికి తీసుకు పోయాడు.

రాజు మహా వైభవంతో రాకుమారిని వివాహంచేసుకున్నాడు. కాని ఆమె నవ్వటంగాని, మాట్లాడటం గానిచేయటము లేదు. రెండుసంవత్సరముల కాలం ఆ నూతన దంపతులు

సుఖంగా గడిపారు. అంతట రాజమాత తన కోడలిని గూర్చి చెడుగా మాట్లాడటం ప్రారంభించింది. ఆ రాజమాత ఒక నాడు రాజుతో ఇలా అంది: "నీవు పెళ్ళి చేసుకున్న యువతి కడు బీదరాలు—ఆమె ఎట్టి చెడుమార్గమున సంచరిస్తోందో ఎవ్వరికి తెలుసు? మాటలు రాని వారుకూడా నవ్వుతారు గదా! ఆమె నవ్వటంలేదు—దీన్నిబట్టి చూడగా ఆమెకు పరిశుద్ధమయిన ఆత్మ లేదని స్పష్టం అవుతుంది." రాజు మొదట తన తల్లి చెప్పిన మాటలను ఏ మాత్రం నమ్మలేదు. ఆమె మాటలను ఏ మాత్రం లెక్కచేయలేదు. రాజమాతమాత్రం తన ఆరోపణలు మానలేదు. కడకు రాజు తన తల్లి మాటలు నమ్మాడు. తన భార్యకు మరణశిక్ష విధించాడు.

రాజభవనము ముందు ఒక పెద్ద మంట రగుల్కొల్పబడింది. రాణిని ఆ మంటలో వేసి చంపాలని నిర్ణయించుకున్నారు. తాను ఇంకను ప్రేమిస్తున్న భార్యకు కలుగబోవు దుస్థితిని తలచుకొని విచారిస్తూ రాజు ఒక కిటికీవద్ద నిలబడి యున్నాడు. రాణి ఒక స్తంభమునకు కట్టివేయ బడింది. మంటలు ఆమెను చుట్టుముట్టాయి. అప్పటికా రాణి ఏడు సంవత్సరముల మూగనోము పూర్తి అయింది. గాలిలో ఒక పెద్ద ధ్వని వినబడింది. అప్పుడు పన్నెండు మాలకాకులు అచ్చటకు వచ్చి నేలపై వ్రాలాయి. వెంటనే అవి మనుష్య రూపం ధరించాయి. అచ్చట రాజకుమారి పన్నెండుగురు సోదరులు ప్రత్యక్షమయ్యారు. వారు వెంటనే మంటలుఆర్పివేసి తమ సోదరిని రక్షించుకున్నారు. ఆమెను గాఢంగా కౌగలించుకున్నారు. ఇక మాట్లాడవచ్చునని తలచి తానంతవరకు

ఎందుకు మాట్లాడలేదో, నవ్వలేదో రాణి రాజుకు వివరంగా చెప్పింది. తన కథ అంతా తెలిపింది. తన రాణిలో యెట్టి తప్పిదము లేదని తలచిన రాజు ఎంతో సంతోషించాడు. అప్పటినుండి వారిరువురు ఎట్టి దుఃఖము లేక సంతోషంతో సుఖంగా కాలం గడపసాగారు. అసూయతో క్రుగ్గుచున్న దుర్మార్గురాలగు రాజమాత మరణశిక్ష పాలయింది.

# మూడు దమ్మిడీలు

ఒక గ్రామంలో ఒక రైతు నివసిస్తున్నాడు. అతనివద్ద ఒక సేవకుడు పనిచేస్తున్నాడు. అతడు చాలా విశ్వాసపాత్రుడు. ఎప్పుడూ కష్టపడి పనిచేస్తుండేవాడు. అతడు రైతు వద్ద మూడు సంవత్సరాలు పని చేశాడుగాని జీతం ఏమీ తీసుకోలేదు. తరువాత అతనికి జీతం లేకుండా పని చేయటం ఏ మాత్రం మంచిది కాదు అని తోచింది. అందుచేత అతను యజమానుని వద్దకుపోయి ఇలా అన్నాడు. "అయ్యా! నేను మీవద్ద మూడు సంవత్సరాలు పనిచేశాను. నేను చేసిన పనికి తగిన జీతంఇమ్మని ప్రార్థిస్తున్నాను." యజమానుడు పట్టిపిసినిగొట్టు. సేవకునకు డబ్బు విలువ ఏమీ తెలియదని అతడు గ్రహించాడు. అందుచేత అతడు సేవకునకు మూడు దమ్మిడీలిచ్చాడు. అది చాలా గొప్ప మొత్తంగా భావించిన సేవకుడు తనలో తాను ఇలా అనుకున్నాడు: "నావద్ద ఇప్పుడు

చాలా ధనం ఉంది. నేనింక కష్టపడి పని చేయవలసిన అవస రం ఏమీ లేదు. నేను ఈ విశాల ప్రపంచంలో తిరిగి అనుభ వింప వలసిన సుఖాలన్నీ అనుభవిస్తాను.'' అతడు అలా అను కొని మూడు దమ్మిడీలు మూట గట్టుకొని పని మానివేసి విహార యాత్రకు బయలు దేరాడు.

సేవకుడు ఆడుకుంటూ పాడుకుంటూ పొలంలో తిరుగు తున్నాడు. అప్పుడతనికి ఒక మరుగుజ్జు కనిపించాడు.

"నీవింత సంతోషంగా ఉన్నావేమిటి?'' అని ప్రశ్నిం చాడు. "నా ఆరోగ్యం చాలా బాగుంది. నా వద్ద నాకు కావ లసినంత ధనం ఉంది. నేను ఎవ్వరినీ లెక్కించను. నాకు సంతోషంగాక మరెంకేమి ఉంటుంది? నావద్ద మూడు సంవ త్సరాల సంపాదన ఉంది.'' అని సేవకుడు అన్నాడు. "నీవద్ద ఎంత ధనముంది?'' అని మరుగుజ్జు ప్రశ్నించాడు. "మూడు దమ్మిడీలున్నాయి'' అని సేవకుడు చెప్పాడు. "నేను చాలా బీదవాడను. ఆ ధనం నాకియ్యి'' అని మరుగుజ్జు అడిగాడు. సేవకుడు జాలిపడి తన వద్దనున్న మూడు దమ్మిడీలు ఇచ్చి వేశాడు.

మరుగుజ్జు ఎంతో సంతోషించి ఇలా అన్నాడు: "నీవు చాలా దయగలవాడవు. అందుచేత నీకు దమ్మిడీకొకటి చొప్పున మూడు వరాలు ఇస్తాను. నీకు కావలసిన వరాలు కోరుకో.'' తన అదృష్టానికి ఎంతో సంతోషించిన సేవకుడు ఇలా అన్నాడు! "నాకు డబ్బు అక్కరలేదు. అంతకంటే

గొప్ప వరాలు కావాలి. నేను బాణం దేనిని వదిలినా అది వెంటనే క్రిందకు రావాలి. నాకొక ఫిడేలు కావాలి. నేను దానిని వాయిస్తుండగా పాటను విన్నవారందరూ నాట్యం చేస్తుండాలి.” ప్రతి ఒక్కరు నేను కోరిన దానినెల్లా ఇస్తుండాలి. మరుగుజ్జు సేవకునకు ఆ మూడు వరాలూ ఇచ్చాడు. సేవకుడు మరుగుజ్జు ఇచ్చిన విల్లమ్ములు, ఫిడేలు తీసుకొని తన దారిని వెళ్ళాడు.

సేవకుడు పూర్వం కంటె పది రెట్లు ఎక్కువ సంతోషంతో ప్రయాణం చేస్తున్నాడు. అనతి కాలంలోనే అతని కొక యూదుడు ఎదురు పడ్డాడు. వారిద్దరకూ సమీపాన ఒక ఎత్తయిన చెట్టు ఉంది. ఆ చెట్టుమీద ఒక పక్షి ఎంతో మధురాతి మధురంగా పాడుతోంది. ఆ పాటను విన్న యూదుడు ఇలా అన్నాడు. “ఆహా! ఆ పక్షి చెవులకు ఇంపుగా పాడుతోంది ఎవ్వరైనా దానిని నాకిస్తే వారికి ఎంత ధనమైనా ఇస్తాను.” ఆ మాటలను విన్న సేవకుడిలా అన్నాడు: “నీ కోరిక అదేనా? నేను నీకా పక్షినిస్తాను.” అతడా విధంగా అని ఆ పక్షిపై విల్లమ్ములను ప్రయోగించాడు. అప్పుడా పక్షి చెట్టుకిందనున్న పొదలో పడింది. ఆ పక్షిని తీసుకునే ఉద్దేశంతో యూదుడు ఆ పొదలో దూరాడు. అతడు పొద మధ్యనికు పోగానే సేవకుడు ఫిడేలు వాయింపసాగాడు. వెంటనే యూదుడు నాట్యం చేస్తూ గెంతసాగాడు. అతడంతకంతకు పైకిపోసాడు. అతడలా చేయటంలో దుస్తులన్నీ చిరిగి పోయాయి. ముండ్లతని శరీరానికి గుచ్చుకొని రక్తం ప్రవహింపసాగింది.

అప్పుడు యూదుడు ఇలా అనసాగాడు. "అయ్యా! ఆగు, ఆగు! ఫిడేలు వాయించకు. నా యందు దయ చూపు. నేను ఏం నేరం చేశానని నన్నిలా శిక్షిస్తున్నావు?" ఆమాటలకు సేవకుడిలా అన్నాడు: నీవు చాలామంది బీదలవద్దనుండి నిర్దయతో ధనం తీసుకున్నావు.

దాని ఫలితాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నావు." అతడింకా ఫిడేలు వాయిస్తూనే ఉన్నాడు. యూదుడు సేవకుని బతిమాలసాగాడు. చివరికతడు తన వద్దనున్న ధనాన్ని సేవకునికి ఇవ్వటానికి అంగీకరించాడు. సేవకుడు యూదునివద్దనుండి ధనం తీసుకుని తన దారిన పోయాడు.

ఈ లోపల యూదుడు పొదలోనుంచి బయటకు వచ్చాడు. తన్ను మోసగించిన వానిని శిక్షించటం ఎలాగా అని తీవ్రంగా ఆలోచించాడు. తుదకతడు ఒక న్యాయాధికారి వద్దకు పోయి ఇలా అన్నాడు. "అయ్యా! నన్నొక దుర్మార్గుడు మోసగించి నా వద్దనున్న ధనమంతా లాక్కుపోయాడు. అతనివద్ద విల్లమ్ములు, ఫిడేలు ఉన్నాయి. న్యాయాధికారి అతని మాటలు నమ్మి మోసగాడు ఎక్కడ వున్నా పట్టుకొని రావలసిందని తన ఉద్యోగులను పంపాడు. వారు పోయి పోయి సేవకుని పట్టుకొని న్యాయాధికారి వద్దకు తీసుకు వచ్చారు.

న్యాయాధికారి విచారణను ప్రారంభించాడు. యూదుడు తన కథను పూర్తిగా వివరించి చెప్పాడు. అప్పుడు

సేవకుడు ఇలా అన్నాడు: "వీడు అసత్యం పలుకుతున్నాడు, నేను ఫిడేలు వాయించినందుకు నీవా సొమ్మునిచ్చావు." న్యాయాధికారి సేవకుని మాటలు ఏ మాత్రం నమ్మలేదు. "యూదునివద్దనుండి మోసగించి బలాత్కారంగా ధనం తీసుకున్న నేరానికి నీకు ఉరిశిక్ష విధిస్తున్నాను" అని న్యాయాధికారి తీర్పు యిచ్చాడు.

సేవకుడు ఉరి తీయబడటానికి సిద్ధంగా వున్నాడు. అప్పుడాతడు న్యాయాధికారితో యిలా అన్నాడు: ప్రభూ! నా కొక్క కోరిక వుంది." "నీ ప్రాణాలు మాత్రం తీయను, మరి ఇంకే కోరికనయినా అంగీకరిస్తాను" అని న్యాయాధికారి అన్నాడు. అప్పుడు సేవకుడు ఇలా అన్నాడు: "అయ్యా! నా ప్రాణం రక్షించవలసిందని మిమ్ము కోరను, కడసారిగా ఫిడేలు వాయించుకుంటాను" అప్పుడు యూదుడిట్లు గట్టిగా అరిచాడు: "ప్రభూ! దయయుంచి ఆ కోరికను అంగీకరించకండి" కాని న్యాయాధికారి ఇలా అన్నాడు: "పాపమతడు మరణింప బోతున్నాడు. అతని కడపటి కోరికను అంగీకరింపకపోవటం ఏ మాత్రం భావ్యంకాదు. నేనాతని కోరికకుఅంగీకరిస్తున్నాను" మరుగుజ్జు ఇచ్చిన మూడోవరం ప్రకారం న్యాయాధికారి అతని కోరికను ఏ మాత్రం నిరాకరింపలేదు గదా! న్యాయాధికారి మాటలు విన్న యూదుడు యిలా అన్నాడు: "నన్ను గట్టిగా కట్టివేయండి."

అప్పుడు సేవకుడు ఫిడేలు తీసుకొని వాయింపసాగాడు న్యాయాధికారి, గుమస్తాలు. యూదుడు, ఇతర ఉద్యోగులు మొదలయినవారందరూ నాట్యంచేయసాగారు. మొదటఅలా

చేయటం చాలా హాయిగా వుంది. కాని కాలం గడచిన కొలది వారికి కష్టంగావుంది. నాట్యానికి అంతంలేనట్లు కన బడింది. అందరూ అరుస్తూ తమ్ము రక్షింపవలసిందని సేవకుని ప్రార్థింపసాగారు. న్యాయాధికారిఇలాఅన్నాడు: "మిత్రమా నీ ప్రాణాలు నీ కిచ్చి వేస్తున్నాను, నీవు యూదునివద్ద నుండి తీసుకున్న ధనం నీకే యిప్పిస్తాను దేవుని సాక్షిగా వాగ్దానం చేస్తున్నాను మమ్ము రక్షించు."

అంతట సేవకుడు ఇలా అన్నాడు: "యూదుడా! నీ విప్పుడు మాకో విషయం చెప్పు-నీవీధనం ఎక్కడనుండి సంపాదించావు?"

"నేనీ ధనం దొంగిలించానని ఒప్పుకుంటున్నాను" అని అతడు అన్నాడు.

సేవకుడు ఫిడేలు వాయించటం మానివేశాడు. అధి కారులు యూదుని చంపివేశారు. సేవకుడు తన దారిని పోయాడు.

# బీదవాడు

ఒక ఊరిలో పీవిట్ అను పేరుగల బీదరైతు ఒకడు నివసించుచున్నాడు. ఒకనాడతడు రెండు ఎద్దులతో పొలం దున్నుతున్నాడు. హఠాత్ గా ఎవ్వరో అతని పేరుపెట్టి పిలుస్తున్నట్లయింది. అతడు చుట్టూ చూశాడు. ఎవ్వరూ కనిపించలేదు. ఒక పక్షి మాత్రం "పీవిట్, పీవిట్" అని అరుస్తున్నది. అది పీవిట్ పక్షి అది ఎప్పుడూ కోయిల లాగున తన పేరు స్మరించుకుంటూ ఉంటుంది. కాని ఆ పక్షి తన్ను వెక్కిరిస్తున్నదని బీదరైతు భావించాడు. అందుకని అతడో రాయి తీసుకుని పక్షిపైకి విసిరాడు. పక్షి సురక్షితంగా ఎగిరి పోయింది. రాయి ఒక ఎద్దుమీద పడింది. వెంటనే ఆ ఎద్దు చనిపోయింది. ఇక ఒక ఎద్దుమాత్రం మిగిలిఉంది.

"ఈ ఒక్క మిగిలియున్న ఎద్దువల్ల ఉపయోగం ఏమిటి? నేను దీన్ని గూడ చంపివేస్తాను" అని అతడు అనుకున్నాడు. అలా అనుకుని అతడు రెండో ఎద్దునుగూడా చంపివేశాడు. అతడు రెండిటి చర్మాలను ఒలిచి సమీపాన ఉన్న పట్టణానికి వెళ్ళాడు. అతడా రెండు చర్మాలను అమ్మి డబ్బు సంపాదింప దలచాడు. అతడు అనతి కాలంలో తోళ్ళు పదునుచేసేవాని ఇల్లు కనుక్కొని అక్కడకు వెళ్ళాడు. తలుపు తట్టాడు. తలుపు తెరుచుకోటానికి పూర్వం అతడు కిటికీలో నుండి లోపలకు చూచాడు. అప్పుడతనికి ఓ దృశ్యం

కనబడింది! ఆ ఇంటి యజమానురాలు తన స్నేహితు నొక నిని ఒక పాత పెట్టెలో దాస్తోంది. క్రమక్రమంగా తలుపులు తెరుచుకున్నాయి. అప్పుడు ఇంటి యజమానురాలు యిలా ప్రశ్నించింది: "నీకేం కావాలి?" "నేను నా వద్దనున్న రెండు ఎద్దు చర్మాలను అమ్మదలచుకున్నాను" అని అతడు జవాబిచ్చాడు. "నా భర్త ఇంటివద్ద లేడు, ఈ ఇంటిలో అతడు తప్ప మరి ఇతరులెవ్వరూ బేరం చేయరు" అని యజమానురాలు అంది. అపుడు అతడు ఇలా అన్నాడు: "నేను చర్మాలను చాలా తక్కువ ధరకు అమ్ముతాను, మీ ఇంటిలోనున్న పాతపెట్టె నిస్తే ఏనిస్తాను" కాని యజమానురాలు అందుకు అంగీకరింపలేదు.

వారా విషయం గూర్చి చాలాసేపు మాట్లాడుకోసాగారు. అంతలో అక్కడకు యజమానుడు వచ్చాడు! "మీరే విషయం గూర్చి మాట్లాడుకుంటున్నారు?" అని, అతడు అన్నాడు. పీలిట్ తన విషయమంతా యజమానునకు చెప్పి ఇంకా ఇలా అన్నాడు: "ఈ రెండుచర్మాలిస్తాను పాతపెట్టె నిస్తావా?" అందుకు యజమానుడు ఎంతో సంతోషించి భార్యతో ఇలా అన్నాడు:

"పాపం, నీ వింతఆకు ఇతనిని ఎందుకిచ్చుట ఆపు చేశావు. నీ వెంతో సంతోషంతో రెండుచర్మాలను తీసుకొని పాత పెట్టెను ఇచ్చి యుండవలసింది." అలా అని అతడు ఇంటిలోని పాతపెట్టెను భుజాలమీద పెట్టుకొనివచ్చి దానిని

బీదరైతుకు ఇచ్చివేశాడు. బీదవాడు అతని వద్దనున్న రెండు చర్మాలను అతనికి ఇచ్చివేశాడు. బీదవాడు ఆ పెట్టెను తీసుకు పోసాగాడు. కొంత సేపయిన తరువాత పెట్టెలోనున్న యువకుడు మాట్లాడ సాగాడు.

"నేను పెట్టెలో ఉన్నాను. నన్ను వదిలివేయండి" అని అతడు ప్రార్థింప సాగాడు. బీదవాడు ఏమీ మాట్లాడలేదు. చివరకు యువకుడు, "నన్ను వదిలేస్తే నీకు వేయిరూపాయలిస్తాను" అని అన్నాడు. బీదవాడు అందుకు అంగీకరించి, యువకుని వదిలిపెట్టి, వేయిరూపాయలు తీసుకున్నాడు.

బీదవాడు సంతోషంతో ఇంటికి వెళ్ళి తాను తెచ్చిన డబ్బుతో పెద్ద యిల్లు కట్టుకున్నాడు, అతనప్పటి నుండి గొప్ప ధనికునివలె ప్రవర్తింప సాగాడు. ప్రజలతని గొప్పతనం చూసి ఆశ్చర్యపడ సాగారు. అతడు అన్యాయంగా డబ్బు సంపాదించాడని వారు భావింప సాగారు. వారతనిని ఒక న్యాయాధికారివద్దకు తీసుకుపోయారు. "నీవు బీదవాడవు. నీకు డబ్బు ఎక్కడనించి వచ్చింది? నీవు న్యాయంగా డబ్బు తీసుకున్నట్టు ఋజువు చేసుకో" అని న్యాయాధికారి అన్నాడు. అపుడు బీదవాడు ఇలా అన్నాడు: "నేను అన్యాయంగా సంపాదించిందేమీ లేదు. ఒక ఎద్దు రాయితగిలి చచ్చింది. రెండోదాన్ని నేనే చంపాను. చర్మాలను అమ్మగా వేయి రూపాయలు వచ్చాయి." అంతట అందరూ తమ ఎద్దులను చంపుకున్నారు. వాని చర్మాలను పిపీట్ ఎద్దుల చర్మా

లను కొన్నవానికే అమ్మదలచారు. కాని న్యాయాధీశుడు వారితో ఇలా అన్నాడు: "మొదట నా సేవకుని ప్రయత్నించి చూడాలి." అంతట న్యాయాధికారి సేవకుడు తోళ్ళు కొనేవాని దగ్గరకుపోయి, "నీవు నావద్దనున్న రెండు చర్మాలు తీసుకొని వెయ్యి రూపాయలు ఇయ్యి. పీవిట్‌కి అలా ఇచ్చావుకదా!" అని అన్నాడు. కాని తోళ్లు కొనేవాడు ఇలా అన్నాడు: "నేను అతనికి వేయి రూపాయలీయలేదు. ఒక పాత పెట్టెను మాత్రం ఇచ్చాను."

ఆ విషయం అందరకూ తెలిసింది. అప్పుడు వారికి ఎంతో కోపం వచ్చింది. వారంతా పీవిట్ తోటలో పని చేసుకుంటుండగా అతనికి హాని చేయాలని నిశ్చయించుకున్నారు. ఆ సంగతి అతనికి తెలిసింది. "ఈ బాధ నేను పడటం ఎందుకు? నా భార్యపడటం మంచిది" అని అతడనుకున్నాడు. వెంటనే అతడు భార్యవద్దకు వెళ్ళి ఇలా అన్నాడు: నీవిప్పుడు నేను చెప్పినట్లు చేయాలి. నీవు నా దుస్తులు ధరించి నాకు బదులుగా తోటలో పనిచేయాలి." భార్య అందుకు అంగీకరించి భర్త దుస్తులు ధరించి తోటలో కూర్చుని పనిచేయ సాగింది. అప్పుడు కొందరు తోటలో పీవిట్ పనిచేస్తున్నాడనుకొని ఆమెపై ఒక పెద్దరాయి విసిరారు. ఆ దెబ్బకామె చనిపోయింది. భర్త ఎంతో విచారించి ఇలా అనుకున్నాడు: "నేను మరణం తప్పించుకున్నాను. నా భార్య మరణం వలన ఏదయినా లాభం పొందుతాను."

తరువాత మరణించిన భార్యకు ఆమె దుస్తులు తొడిగాడు. ఆమెను తీసుకు పోయి రోడ్డుమీద బల్లపై కూర్చుండ బెట్టాడు. ఆమె ముందు ఒక పండ్ల బుట్టనుంచాడు.

కొంచెం సేపటికి ఆ దారిని విలువయిన గుర్రపుబండి ఒకటి వస్తుంది. అందులో ఒక ప్రభువు కూర్చున్నాడు. ఆ ప్రభువు బుట్టలోనున్న పళ్ళను చూశాడు. అతడా పండ్లను కొనదలచి ఒక సేవకుని పంపాడు. ఆ సేవకుడు పోయి, "ఈ పండ్ల ఖరీదెంత?" అని ప్రశ్నించాడు. అతనికి జవాబేమీ రాలేదు. అతడు రెండవసారి ప్రశ్నించాడు. జవాబు రాలేదు. మూడవసారి ప్రశ్నించాడు. జవాబు రాలేదు. సేవకునకు ఎంతో కోపం వచ్చింది. పండ్లను అమ్ముతున్న స్త్రీ నిదుర పోతున్నదని భావించి సేవకుడు ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు పీలిట్ భార్య శవం వెనకనే యున్న సరస్సులో పడింది. అప్పుడు చటుకునపీలిట్ పరుగెత్తుకొచ్చి చూచాడు. అతడు ఏడుస్తూ ప్రభువుతో ఇలా అన్నాడు. "మీ వలన నా భార్య సరస్సులో పడింది." కాని ప్రభువు ఇలా అన్నాడు: "విచారించకు, నేను నీకు ఈ బండి, గుర్రాలు, సేవకులు ఇచ్చి వేస్తాను. నన్ను మాత్రం ఏమీ అనకు." బీదవాడు మొదట్లో అందుకు అంగీకరించలేదు. కాని చివరకు అంగీకరించాడు. బండిలో ప్రవేశించి ఇంటికి వెళ్ళాడు.

ఊళ్ళో వాళ్ళు పీవిట్‌ను చూసి ఆశ్చర్య పోయారు. వారికతడు తన కథను చెప్పాడు. వారు కోపించి అతనిని పట్టు కొని ఒక తొట్టిలో పడవేసి గట్టిగా కట్టి సమీపముననున్న ఒక సరస్సులో పడ వేయ టానికి సిద్ధపడ్డారు. వారా తొట్టెను దొర్లించుకుంటూ పోతూ ఉండగా ఒక పానశాల వచ్చింది. అందరూ అందులో ప్రవేశించారు. అంతకు ముందువారు తొట్టెను ఒక చెట్టుకు కట్టి వేశారు. లోపలవారు పానీ యాలు సేవిస్తూ ఆనంద సాగరంలో మునిగి తేలసాగారు.

తొట్టెలోనుంచి తప్పించుకు పోవటం ఎలాగా అని పీవిట్ ఆలోచింప సాగాడు. అంతలో ఆ దారిని గొర్రెలు పోతున్నాయి. అవి బా! బా! అని అరుస్తున్నాయి. పీవిట్ ఆ ధ్వని విని "నాకు మాజిస్ట్రేట్ పదవి వద్దు! నాకు మాజి స్ట్రేట్ పదవి వద్దు!" అని అరవ సాగాడు. గొర్రెల కాపరి ఆ మాటలు విని పీవిట్ దగ్గరకుపోయి, "నీవెందుకు అరుస్తు న్నావు?" అని ప్రశ్నించాడు. "అందరూ కలిసి నన్ను మాజి స్ట్రేట్ చేస్తామంటున్నారు. నేనందుకు అంగీకరించటంలేదు. అందుచేత వారు నన్నీ స్థితికి తీసుకు వచ్చారు. వారు నన్నో సరస్సులో పడవేయాలనుకొంటున్నారు." "నాకా పదవి కావాలి" అని గొర్రెల కాపరి అన్నాడు. "నీకాకోరిక ఉంటే నన్ను వదిలించు. అప్పుడు నేను నిన్ను తొట్టిలోపెట్టి కట్టివేస్తాను. నీవప్పుడు ఆపదవికి అంగీకారం తెలుపవచ్చు" అని పీవిట్ అన్నాడు. గొర్రెలకాపరి అతనికి తొట్టెనుండి

స్వేచ్ఛను ప్రసాదించాడు. అతను కాపరిని తొట్టెలో పెట్టి గట్టిగా కట్టివేసాడు. తరువాత గొర్రెలను తోలుకుంటూ ఇంటికి బయలు దేరాడు.

పానశాలలోకి వెళ్ళిన వారందరూ బయటకు వచ్చారు. తరువాత తొట్టెను దొర్లించుకుంటూ పోసాగారు. "నాకు మాజిస్ట్రేటు పదవి సమ్మతమే" అని కాపరి అరవ సాగాడు. కాని ఎవ్వరూ అతని మాటలు లెక్క చేయలేదు. వారు తొట్టెను సరస్సులోకి దొర్లించి వేశారు. తరువాత తమ తమ ఇండ్లకు పోసాగారు.

త్రోవలో వారికి గొర్రెలు తోలుకుపోతున్న పీవిట్ కనిపించాడు. "నీవిచ్చకు ఎట్లా వచ్చావు?" అని వారందరూ ఆశ్చర్యంతో ప్రశ్నించగా పీవిటు ఇలా చెప్పాడు. "సరస్సు మధ్య తొట్టె మొనదీ. మీరు నన్ను అందులో పడవేశారు. నేను సరస్సు అడుగు భాగం చేరుకున్నాను. అక్కడ వున్న చక్కని మైదానంలో గొర్రెలు మేస్తున్నాయి. అవి చాలా మంచి గొర్రెలు. నేను వాటిలో కొన్నిటిని ఇక్కడకుతోలు కొని వచ్చాను" "మేము కూడా కొన్ని గొర్రెల నక్కడ నుండి తెచ్చుకోవచ్చునా" అని వారు ప్రశ్నించారు. "తప్ప కుండా తెచ్చుకోవచ్చును." అని పీవిటు చెప్పసాగాడు.

"అక్కడ ఎన్నో గోరెలున్నాయి. మీరందరూ సరస్సు లోకి పోతే గొరెలను తెచ్చుకోవచ్చు మీరు కష్టపడి పని చేయవలసిన అవసరం ఏమీ లేదు,"

నీటిలో మునిగి గొరెలను తెచ్చుకోవాలని అందరూ సరస్సు తీరం చేరుకున్నారు. అప్పుడు నీలి ఆకాశంపై తెల్లని చిన్నమబ్బులు వ్యాపించియున్నాయి, అవి గొరెలమందల వలె కనబడుతున్నాయి, ఆ మబ్బులు నిర్మలమైన నీటిలో చక్కగా ప్రతిఫలిస్తున్నాయి, "అవిగో గొరెల మందలు" అని అందరూ ఒక్కసారి అరచారు, ముందు దూకినవారు గొరెలను అపహరిస్తారేమో అని అందరు ఒక్కసారిగా సరస్సులోకి దుమికారు, వారందరూ నీటిలో మునిగి మరణించారు. సీవిటు సంతోషంతో ఇంటికి వెళ్ళి సుఖంగా జీవించసాగాడు.

# తెలివిగల చిన్నవాడు

ఒక గ్రామంలో ఒక దర్జీవాడు నివసిస్తున్నాడు అతని కొకనాడు ప్రపంచయాత్రకు బయలుదేరాలనే కోరిక పుట్టింది. వెంటనే అతడు ప్రయాణానికి సిద్ధపడ్డాడు, అతడు నడుముకు పటకా కట్టుకున్నాడు, ప్రయాణంలో ఉపయోగపడే వస్తువేదైనా దొరుకుతుందేమోనని అతడు ఇల్లంతా వెదికాడు, అతనికొక చిన్న జున్నుముక్క కనబడింది, ఏమీ లేకుండా ఉండటం కంటే జున్నుముక్క ఉన్నా మంచిదే అని అతడు దానిని సంచిలో వేసుకున్నాడు, ఇంటి బయటకు వెళ్ళగానే కనబడిన కోడిపెట్టను కూడా అతడు సంచిలో వేసుకున్నాడు, పిమ్మట అతడు ప్రయాణమై వెళ్ళాడు.

అతడు వెళ్ళి వెళ్ళి ఒక కొండను చేరుకున్నాడు, ఆ కొండపై భాగానికి వెళ్ళాడు, అక్కడ ఒక రాక్షసుడు కూర్చుని వున్నాడు, అతడా రాక్షసుని సమీపించి ఇలా అన్నాడు, "మిత్రమా కుశలమా? నీవిక్కడ కొండ పైభాగాన కూర్చుని ఈ విశాల ప్రపంచంలో నా అదృష్టాన్ని పరీక్షించుకో దలచుకున్నాను, మరినాతో వస్తావా?" బరు గుజ్జువలె ఉన్న దర్జీవానిని చూచి రాక్షసుడిలా అన్నాడు, "నీవు పనికిమాలిన సన్యాసివి, నీతో స్నేహమేమిటి?" "మన ఇరువురిలో ఎవరెక్కువ బలవంతులో చూద్దామా?" అని దర్జీవాడన

రాక్షసుడు కొంచెం గౌరవభావంతో "సరే, మన బలాలు పరీక్షించుకుందాం" అని అన్నాడు. అతడొక పెద్ద శిలను తీసుకుని గట్టిగా నొక్కాడు. అప్పుడు నీటిచుక్కలు పడ్డాయి. "ఓ చిన్నవాడా! నా బలం చూశావుగదా? నీ శక్తి సామర్థ్యాలు చూపు, నేను చేసినట్లు చేయి" అనికూడా అన్నాడు "అంతేనా! నేనుకూడా నీవు చేసినట్లు చేస్తాను" అని దర్జీ చిన్నవాడు అన్నాడు. అతడు సంచిలోనుండి జున్నుముక్కను తీసి చేతితో గట్టిగా నొక్కాడు, అప్పుడు నీరు ధారగా పడింది. "ఇప్పుడేమంటావు? రాక్షసమిత్రమా! మన ఇద్దరిలో యెవరెక్కువ బలవంతులో నువ్వే చెప్పు" అని అన్నాడు.

రాక్షసునకు అంతా అయోమయంగా వుంది. అతడు తన కళ్ళను తానే నమ్మలేక పోతున్నాడు. దర్జీవాడు జున్ను ముక్కను తీసుకొని పిండిన విషయాన్ని అతడు చూడక పోవటం మూలాన ఏమీ మాట్లాడటానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది. పిమ్మట అతడు మళ్ళీ తన బలం ప్రదర్శింపదలచి ఒక శిలను తీసుకుని దానిని పైకి విసిరివేశాడు. అది తిరిగివచ్చి నేలమీద పడింది. "ఓ రాక్షసుడా! మరి ఇపుడు నీ ప్రతాపం చూపు" అని చిన్నవానిని ఏవగించుకుంటూ మాట్లాడాడు. కాని చిన్నవాడు ధైర్యంగా ఇలా అన్నాడు: "నేనుకూడా నా బలం ప్రదర్శించటానికి సిద్ధంగా వున్నాను. నీవు విసిరిన శిల తిరిగివచ్చింది, నేను విసిరితే అది తిరిగి రానేరాదు."

క్షేమ్ముటా అతడు సంచిలోనుంచి కోడిపెట్టను బయటకుతీసి బల మంతా ఉపయోగించి విసిరాడు. స్వేచ్ఛను పొందినందుకు యెంతో సంతోషించి కోడిపెట్ట వారికింకా కనబడకుండా పోయింది.

"ఇప్పుడు ఏమంటావు? నా శక్తి సామర్థ్యాలు రెండు సార్లు చవిచూశావుగదా!" అని చిన్నవాడు తన ప్రతాపం ప్రకటింపగా రాక్షసుడు ఇలా అన్నాడు: "నీవు తెలివయిన వాడవని అంగీకరించటానికి నాకు యెటువంటి అభ్యంతరము లేదు—ఇక నీవు పని యెట్లా చేస్తావో చూస్తాను."

తరువాత యిద్దరూ కలసి ఒక అడవిలోకి వెళ్ళారు. అచ్చట ఒక మహావృక్షం నేలమీద పడివుంది. రాక్షసుడా చెట్టును దర్జీవానికి చూపి ఇలా అన్నాడు: "మనమిద్దరం కలిసి ఈ మహావృక్షాన్ని అడవిబయటకు తీసుకుపోదాం" "నువ్వు ఏం చెప్పినా చేయటానికి నేను సిద్ధంగా వున్నాను. నువ్వు చెట్టు మొదట భాగం పట్టుకొని ముందునడు, కొమ్మలు మొదలైనవి ఉన్న బరువైన భాగం పట్టుకొని నేను వస్తాను. అపుడు నా శక్తి సామర్థ్యాలు నీకు ప్రత్యక్షమవుతాయి." రాక్షసుడు అందులకు అంగీకరించి మొదలుభాగం పట్టుకున్నాడు. కాని జిత్తులమారియైన దర్జీవాడు మాత్రం కొమ్మల భాగం పట్టుకోలేదు. అతడు హాయిగా కొమ్మలలో కూర్చున్నాడు. తత్ఫలితంగా రాక్షసుడే చెట్టునంతా మోసుకు పోసాగాడు. అతడు దర్జీవాడు చేస్తున్న మోసాన్ని యే

మాత్రం గుర్తించలేదు. చెట్టును మోయటం తనకు ఆటతో సమానమనే అర్థం వచ్చేటట్లు దర్జీవాడు ఈలలు వేస్తూ పాటలు పాడసాగాడు. కొంతదూరం పోయిన తరువాత రాక్షసుడికి ఆ వృక్షం మోయలేక ఇలా అన్నాడు "నేనింక చెట్టు మోయను, క్రింద పడవేస్తున్నాను" అంతట దర్జీవాడు కొమ్మలలోనుంచి క్రిందకు దుమికి చెట్టును పట్టుకొని యిలా అన్నాడు: "నీవు చూడటానికి ఒక పర్వతంలా ఉన్నావు-కాని ఈ చిన్న చెట్టును మోయలేక పోతున్నావు! ఇదిఎంతో అవమానకరమైన విషయం" తరువాత ఇద్దరూ మళ్ళీ యెప్పటిలా ముందుకు పోసాగారు.

ఇద్దరూ ఒక చెర్రీవృక్షం చేరుకున్నారు. దానినిండా పళ్ళున్నాయి. వాటిని తినాలనే కోరిక రాక్షసుడికి పుట్టింది. అంచేత అతడు పెనున్న కొమ్మను వంచి పళ్ళను కోసుకొని తిన్నాడు. తరువాత కొమ్మను దర్జీవానికి అందించాడు. కాని దర్జీవాడు దానిని వంచలేక కొమ్మతోబాటు పైకిపోయాడు. "అదేమిటి! నీవా చిన్నకొమ్మను పట్టుకోలేకపోయావు." అని రాక్షసుడు అపహాస్యంగా మాట్లాడాడు. "పట్టుకోలేక కాదు వేటగాడొకడు మనం నిలబడియున్న పొదలోకి బాణాలు విడుస్తున్నాడు. కనుక నేను పైకి పోయాను. నీవుకూడా పైకిరా" అని దర్జీవాడన్నాడు. రాక్షసుడు అలా చేయటానికి ప్రయత్నించి కొమ్మలలో ఇరుక్కుపోయాడు. అప్పుడు చిన్నవాడు కడుపుబ్బేటట్లు నవ్వసాగాడు. "హాస్యంగా మాట్లాడటంలో

నీవు మంచి నేర్పరివి, నీవు నాకు నచ్చిన మంచి మిత్రుడవు. ఈ రాత్రికి నువ్వు నా ఇంటికివచ్చి చక్కగా భోంచేసి నిద్రపో."

చిన్నవాడికి చేయటానికి పనిఏమీ లేదు-అందుచేత అతడు రాక్షసునిఆహ్వానంఅంగీకరించి అతని ఇంటికి వెళ్ళాడు. రాక్షసుడు అతనికి చక్కని భోజనం పెట్టాడు. భోజనంఅయిన తరువాత పడుకోవటానికి మంచి శయ్యకూడా యిచ్చాడు. రాక్షసుడు తనకు అపకారం చేయబోతున్నాడని జిత్తులమారి అయిన చిన్నవాడు గ్రహించాడు. అంచేత అతడు ఒకమూలకు పోయి పరుండి గాఢంగా నిద్రింపసాగాడు. అర్ధరాత్రి అయింది-అప్పుడు రాక్షసుడు మెల్లగా శయ్యను సమీపించాడు. తన ఇనుపచేతి కర్రతో శయ్యమీద గట్టిగాకొట్టాడు ఆ దెబ్బకు చిన్నవాడు పరలోకానికి వెళ్ళియుంటాడనితలంచి రాక్షసుడు ఇలాఅనుకున్నాడు "ఈ దెబ్బతో నాకీ మరుగుజ్జు పీడ వదిలిపోతుంది—ఇక యితని జిత్తులవల్ల నాకు ఏటువంటి ప్రమాదమూ వుండదు" తెల్లవారింతర్వాత రాక్షసుడు అడవిలోకి వెళ్ళాడు. అతడు చిన్నవాని శవాన్ని చూడకుండానే వెళ్ళాడు. చిన్నవాడుకూడా అడవిలోకి వెళ్ళాడు-అతడు ఆనందంతో ఈలలు వేస్తూ పాటలు పాడుతూ తిరుగసాగాడు. రాక్షసుడు అతనిని చూడగానే ఏంతో భయపడి వెనక్కు తిరిగి చూడకుండా పారిపోయాడు.

చిన్నవాడు పోయి పోయి రాజాస్థానం చేరుకున్నాడు అచ్చట అతడు తన సాహసకృత్యాలన్నీ వివరంగా వర్ణించి

చెప్పి "నేను రాజుగారిదగ్గర పనిచేయటానికి వచ్చాను" అని ప్రకటించాడు. రాజు అతనితో యిలా అన్నాడు "ముందు నేను నీ శక్తిసామర్థ్యాలు పరీక్షించాలి, నా రాజ్యంలో ఇద్దరు రాక్షసులు స్వేచ్ఛగా విహరిస్తున్నారు. వారు నా ప్రజలకు భయోత్పాతం కలుగచేస్తున్నారు. వారు ప్రజల ధనధాన్య సంపదలు దోచుకుంటున్నారు. ఇళ్ళు తగులబెడు తున్నారు. మనుష్యులను నానావిధాలా హింసిస్తున్నారు. నిజంగా నీవు శక్తిసామర్థ్యాలు కలవాడవయితే నూరుగురు సైనికులను తీసుకుపోయి వారిద్దరినీ చంపిరా. అప్పుడు నీ క అర్థరాజ్యం యిస్తాను" అప్పుడు చిన్నవాడు ఇలా అన్నాడు: "మీరు చెప్పినట్లు చేయటానికి నేను సిద్ధంగా ఉన్నాను. మీరు నాతో పంపబోయే వందమంది సైనికుల సహాయం లేకుండానే రాక్షసుల నిద్దరినీ సంహారింపగలనని నేను గాఢంగా నమ్ముతున్నాను."

చిన్నవాడు వందమంది సైనికులను వెంటబెట్టుకొని అడవిని చేరుకున్నాడు. అప్పుడతను సైనికులతో యిలా అన్నాడు. "మీరందరూ ఇక్కడనే వుండండి. నేను అడవి లోకి వెళ్ళి యిద్దరు రాక్షసులను సంహారించి తిరిగి వస్తాను" పిమ్మట అతడొక్కడే అడవిలోకి వెళ్ళాడు. అతడు జాగ్ర త్తగా అటు యిటూ చూస్తూ పోసాగాడు. కొంతదూరం పోయిన తరువాత ఒక చెట్టుకింద పరుండి గాఢంగా నిద్రి స్తున్న రాక్షసులిద్దరూ అతనికి కనిపించారు వారు గట్టిగా గుర్రు పెడుతున్నారు. ఆ శబ్దానికి కొమ్మలుకూడా కదులు

తున్నాయి. అప్పుడు చిన్నవాడు యిలా అనుకున్నాడు. "నేను వీరిద్దరిని మాయోపాయం చేత సంహరిస్తాను." అతడు ఒక సంచి నిండా రాళ్ళు పోసుకుని ఆ చెట్టుపైకి యెక్కి కూర్చున్నాడు.

చిన్నవాడు ఒక రాక్షసునిపై మెల్లిగా రాళ్ళు వేయసాగాడు. కొంతసేపటికి అతనికి మెలకువ వచ్చింది. అతడు ఆగ్రహంతో రెండో వానిని లేపి "నీవు నన్నెందుకు కొడుతున్నావు" అని గట్టిగా అరిచాడు. అప్పుడు రెండో వాడు యిలా అన్నాడు. "అసత్యం నీవు కలగంటున్నావు. నేను నిన్ను కొట్టలేదు." అంతట యిద్దరూ మరల గాఢంగా నిదురింప సాగారు. చిన్నవాడీసారి రెండోవానిపై రాళ్ళు వేయసాగాడు. కొంత సేపటికి రెండవవాడు నిదురనుండి లేచి మొదటివానిని లేపి "నీవు నన్నెందుకు కొడతావు" అని ప్రశ్నించాడు. "నేను నిన్ను కొట్టలేదు." అని మొదటివాడు అన్నాడు. వారా విషయం గూర్చి కీచులాడుకుని మరల నిదురింపసాగారు. అంతట మరల చిన్నవాడు తన ఆట ప్రారంభించాడు. అతడొక పెద్ద రాయిని మొదటివాని ముక్కుమీద పడవేశాడు. అప్పుడతడు కుపితుడై లేచి, "ఇక నేను ఏ మాత్రం సహించను" అని రెండవ వానిని గట్టిగా కొట్టాడు. అంతట రెండవవాడు మొదటివానిని గట్టిగా కొట్టాడు. అప్పుడిద్దరుకు గొప్ప పోరాటం ప్రారంభమైంది. ఇద్దరు రాక్షసులూ కొంతసేపు చెట్లు వేళ్ళతో సహా పీకి వానితో యుద్ధం చేశారు. కొంతసేపు రాళ్ళతో యుద్ధం చేశారు. అంత కొంతసేపటికి ఇద్దరూ మరణించారు.

అప్పుడు చిన్నవాడు యిలా అనుకున్నాడు. "ఈ రాక్షసులు చావటం నా అదృష్టం వలన జరిగింది. అదృష్టవశంచేత వారు నేనున్న చెట్టును పీకలేదు. పీకి వుంటే ఏమయి వుండేదో" పిమ్మట అతడు క్రిందకి దిగి చచ్చిపడియున్న రాక్షసుల వద్దకు వెళ్ళి వారి రొమ్ము భాగాలపై తన వద్దనున్న కత్తితో గాయాలు చేశాడు. తానే రాక్షసులను చంపినట్లు రుజువుకోసం అతడలా చేశాడు. పిమ్మట అతడు సైనికులున్న ప్రదేశానికి వెళ్ళాడు. వారితో యిలా అన్నాడు "నేను యిద్దరు రాక్షసులను చంపివేశాను. వారు అడవిలో పడి వున్నారు వారిని చంపటం సామాన్యమైన పనికాలేదు. వారు చెట్లుకూడా పెకలించి నాతో ఘోర యుద్ధంచేశారు" నీకు పోరాటంలో గాయాలు తగిలాయా? అని వారు ప్రశ్నించారు. అప్పుడు చిన్నవాడు యిలా అన్నాడు. "ఆ విషయం మీరు అడగటం మంచిదే నాకొక్క గాయమైనా తగలలేదు. రాక్షసులు నా తలమీది వెంట్రుకలను కూడా ముట్టుకోనలేకపోయారు." కాని సైనికులు అతని మాటను నమ్మలేదు. అంచేత అతడు వారిని అడవిలోకి తీసుకుపోయాడు. సైనికులొకచోట చచ్చిపడియున్న ఇదరు రాక్షసులను చూచారు. చెల్లాచెదురుగా పడియున్న చెట్లను గూడా చూచారు. అప్పుడువారు చిన్నవాడు ఆ రాక్షసుల నిద్దరినీ చంపాడన్న విషయం పూర్తిగా నమ్మారు. అలా నమ్మటంకంటే వారికి వేరు గత్యంతరం లేక పోయింది.

చిన్నవాడు విజయగర్వంతో రాజు వద్దకుపోయి ఇలా అన్నాడు "రాజా నేను మీరు కోరిన ప్రకారం యిద్ద

రాక్షసులనూ చంపివేశాను. నేను మీ సైనికుల సహాయం ఏ మాత్రం తీసుకోలేదు. కనుక మీరు నాకు వెంటనేమీరు చేసిన వాగ్దానం ప్రకారం అర్థరాజ్యం యివ్వాలి." సైనికులు చిన్నవాని మాటలను ధృవపరిచారు. అవసరం తీరిపోయింతరువాత కొందరు వాగ్దాన భంగం చేస్తారు. చిన్నవాని సహాయం పొందినరాజు అట్టివారిలో ఒకడు. "రాక్షసులు చచ్చిపోయారు. ఇక నేను వారికి భయపడవలసిన అవసరం లేదు. ఇప్పుడు నేను ఇతనికి అర్థరాజ్యం యీయకపోతే వచ్చిన నష్టం ఏమిటి" అని రాజు అనుకున్నాడు. అంతేకాని రాక్షసులను చంపి(ంచి)న వాడు బ్రతికి యున్నాడనే విషయాన్ని ఆ వెర్రిరాజు మరచిపోయాడు.

రాజు ఏ విధంగా నయినా చిన్నవాని పీడ వదిలించుకోవాలనుకున్నాడు. అందుచేత నతడు మళ్ళీ చిన్నవానిని ఇలా అన్నాడు నీవు చేయవలసిన పని యింకా పూర్తి కాలేదు. రాజభవనపు వాతావరణంలో ఒక యెలుగుబంటి యుంది. నీవీ రాత్రి దాని వద్ద కాలం గడపాలి. తెల్లవారిన తరువాత నేను లేచి చూస్తాను. అప్పటికింకా నీవు జీవించి యుంటే నీకు తప్పకుండా అర్థరాజ్యం యిస్తాను."

ఆ యెలుగుబంటి అంతకు ముందెన్నడూ తన దగ్గరకు వచ్చిన నారిని ప్రాణాలతో వదిలియుండలేదు. దాని కోరలు గోళ్ళు యెంతో వాడియైనవి. చిన్నవాడుగూడా ఎలుగుబంటి చేతిలో తప్పక చంపబడతాడని రాజు భావించాడు. జిత్తులమారియైన చిన్నవాడు మాత్రం రాజుతో

యిలా అన్నాడు. "అయ్యా నేను మీరు ఏం చెప్పినా చేయ టానికి సిద్ధంగా వున్నాను."

చిన్నవాడు చీకటివడిన తరువాత యెలుగుబంటి వద్దకు వెళ్ళాడు. అతడు ఉపాయాన ఎలుగుబంటి చేతకొన్ని రాళ్ళను నమిలించాడు. అప్పుడు దాని పళ్ళన్ని విరిగి పోయాయి. అన్లా అతడు దాని గోళ్లను గూడా కత్తిరించి వేశాడు. ఎలుగుబంటి అతనిని ఏమి చేయలేని నిస్సహాయ పరిస్థితి ఏర్పడింది. తెల్లవారిం తరువాత రాజు వచ్చాడు. అప్పటికింకా దర్జ చిన్నవాడు బ్రతికియే యున్నాడు,అందు వలన రాజు అతనికి అర్ధరాజ్యం యీయక తప్పలేదు.

# మూడు కాకులు

ఒక గ్రామంలో ఒక సైనికుడు నివసిస్తున్నాడు. అతడు ఎల్లప్పుడు కష్టపడి పనిచేస్తుండేవాడు. ఇతరులవలె వచ్చే జీతాన్నంతనీ తింటానికి, తాగటానికి ఖర్చుపెట్టేవాడు కాడు. అందుచేత అతడు చాలా ధనం నిలువచేయగలిగాడు. అతనికి ఇద్దరు స్నేహితులున్నారు. వారు చాలా దుర్మార్గులు. వారు సైనికుని వద్దనున్న ధనాన్ని ఏవిధంగానయినా కాజెయ్యాలని ప్రయత్నించ సాగారు. పైకిమాత్రం గాఢ మిత్రులవలె నటిస్తున్నారు.

ఒకనాడు మిత్రులు సైనికునితో ఇలా అన్నారు—
"మిత్రమా! మనమిలా పట్టణంలో ఖైదీలవలె ఇరుక్కుపోయి ఉండటం యెందుకు? ఇంతవరకు నీవు కష్టపడి పనిచేసి చాలా ధనం సంపాదించావు. ఇక నీవు నీ యిష్టంవచ్చిన చోటుకు వెళ్ళి సుఖంగా కాలక్షేపం చేయవచ్చు. నీ జీవితం ప్రశాంతంగా గడిచిపోతుంది" వారావిధంగా సైనికునితో అనేక సార్లు అనసాగారు. తుదకతడు ఒకనాడు ఇలా అన్నాడు—
"మీరు చెప్పినట్లు చేస్తా—మీతో బయలుదేరి నా అదృష్టం

పరీక్షించుకుంటాను" దొంగస్నేహితులిద్దరు అతని ధనం అపహరించే విధానం గూర్చి ఆలోచింపసాగారు.

ఒకనాడు ముగ్గురు కలసి పట్టణం విడి కొంతదూరం పోయారు. అప్పుడు దొంగస్నేహితులు యిలా అన్నారు: "మనం కుడిచేతివైపున ఉన్నదారిని పోదాం-అలా చేస్తే మనం అతి త్వరలో వేరొక దేశం చేరుకొంటాం. అక్కడ మనం సురక్షితంగా ఉండవచ్చు." తాము చెబుతున్న విషయం అసత్యమనే సంగతి వారికి తెలుసు. వారి మాటలు విన్న సైనికుడు యిలా అన్నాడు— "ఆ దారిన పోతే మనం మన పట్టణంలోకే పోతాం—కనుక మనం ఎడమవైపు దారిని పోవాలి" అప్పుడు దొంగ స్నేహితులు అతనితో తగువుపెట్టుకుని ఇలాఅన్నారు– "నీకేమీ తెలియదు—మాకంటేఎక్కువ తెలిసినవానిలా మాట్లాడతావెందుకు?" అలా అని వారిద్దరూ అతనిమీద పడి క్రింద పడవేశారు. అతనిని తలమీద గట్టిగా కొట్టారు. అప్పుడు అతడు గుడ్డివాడయ్యాడు. వారు అతనివద్దనున్న ధనం తీసుకున్నారు. అతనిని ఉరితీసే వృక్షానికి కట్టివేశారు. పిమ్మట వారు పట్టణంలోకి తిరిగిపోయారు. గుడ్డివానికి తానెక్కడ వున్నదీ తెలియదు. అతడు తన చుట్టూ తడివిచూసి తానొక పెద్ద దుంగకు కట్టివేయబడిన విషయం గ్రహించాడు. అత డది ఒక సిలువ అని భావించి ఇలా అనుకున్నాడు: "వారు నా పట్ల ఎంతో దయతో ప్రవర్తించారు. ఇక నన్ను దేవుడే రక్షిస్తాడు" తరువాత అతడు తల పైకెత్తి దైవ ప్రార్థన చేయసాగాడు.

చీకటి పడింది. అతనికి శిరస్సుపై ఒక ధ్వని వినబడ సాగింది. మూడు పక్షులు అతడు కట్టివేయబడిన వృక్షముపై కూర్చుండి రెక్కలతో చప్పుడు చేస్తున్నాయి. అవి కాకులు. అవి మాట్లాడుకోవటం మొదలు పెట్టాయి. సైనికుడు వాటి మాటలను వినసాగాడు. మొదటికాకి ఇలా అంది: "సోదరీ! ఈ రోజు ముఖ్యవిశేషాలు ఏమిటి?" అప్పుడు రెండో కాకి ఇలా అంది: "మనకు తెలిసిన విశేషాలు రాకుమారికి తెలిస్తే ఎంతబాగుంటుంది? రాజకుమారికి జబ్బుగావుంది, ఆజబ్బును నయంచేసినవారికి ఆమెను ఇచ్చి పెండ్లి చేస్తానని రాజు ప్రకటించాడు. ఆమె జబ్బును ఎవ్వరు నయంచేయగలరు? ఇక్కడ వున్న పువ్వును భస్మంచేసి ఆ భస్మం మింగితే ఆమె జబ్బు నయమవుతుంది" తరువాత మొదటి కాకి ఇలా అంది: మనకు తెలిసినవిషయాలు మానవులకు తెలిస్తే ఎంతబాగుంటుంది! ఈ రాత్రి స్వర్గలోకంనుండి ఒక విధమయిన మంచు భూమిపై పడుతుంది-అది చాలా శక్తివంతమైంది. దాంతో కళ్ళు కడుక్కుంటే గ్రుడ్డివారికి చూపు వస్తుంది."

అప్పుడు మూడోకాకి యిలా అంది: "ఈ పూవుఒక్క రాజకుమారికి మాత్రమే పనికివస్తుంది-మంచు కొద్దిమందికి మాత్రమే పనికివస్తుంది. నేను అందరకూ పనికివచ్చే విశేషం చెపుతాను. ఇపుడీ పట్టణంలో నీటి కరువు ఏర్పడింది-బావు

లన్నీ ఎండిపోయాయి, నీటిని తిరిగి సంపాదించే ఉపాయం ఎవ్వరికీ తెలియదు. పట్టణంమధ్య ఉన్న పెద్ద ఱాతిని తీసి వేసి అక్కడ త్రవ్వితే మంచినీరుగల ఊటబావి బయల్పడు తుంది.”

ఆ మూడుకాకులూ మాట్లాడుకోటం పూర్తి అయిన తరువాత రెక్కలు అల్లార్చి ఎక్కడికో ఎగిరిపోయాయి. తనకు తిరిగి చూపు రానున్నందుకు సంతోషించాడు. అతడు తన శక్తి అంతా ఉపయోగించి స్వేచ్ఛను పొందటానికి ప్రయత్నించాడు. ఎట్టకేలకతడు స్వేచ్ఛను పొందాడు. అతడు తనకు దగ్గరలోవున్న గడ్డిని కోసి దానిపైనున్న మంచుతో కన్నులు కడుగుకున్నాడు. వెంటనే అతనికిచూపు వచ్చింది. అప్పటికి చంద్రుడు చక్కగా ప్రకాశిస్తున్నాడు. ఆ చంద్రకాంతిలో అతడు తాను మున్ను కట్టివేయబడిన చెట్టును చూచాడు. అది సిలువకాదనే విషయం గ్రహించాడు. అతడు మంచు నీటిని ఒక సీసాలోకి పట్టాడు. అతడా ప్రాంతమంతా కలయజూచి అక్కడనున్న పువ్వు చూచాడు అతడా పువ్వును భస్మంచేసి దానిని జాగ్రత్తగా దాచాడు. పిమ్మట అతడు రాజభవనానికి వెళ్ళాడు.

అతడు రాజభవనానికి వెళ్ళి రాజుతో ఇలాఅన్నాడు “నేను మీ కూతురు జబ్బు కుదర్చటానికి వచ్చాను” రాజు అతనికి అనుమతి ఇచ్చాడు, అప్పుడతడు రాకుమారికి పువ్వు భస్మం ఇచ్చాడు. దానిని మింగిన రాకుమారికి జబ్బు నయ

మైంది. "మీ కూతురును నా కిచ్చి వివాహం చేయండి" అని అతడు రాజును కోరాడు. రాజు అతని అపరిశుభ్రమైన దుస్తులు చూచి అతనికి తన కూతురునిచ్చి పెండ్లిచేయటానికి ఇష్టపడడంలేదు. రాజు ఎలాగయినా అతనిపీడ వదిలించుకోవాలనుకున్నాడు. అందువలన అతడు ఇలా అన్నాడు— "ఇప్పుడు పట్టణంలో నీటికరువు ఏర్పడింది- రాకుమారిని పెళ్ళి చేసుకోవాలని అనుకునేవారెవ్వరయినా సరే ఈ కరువును పోగొట్టాలి" అంతట సైనికుడుపట్టణంమధ్య ఉన్న పెద్దరాతి వద్దకు వెళ్ళి ప్రజలతో ఇలా అన్నాడు: "మీరీ పెద్దరాతిని ఇక్కడనుంచి తీసివేయండి. తరువాత ఇక్కడ త్రవ్వండి- మీకు మంచినీరు లభిస్తుంది." అంతట జనులు అతడు చెప్పినట్లు చేయగా అచ్చట ఒక మంచి ఊటబావి బయల్పడింది. దాంతో అంతకుముందు పట్టణంలో ఏర్పడిన నీటి కరువు తీరింది. అపుడా రాజు సైనికునకు తన కూతురునిచ్చి పెండ్లి చేశాడు. నాటినుండి క్రొత్తదంపతులు సుఖంగా జీవించసాగారు.

ఒకనాడు సైనికుడు పొలాలలో నడచి పోతున్నాడు. అపుడతనిని పూర్వపు దొంగస్నేహితులిద్దరూ ఎదురుపడ్డారు వారు అతడిని గుర్తింపలేక పోయారు. అతడుమాత్రం వారిని వెంటనే గుర్తించాడు. అందుచేత వారితో అతడిలాఅన్నాడు "నన్ను చూడండి! నేను మీ పాతస్నేహితుడనే. మీరు

నన్ను కొట్టి కళ్ళు పోగొట్టి ధనం తీసుకు పోయారు. కాని అదృష్టవంతుని పాడుచేయటం ఎవరితరం? మీరు నాకు అపకారం చేయటానికి ప్రయత్నించారు-కాని కరుణామయుడైన భగవంతుడు నాకు అందుమూలాన అదృష్టం కలిగేటట్లు చేశాడు. అప్పుడు వారతని కాళ్ళమీదపడి తమ్ము క్షమించవలసిందని ప్రార్థించారు. దయగల సైనికుడు వారినిద్దరినీ క్షమించాడు. వారిని తన రాజభవనానికి తీసుకుపోయి మంచి ఆహారం, చక్కని దుస్తులు యిచ్చాడు. పిమ్మట వారికి తన కదృష్టం కలిగిన విధాన మంతా వివరించి చెప్పాడు. ఆ దొంగ స్నేహితులు అతనికథ విన్న తరువాత ఇలా అనుకున్నారు: "మనంకూడా ఒక రాత్రి పోయి ఉరితీయు వృక్షం క్రింద ఎందుకు కూర్చోకూడదు? మనకుకూడా అదృష్టం కలిగించే విషయం ఏదయినా తెలియవచ్చును. మనంకూడా గొప్పవారం కావచ్చును."

మరునాటి రాత్రి దొంగస్నేహితులిద్దరూ చెట్టు క్రిందకు పోయి కూర్చున్నారు. కొంతసేపు అయ్యేటప్పటికి వారికి పక్షుల రెక్కల చప్పుడు వినబడింది-మూడు కాకులు చెట్టుమీద కూర్చున్నాయి. మొదట ఒక కాకి ఇలా అంది: "ఎవ్వరో మనం చెప్పుకున్న విశేషాలు విన్నట్లుంది-అందరూ మనం మాట్లాడుకున్న అద్భుతవిషయాలను గూర్చిమాట్లాడుకుంటున్నారు. రాకుమారి జబ్బు నయమయింది-ఈ పువ్వు నెవరో కోసి భస్మం చేశారు. పట్టణమునకంతకూ ఒక ఊట బావి నీటిని సరఫరా చేస్తున్నది! మనం ఇక్కడ ఎవ్వరైనా వున్నారేమో చూద్దాం! వారిని నాశనం చేద్దాం" అంటూ

మూడు కాకులూ చుట్టూ కలయజూచాయి-వాటికి ఆ వృక్షం క్రింద కూర్చుండియున్న యిద్దరు దొంగ స్నేహితులు కనిపించారు. వెంటనే ఆ కాకులు ముక్కులతోను. కాళ్ళతోను దొంగస్నేహితుల ముఖాలను గీరసాగాయి, కొంతసేపు గడిచేటప్పటికి వారిద్దరూ గుడ్డివారయ్యారు. వారు మరణించిన వారివలె చెట్టుక్రింద పడిపోయారు. అందు చేత వారు రాజభవనానికి తిరిగిపోలేక పోయారు. ఆ స్నేహితులు ఏమైపోయారాఅని సైనికుడు ఎంతో ఆశ్చర్య పడ సాగాడు. అతడు వారికోసం అన్ని ప్రదేశాలు వెదికాడు- తుదకతనికి వారి దుస్థితిని చూచాడు. నిజంగా వారక్కడ తమ దుర్మార్గానికి తగిన దుష్ఫలితం అనుభవిస్తున్నారు.

# పచ్చటోపీ

ఒక ఊరిలో ఒక బాలిక నివసిస్తోంది. ఆమెను అక్కడి వారందరూ ప్రేమిస్తున్నారు. అందరికంటె ఎక్కువగా ఆమె ముత్తవ తల్లి ప్రేమిస్తోంది. ఆమె ఆ బాలికకు కావలసిన వస్తువులన్నిటినీ ఇస్తుండేది. ఒకసారి ఆమె బాలికకొక పచ్చ టోపీ ఇచ్చింది. ఆ టోపీ బాలికకు చక్కగా సరిపోయింది. అందువలన బాలిక దానినెప్పుడూ ధరిస్తుండేది. అందుచేత అందరూ ఆ బాలికను పచ్చటోపీ అని పిలువ సాగారు:

ఒకనాడు బాలిక తల్లి కూతురుతో ఇలా అంది: "అమ్మాయి, నువ్వీ రొట్టెను. ద్రాక్షసారాయాన్ని తీసుకు. పోయి నీ ముత్తవ తల్లికిచ్చిరా, ఆమెకీ మధ్య జబ్బు చేసింది ఇంకా నీరసంగా ఉంది. కనుక బాగా ఎండ రాకముందే పోయిరా చక్కగా నడచిపో. ఇటూ అటూ పరుగెత్తకు. పరుగెత్తి పడితే సీసా పగిలిపోతుంది. నీ ముత్తవ తల్లికి ద్రాక్షసారాయం ఉండదు. నీవామెగదిలోకి పోగానే 'సుప్రభాతం!' అని చెప్పటం మాత్రం మరచిపోకు."

అప్పుడు పచ్చటోపీ ఇలా అంది. "నీవు చెప్పిందంతా జ్ఞాపక ముంచుకుంటాను." ఆ బాలిక ముత్తవ తల్లి బాలిక నివసిస్తున్న గ్రామానికి అరమైలు దూరంలో ఉన్న అడవిలో నివసిస్తోంది: బాలిక రొట్టె, ద్రాక్షసారాయం సీసా తీసుకొని

అడవిలో ప్రవేశించింది. మొట్ట మొదట బాలిక ఆ అడవిలో ఒక తోడేలును కలుసుకుంది. కాని తోడేలు చెడ్డ స్వభావం ఎరగని ఆమె ఏ మాత్రం భయపడలేదు. "సుప్రభాతం! పచ్చటోపీ!" అని తోడేలు అంది. "సుప్రభాతం!" అని బాలిక జవాబిచ్చింది. "నువ్వు ఎక్కడకు వెళుతున్నావు?" అని తోడేలు ప్రశ్నించింది. "నేను నా ముత్తవ తల్లి ఇంటికి పోతున్నాను. ఆమె మూడు పెద్ద ఓక్ చెట్లకింద వున్నకుటీరంలో నివసిస్తోంది. ఆమెకు ఈ మధ్య జబ్బు చేయటం వలన నీరసంగా ఉంది. అందుచేత ఆమెకు రొట్టె, ద్రాక్షసారాయం తీసుకు పోతున్నాను" అని బాలిక వివరంగా జవాబిచ్చింది. అప్పుడు తోడేలు తనలో తాను ఇలా అనుకుంది: "ఈ బాలిక ఆ ముసలమ్మకంటె ఎక్కువ రుచికరంగా ఉంటుంది. నేను జాగ్రత్తగా పనిచేసి ఇద్దరినీ తినివేయటానికి ప్రయత్నించాలి."

తోడేలు బాలికకు పక్కగా పోసాగింది. కొంతసేపు గడచిన తరువాత తోడేలు ఆమెతో ఇలా అంది; "ఇచ్చట ఉన్న ఈ అందమైన పువ్వులను చూడు. పక్షుల మధుర ధ్వనులను విను. నువ్వు పువ్వులను, పక్షులను లెక్కచేయకుండా బడికి పోతున్న దానిలా పోతావెందుకు? ఇక్కడ ఉన్న ప్రకృతి సౌందర్యం అనుభవించు." ఆ మాటలు వినగానే అమ్మాయి చుట్టూ కలయ జూచింది. అప్పుడు సూర్య కిరణాలు చెట్ల కొమ్మలమీద పడి మనోహరంగా నాట్యం చేస్తున్నాయి. అక్కడి పుష్పాలెంతో అందంగా కనబడ్డా

యం తెలుసుకుంటాను.” పిమ్మట అతడు కుటీరంలో ప్రవేశిం చాడు. అతడు మంచం మీద పరుండియున్న తోడేలును చూచి ఇలా అనుకున్నాడు; ఓసి పాపీ! నువ్వు ఇక్కడ ఉన్నావా? నిన్ను అంతం చేసే సమయం ఎప్పుడు వస్తుందా అని నేను ఎదురు చూస్తున్నాను.”

వేటగాడు తుపాకీతో తోడేలునుచంపదలచాడు. కాని తోడేలు ముసలమ్మను మింగియుండవచ్చుననే ఆలోచన అత నికి తట్టింది. అతడు తోడేలు కడుపులో ఉన్న ముసలమ్మను కూడా రక్షింప దలచాడు. అందువలన అతడు ఒక పదునైన చాకును తీసుకొని ఆ తోడేలుకడుపును జాగ్రత్తగాకోసాడు మొదట పచ్చటోపీ తోడేలు కడుపునుండి బయడిపడింది. ఆమె ఎంతో సంతోషంతో ఇలా అంది: “అబ్బ! తోడేలు కడుపులో ఎంతో చీకటిగా వుంది! నేనెంతో భయపడ్డాను!” పిమ్మట ఆమె ముత్తవ తల్లి కూడా తోడేలు కడుపులో. పచ్చటోపీ కొన్ని పెద్ద పెద్ద రాళ్లను బయటినుండి కుటీరం లోకి తీసుకు వచ్చింది. వారా రాళ్ళను తోడేలు కడుపులో పడవేశారు. పిమ్మట దానిని కట్టివేశారు. కొంతసేపటికి తోడేలు నిద్రనుండి లేచింది. అది మంచం మీదనుండి క్రిందకు దుమికింది. కడుపులోని రాళ్ళు చాలా బరువు వుం డటంచేత అది నేలమీదపడి చచ్చింది. అప్పుడక్కడున్న ముగ్గురూ సంతోషించారు. వేటకాడు తోడేలు చర్మం ఒలిచి తనతో తీసుకు పోయాడు, ముత్తవ తల్లి పచ్చటోపీ తెచ్చిన రొట్టెని తింది. ద్రాక్షాసారాయం త్రాగింది. అప్పు

డా మెకు కొంత బలం వచ్చింది. అప్పుడు పచ్చటోపీ ఇలా అంది: "ఇక ముందెన్నడూ నేను నా తల్లి మాటకు వ్యతిరేకంగా పోను. నా జీవితంలో ఇంకెన్నడూ వారిని వీడి అడవిలోకి పోను."

కొంతకాలం గడచింది. పచ్చటోపీమరోసారి ముత్తవ తల్లి వద్దకు వెళ్ళవలసి వచ్చెను. అప్పుడుకూడా ఆమె ముత్తవల్లికొక రొట్టెను తీసుకు పోతోంది. వేరొక తోడేలు ఆమెను కలుసుకొని సరియైన దారినుండి తప్పించ దలచింది. కాని పచ్చటోపీ అపుడు చాలా జాగ్రత్తపడి త్వరత్వరగా ముత్తవ తల్లి ఇంటికి పోయింది. పిమ్మట ఆమె ముత్తవ తల్లితో ఇలా అంది: "నేను దారితప్పి నడచియుంటె తోడేలు నన్ను తినివేసి యుండేదే. నేను సరిగా నడిచి వచ్చాను కనుక సురక్షితంగా వున్నాను." అప్పుడు ముత్తవ తల్లి వీధి తలుపును గట్టిగా బిగించి వేసింది. కొంతసేపయిన తరువాత తోడేలు వచ్చి వీధి తలుపుతట్టి ఇలా అంది: "నేను పచ్చటోపీని వచ్చాను. నీకు రొట్టెను కూడా తీసుకువచ్చాను. తలుపు తియ్యి." లోపలనున్నవారు ఏమీ మాట్లాడలేదు. తలుపు తీయలేదు. అప్పుడు తోడేలు ఇంటిచుట్టూ తిరిగి కప్పు మీదకు ఎక్కి కూర్చుంది. సాయంకాలం పచ్చటోపీ ఇంటికి తిరిగి పోతుందనీ, అప్పుడు చీకటిలో ఆమెను మింగి వేయ వచ్చునని తోడేలు భావించ సాగింది. ముత్తవ తల్లి ఆ విషయం కనిపెట్టింది. అందుచేత ఆమె తోడేలు ప్రాణం తీయటానికి ఒక మంచి ఉపాయం కనిపెట్టింది. ఆమె ఇంటి ముందు ఒక తొట్టి వుంది. ఆ తొట్టి నిండా నీరు వుంది.మున

లమ్మ ఆ తొట్టిలో వేడి గంజి పోసింది! ఇంటిపైనున్న తోడేలుకా గంజి వాసన వేసింది. అపుడది ఇంటి పైనుండియే తొట్టిలోని గంజిని త్రాగదలచింది. అందులకది ఇంటిపైనుండియే తొట్టివద్దకు మెడను చాపటానికి ప్రయత్నించింది. అప్పుడు ప్రమాదవశమున దాని కాళ్ళుజారాయి. తోడేలు నీటి తొట్టిలో పడింది. అది వేడి గంజిలో పూర్తిగా మునిగి పోయింది. అది ఎంత ప్రయత్నించినా పైకి రాలేకపోయింది. అందుచేత అది ఊపిరాడక మరణించింది. సాయంకాలం అయిన తరువాత పచ్చటోపీ ఇంటికి సురక్షితంగాపోయింది.